

వింత ఆవాసం
ఈ చిలక జంట ఎడమొఖం, పెడమొఖానికి ప్రణయ కలహం
కారణం కాదు. గూటిలో దూరి ఒదగడానికి ఒకింత
ముందు విశ్రాంతిగా ఇలా... ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్‌లో
కనిపించే ఈ అరుదైన చిలకలు వాలి వున్నది చెదల పుట్టలే
వాటి గూళ్ళు. చెదలు మట్టితో నిర్మించుకునే
ఈ పుట్టలు గట్టి పడకముందే చిలకలు
అందులో దూరి నివసించడానికి అనువైన
చాంబర్‌ను ఏర్పాటు చేసుకుంటాయి.
2/3

నవ్య నవలా వేదిక

సంపుటి : 29 | సంచిక : 2

మార్చి : 2006 | 338వ సంచిక

# చతుర



## ఈ నెల నవల

అచ్చమైన స్నేహమాధుర్యానికి

అక్షర నీరాజనం పట్టిన

**సృష్టిలో తీయనిది**

పి. హైమవతి





















బొమ్మలు: పినిశెట్టి

# చేయలేనిదేమిటో గుర్తించాలి

## రచయితలకు ప్రత్యేకం

### కథలు-కబుర్లు 16



"క్షితిజరేఖ నెవ్వరూ చేరుకోలేరు. అయినా ప్రయాణమెప్పుడూ ముందుకే సాగాలి. రచయితలు ముత్యపు చిప్పల్లోని పురుగుల్లాంటి వాళ్లు. జీవన సాగరంలో నిత్యపోరాటం. అప్పుడప్పుడూ ఈ ఆయిస్టర్ ఒక ముత్యం తయారుచేస్తుంది. మనం చదువుకునే పుస్తకాలవే" అంటుంది ప్రముఖ రచయిత్రి వర్జీనియా వూల్ఫ్ (1882-1941).

"ప్రపంచ సాహిత్యాన్ని చదవటమంటే ప్రపంచ పర్యటన చేసినట్టే. స్థానికులు పట్టించుకోని బిల్డింగులు, దృశ్యాలు టూరిస్టులకు ప్రత్యేక ఆకర్షణగా ఉంటాయి. ఆయా దేశాల సాహిత్యాలలోని ముఖ్య గ్రంథాలూ అంతే. ఎందుకని ఆకట్టుకుంటాయి? ఏం ప్రత్యేకత ఉంది? మన పుస్తకాలకన్నా భిన్నంగా ఉండటమే వాటి విలక్షణతా? అనువాదాల రూపంలో మనదాకా వస్తున్నాయి. అందువల్ల వాటికి ఆకర్షణ ఎక్కువ. లోకం నలుమూలలు చుట్టినా తిరిగి ఇంటికి రావలిసిందే. మన పుస్తకాల మీద మనం దృష్టి పెడదాం" అని స్వీయ భాషా సాహిత్యాన్ని ఉపేక్షించడం తగదనీ అన్యాపదేశంగా చెబుతుంది.



వర్జీనియా వూల్ఫ్

వర్జీనియా వూల్ఫ్‌ది సంపన్న కుటుంబం మాత్రమే కాదు, ఆమె సమీప బంధువులందరూ వివిధ రంగాలలో నిష్ణాతులు. ఉదాహరణకు తండ్రి సర్ లెస్లీ స్టీఫెన్ "డిక్షనరీ ఆఫ్ నేషనల్ బయాగ్రఫీ' ' సంకలనం చేశాడు. సోదరి వెనెసా ప్రముఖ ఆర్టిస్టు. వెనెసా భర్త కళా విమర్శకుడు. సోదరుడు మానసిక శాస్త్రజ్ఞుడు. సిగ్మండ్ ఫ్రాయిడ్ అనుంగు శిష్యుల్లో ఒకడు.

తండ్రి గ్రంథాలయమే పాఠశాలగా వర్జీనియా తన చదువు కొనసాగించింది. కేంబ్రిడ్జికి వెళ్లాలన్న ఆశ నెరవేరలేదు. విజ్ఞులైన

కుటుంబ సభ్యులు కూడా ఇలా వివక్ష చూపటం ఆమెను బాధించింది. తరువాత రాసిన రెండు పుస్తకాలు- 'ఎ రూం ఆఫ్ వన్స్ ఓన్' (1929), 'త్రీ గినీస్' (1938)లలో స్త్రీవాద తిరుగుబాటు దృక్పథం కనిపిస్తుంది.

వర్జినియా వూల్ఫ్ గొప్ప స్టైలిస్ట్. జేమ్స్‌జాయస్ నవల 'యూలిసిస్' పత్రికలో సీరియల్‌గా వస్తున్నప్పుడే చదివి, ప్రభావితమై 'చైతన్య స్రవంతి' పద్ధతిని అంతకన్నా ప్రతిభావంతంగా, మరింత కవితాత్మకంగా తన నవలల్లో వాడుకుంది. 'మిసెస్ డాలోవే' (1925), 'టు ది లైట్‌హౌస్' (1927), 'ది వేవ్స్' (1931) లాంటి ప్రయోగాత్మక నవలలు ఇందుకు ప్రముఖ ఉదాహరణ.




అనేక నవలలు, కథా సంకలనాలు కాక, సాహిత్య విమర్శ కూడా విస్తృతంగా ప్రచురించింది. ముప్పైయ్యవ ఏట రచయిత, రాజకీయ విశ్లేషకుడు లియొనార్డ్ వూల్ఫ్‌ను వివాహం చేసుకుంది. ఆ తర్వాత 'హోగార్త్ ప్రెస్' స్థాపించి టి.ఎస్. ఇలియట్, కాథరైన్ మేన్స్ ఫీల్డ్, ఇ.ఎం. ఫార్స్టర్ లాంటి వాళ్ల రచనలు లోకానికి పరిచయం చేసింది.

అనారోగ్యంతో కొంత కాలం బాధపడి, భర్తకు భారమవుతానన్న దశలో నీటిలో దూకి ఆత్మహత్య చేసుకుంది. పుస్తక పఠనాన్ని గురించీ, రచనా ప్రక్రియ గురించీ ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాలు మరికొన్ని:

రచయితలు ప్రేమకథలు రాయటానికెందుకంత ఉత్సాహం చూపిస్తారు? నిజజీవితంలో మనం ప్రేమకెంత టైం కేటాయిస్తాం? కాని రచయితలు డజన్లకొద్దీ నవలలు, వందలాది కథలు, ప్రతి పేజీలో ప్రేమ వ్యవహారం వర్ణిస్తూ రాసేస్తుంటారు. బహుశా వీళ్ల తమలో లేని దాని కోసం కాగితాల మీద అన్వేషిస్తున్నారు కాబోలు.

* * *

రచయిత మొదట తను చేయలేనిదేమిటో గుర్తించాలి. అంతకన్నా ముఖ్యం- చెయ్యగలిగిందేమిటో కూడా తెలుసుకోవాలి. కొన్నిసార్లు తమ టెక్నిక్‌తో, శిల్పంతో రచయితలు అందమైన సౌధాలు నిర్మిస్తారు. చూడటానికవి బాగుంటాయి. కాని వాటిలో తిరుగాడే మనుషులుండరు.

* * *

కలలను సాకారం చేసుకున్న వాళ్లు కూడా కలలకతీతులు కారు.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦



ఎమిలీ బ్రాంటీ

# వూదరింగ్ హైట్స్

(1847)

కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

పంథొమ్మిదో శతాబ్దికి చెందిన ప్రముఖ మహిళా రచయిత్రి ఎమిలీ బ్రాంటీ రాసిన ప్రముఖ నవల ఇది. ఈ నవలలో అస్పష్టత, అయోమయం ఎక్కువనీ, పాఠకుణ్ణి గందరగోళంలో పడవేస్తుందనే విమర్శ కూడా ఉంది. అయితే స్విన్‌బర్న్ కవి దీన్ని షేక్స్‌పియర్ 'కింగ్ లియర్'తో పోల్చాడు. విమర్శకుడు లార్డ్ డేవిడ్ సిసిక్ ఇది "గ్రేటెస్ట్ విక్టోరియన్ నావెల్" అన్నాడు. భూత్ బంగ్లాలలో జరిగే కథల్ని ఇంగ్లీషులో 'గోథిక్' సాహిత్యమంటారు. "వూదరింగ్ హైట్స్" అలాంటిదే. అతీంద్రియ శక్తుల ప్రమేయం ఉండదు. కాని పాత్రలందరూ ఆవహించినట్టుగానే ప్రవర్తిస్తారు. దీని కథాకాలం 1801.

ఇక ఇతివృత్తానికి వస్తే - హెత్‌క్లిఫ్ ఒక భూస్వామి. అతడి భూమిని కౌలుకు తీసుకున్న వ్యక్తి లాక్‌వుడ్. ఆ ఎస్టేట్ పేరు వూదరింగ్ హైట్స్. హెత్‌క్లిఫ్ వింతమనిషి. కోపిష్టి. ప్రవర్తన కూడా దురుసుగా ఉంటుంది. ఏదో పనిమీద వచ్చిన లాక్‌వుడ్‌ను కసురుకుంటాడు హెత్‌క్లిఫ్. అతడి ఇంట్లో పనిమనిషి జోసెఫ్, ఆయా జిలా, మరో యువకుడు కూడా ఉన్నారు.

వంటింట్లో ఒక అద్భుత సౌందర్యవతి ఉంది. తొలియవ్వనంలో ఉన్న ఆమె పేరు మిసెస్ హెత్‌క్లిఫ్- విధవరాలు. భూస్వామి కోడలు.

గాలి దుమారం రావటంవల్ల లాక్‌వుడ్ ఆ రాత్రికి భూస్వామి ఇంట్లోనే తల దాచుకోక తప్పలేదు. కాని భూస్వామి అతడికి కనీస సౌకర్యాలు కూడా కల్పించడు. యజమాని కన్ను కప్పి పనివాడు జిలా ఒక మూల గదిలో పడుకొమ్మంటాడు. పాడుబడిన గది కాబోలు దుమ్ము పేరుకుపోయింది. గోడల మీద కాథరైన్ ఎర్న్‌షా, కాథరైన్ లింటన్, కాథరైన్ హెత్‌క్లిఫ్ అని రాసుంది.

ఆ రాత్రి లాక్‌వుడ్‌కో కల వస్తుంది. మంచు తుఫానులో చెట్లు వణుకుతున్నాయి. కిటికీ తలుపు బోల్టు పెట్టబోతాడు. చేతికి ఒక గుడ్డ కట్టిన చేయి తగుల్తుంది. ఒక గొంతు "నా పేరు కాథరైన్ లింటన్. నన్ను లోపలికి రానివ్వండి" అంటూ రోదిస్తుంది. అది చిన్న పిల్ల మొహం. పగిలిన గాజుముక్కతో ఆమె చెయ్యి తెగి రక్తం కారుతుంది. లాక్‌వుడ్ భయంతో కేకేస్తాడు. హెత్‌క్లిఫ్ పరిగెత్తుకొంటూ వస్తాడు.

మర్నాడు తన ఇంటికి తిరిగి వచ్చినా లాక్‌వుడ్‌కు భయం పోదు. మంచం పడతాడు. అతడి పనిమనిషి నెల్లీడీన్ వూదరింగ్ హైట్స్ గురించి చెబుతుంది.

ఒకప్పుడు ఆ ఎస్టేట్ యజమానులు ఎర్న్‌షా వంశీకులు. చిన్న యజమానురాలు కాథరైన్ (ఎర్న్‌షా) అవర్‌పూల్ నుండి ఒక అనాథ కుర్రాణ్ణి తీసుకుని వచ్చి వాడికి హెత్‌క్లిఫ్ అని పేరు పెడుతుంది. ఇంటి యజమానికి వీడంటే ఇష్టమేగాని, అతడి కొడుకు హిండ్లీకి మాత్రం అసహ్యం. గజ్జికుక్కను చూసినట్టుగా చీదరించుకుంటాడు. (నెల్లీ తల్లి కూడా అక్కడే పనిచేసేది) కాథరైన్, హెత్‌క్లిఫ్‌తో దోస్తీ కడుతుంది.

ఇంటి యజమాని మరణం తర్వాత హిండ్లీకి అధికారం వస్తుంది. హెత్‌క్లిఫ్ పరిస్థితి మరింత దిగజారుతుంది. చదువులేదు. గుడ్డల్లేవు. మంచి భోజనం లేదు. రోజూ తిట్లు దెబ్బలు. హెత్‌క్లిఫ్‌లో ద్వేషం రగుల్కుంటుంది. హిండ్లీ మీద ప్రతీకారం తీర్చుకోవాలి. కాథరైన్ పట్ల ప్రేమ కూడా ఇనుమడిస్తుంది.

హిండ్లీ పెళ్లి చేసుకుంటాడు. కొడుకు పుడతాడు. భార్య క్షయతో మరణిస్తుంది. వియోగం భరించలేక హిండ్లీ తాగుడు అలవాటు చేసుకుంటాడు. యవ్వన ప్రావీర్భావంతో కాథరైన్ మరింత అందంగా ఎదిగింది. హెత్‌క్లిఫ్ అంటే ఇష్టం. కాని పక్క ఎస్టేట్ యజమాని ఎడ్గార్ లింటన్ ఆమెను వివాహం చేసుకోవటానికిష్టపడతాడు. ఈ విషయం తెలిసి హెత్‌క్లిఫ్ అంతర్ధానమవుతాడు. కాథరైన్ అతడికోసం నిరీక్షిస్తుంది. ఆరోగ్యం పాడు చేసుకుంటుంది.

మూడేళ్ల తర్వాత లింటన్‌ను పెళ్లి చేసుకుని కొత్త ఎస్టేట్ థ్రష్‌క్రాస్ గ్రేంజ్‌కు వెళ్లిపోతుంది. వైవాహిక జీవితం కొన్నాళ్లు సుఖంగానే గడుస్తుంది. ఒకనాడు హెత్‌క్లిఫ్ ఊడిపడతాడు. మనిషి మారాడు. బాగా డబ్బు సంపాదించినట్టుంది. ఏం చేశాడో, ఎలా వచ్చిందో తెలియదు. అయితే మనిషిలోని స్వాభావికమైన పరుషత్వం మాత్రం తగ్గలేదు.

కాథరైన్ మనసు ఆనందంతో ఉరకలేసింది. లింటన్‌కు మాత్రం అతడు నచ్చలేదు. హెత్‌క్లిఫ్‌కు కూడా అతడంటే జుగుప్స. మరి కొన్నాళ్లకు లింటన్ సోదరి, పద్దెనిమిదేళ్ల ఇసాబెల్లా, హెత్‌క్లిఫ్ మీద ప్రేమ పెంచుకుంటుంది. కాథరైన్ ఆ పిల్లకు హెత్‌క్లిఫ్ గురించి చెబుతుంది. ప్రేమించే స్వభావం కాదు, మనుషులను ద్వేషిస్తాడు. శత్రువులను నాశనం చెయ్యటమొక్కటే జీవిత లక్ష్యం. అయినప్పటికీ తనకు అతడంటే ఇష్టం. ఇసాబెల్లా ఈ మాటలు నమ్మదు. హెత్‌క్లిఫ్ వూదరింగ్ హైట్స్‌లో తిష్టవేస్తాడు. మెలకువగా ఉన్నప్పుడు హిండ్లీ చేసే పనులు రెండే. ఒకటి తాగుడు, రెండు జూదం. హెత్‌క్లిఫ్ ఈ పనుల్లో అతణ్ణి మరింత ప్రోత్సహిస్తాడు. హిండ్లీ అప్పుల్లో కూరుకుపోతాడు. తన ఎస్టేట్‌ను హెత్‌క్లిఫ్‌కు అమ్మేస్తాడు.

హెత్‌క్లిఫ్‌కు ఎడ్గార్ లింటన్ పట్ల పగ రగులుతుంది. తన ప్రియురాల్ని తనకు కాకుండా చేసిన దుర్మార్గుడు. ఇసాబెల్లా తన వలలో పడిందని తెలుసు. ఆమెను కలుస్తాడు. ఈ విషయంలో కాథరైన్‌కు తెలుస్తుంది. మొదట హెత్‌క్లిఫ్‌ను మందలిస్తుంది. కాని ఎడ్గార్



## ఎమిలీ బ్రాంటీ

ఇంగ్లండులో 'బ్రాంటీ సిస్టర్స్'గా పేరు పొందిన - ఛార్లెట్, అన్, ఎమిలీ ముగ్గురూ రచయిత్రులే. ఛార్లెట్ రాసిన నవల 'జేన్ ఐర్', 'అగ్నేస్ గ్రే' రాసింది ఆన్. వీళ్ల తండ్రి ఎక్సెంట్రిక్. ఆయనకున్న ఆ తిక్క మూడవ కూతురు ఎమిలీ బ్రాంటీకీ వచ్చింది. మిగతా ఇద్దరు అక్కా చెల్లెళ్ళూ ఓ అన్నయ్యా కలిసే పెరిగారు. కాని ఎమిలీ ఎవరితోనూ మాట్లాడదు. పుస్తక పఠనంతో స్వంత లోకాన్ని సృష్టించుకుంది. యార్క్‌షైర్ బంజరు భూముల్లో ఒంటరిగా నడుస్తూ ఊహావ్యక్తులతో సహజీవనం అలవాటు చేసుకుంది. తన గదిలోకెవరూ రాకూడదు. తన వస్తువులు, కాగితాలెవరూ చూడ గూడదు. రహస్యంగా కవిత్వం రాసుకునేది. కవయిత్రిగా ఆమెకు మంచి గుర్తింపు ఉంది. 1845 దాకా ఈ విషయం ఇంట్లో తెలియదు. ఆడపిల్లలు ముగ్గురూ నవలలు రాయటం ఒకే సారి ప్రారంభించారు. 'జేన్ ఐర్', 'అగ్నేస్ గ్రే'లకుమంచి పేరే వచ్చింది. కాని అవి సాంప్ర దాయకమైన 'విక్టోరియన్' నవలలు. ఎమిలీ రాసిన 'వూదరింగ్ హైట్స్', అప్పటి పాఠకుల్ని షాక్ చేసింది. ఆమెది 'సిక్ మైండ్' అన్నారు. "ఇందులోని పాత్రలు వ్యక్తులు కారు. కేవలం ఉద్వేగాలకు మనుషుల పేర్లు పెట్టింది. వాస్తవికత అనేది ఏ కోశానా ఉండదు. అది ఒక వింత, భయంకర, ఫాంటసీ లోకం" అని విమర్శించారు. కేవలం మూర్స్ (బంజరు భూములు) వర్ణన, వాతావరణ చిత్రణ ద్వారానే 'మిస్టరీ' సృష్టించగలగటం ఎమిలీ బ్రాంటీ ప్రతిభ. ఎమిలీ ఇరవై తొమ్మిదేళ్లు మాత్రమే బతికింది. ఎమిలీ గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. ఆమె సిస్టర్స్ లేఖల ద్వారానే కొద్దిగానైనా ఆమె ప్రస్తావన వుంటుంది. క్రమ శిక్షణ పేరుతో తండ్రి పిల్లల్ని బాగా కట్టడి చేశాడు. ఇల్లు కదలని, బైటి ప్రపంచంతో సంబంధం లేని ఎమిలీ ఒక భగ్న ప్రేమికురాలిగా కూడా కొంత కాలం గడిపిందని చెబుతారు. ఆ 'ప్రేమికుణ్ణి' యింటికి రానివ్వలేదు తండ్రి. విరహంతో "తాగి" మరణించాడతడు. ఇలాంటి విషయాలు తెలుసుకుంటే ఈ నవల ఇతివృత్తానికి 'క్లూ' దొరుకుతుందేమో.

స్వతహాగా కవయిత్రి గనక నవలలో చాలా భాగాలు కవితాత్మకంగా ఉంటాయి.

కూడా కలుగచేసుకోవడంతో హెత్‌క్లిఫ్ పట్ల సానుభూతి పెరుగుతుంది. ఇద్దరు మగాళ్లూ కొట్టుకుంటారు. "ఇక మళ్లీ మీ మొహం చూసేది లేదని" వెళ్ళిపోతాడు హెత్‌క్లిఫ్.

కాథెరైన్ గుండె పగిలేలా ఏడుస్తుంది. జబ్బు పడుతుంది.

అదే రాత్రి ఇసాబెల్లా, హెత్‌క్లిఫ్‌తో లేచిపో తుంది. కాని ఆమె కలలు పటాపంచలు కావటానికి ఎక్కువ రోజులు పట్టదు. తనను హెత్‌క్లిఫ్ వూదరింగ్ హైట్స్‌లో బంధించి పెట్టాడని ఇసాబెల్లా, నెల్లీకి ఉత్తరం రాస్తుంది. అసలా యిల్లే ఒక నరకం. ఒక వైపు తాగుడు ప్రేలాపనలతో హిండ్లీ, చిక్కిశ ల్యమైన అతడి కొడుకు హెరేటన్.

కాథెరైన్ జబ్బుగా ఉన్నప్పుడు హెత్‌క్లిఫ్ అప్పుడప్పుడూ ఆమె ఇంటి ఛాయలకు వచ్చి పోతూనే ఉన్నాడు. ఒకనాడు ఎడ్గార్ లేనప్పుడు, కాథెరైన్‌ను చూడాలని ఉందని నెల్లీతో చెబుతాడు. అప్పటికామె ఏడు నెలల గర్భవతి. ఇద్దరూ కలిసినప్పుడు ఎడ్గార్ హఠాత్తుగా ప్రవేశిస్తాడు. భయంతో కాథెరైన్ ఆడ పిల్లకు జన్మనిచ్చి మరణిస్తుంది.

ఆ పిల్ల పేరు కూడా కాథెరైన్. హెత్‌క్లిఫ్‌ను ప్రియురాలి (కాథెరైన్) మరణం కుంగతీసింది. చాలా రాత్రులు ఆమె సమాధి వద్దే గడుపుతాడు. ఈ బాధ ఇసాబెల్లా పట్ల కోపంగా మారుతుంది. ఆమెను హింసిస్తాడు. ఆమె కూడా గర్భవతి. భర్త ప్రవర్తన భరించటం అసాధ్యమవుతుంది. ఇంట్లోంచి పారిపోతుంది. కొడుకు పుడతాడు.

హిండ్లీ మరణిస్తాడు. రెండు ఎస్టేట్లకూ ఇప్పుడు హెత్‌క్లిఫ్ సర్వాధికారి. హిండ్లీ

కొడుకు హేర్‌టన్ ఇప్పుడు అతడి అధీనంలో ఉన్నాడు. హిండ్లీ తనకు చదువు చెప్పించలేదు. తనూ హేర్‌టన్‌కు చదువు చెప్పించడు. పనిగట్టుకొని వాడికి దురలవాట్లన్నీ నేర్పిస్తాడు.

ఇసాబెల్లా మరణం తర్వాత ఆమె కొడుకును పెంచుకుంటాడు ఎడ్గార్ లింటన్. కూతురు కాథెరైన్ ఈ కుర్రాణ్ని ఇష్టపడుతుంది.

ఒకనాడు కొడుకును తీసికెళ్లిపోతాడు హెత్‌క్లిఫ్. కాథెరైన్ కజిన్ మీద బెంగపెట్టుకుంటుంది. ఏదో ఒక మిషతో నెల్లీని తీసుకుని వూదరింగ్ హైట్స్ వైపు పోతుంది. హెత్‌క్లిఫ్ ఇంటికి ఆహ్వానిస్తాడు. ఆమెను తన కోడలిగా చేసుకోవాలనుందని నెల్లీకి చెబుతాడు. హెత్‌క్లిఫ్ స్వభావం ఆమెకు బాగా తెలుసు. అతడు హేర్‌టన్‌ను జంతువులాగా పెంచుతున్నాడని కూడా గ్రహిస్తుంది. కాథెరైన్‌ను మళ్లీ అటువైపు పోవొద్దని ఆంక్ష విధిస్తాడు లింటన్. కూతురుకి హెత్‌క్లిఫ్ గురించి చెబుతాడు. అయినా ఆమెను తన కజిన్ (హెత్‌క్లిఫ్ కొడుకు) అంటే ఇష్టం. మరికొన్నాళ్లు ఈ యువతీయువకులు ప్రేమలేఖలు రాసుకుంటున్నారని తెలుస్తుంది. కాథెరైన్ ఉత్తరాలు సహజంగా ఉన్నాయి. కాని ఆ పిల్లాడి ఉత్తరాలు తండ్రి రాయించినట్టుగా ఉన్నాయి.

ఒకనాడు "నీ కజిన్‌కు సీరియస్‌గా ఉంది. వచ్చి చూడ"మంటాడు హెత్‌క్లిఫ్ కాథెరైన్‌తో. అదంతా అబద్ధమని నెల్లీకి తెలుసు. ఎంత వారించినా వినక, కాథెరైన్ వూదరింగ్ హైట్స్‌కు వెళుతుంది. క్రమంగా ఆ అబ్బాయితో ప్రేమలో పడుతుంది. నెల్లీ, ఎడ్గార్ వారిస్తారు. హెత్‌క్లిఫ్ కాథెరైన్‌ను బంధించి బలవంతంగా తన కొడుకుతో వివాహం జరిపిస్తాడు. ఎడ్గార్ మరణిస్తాడు. కాథెరైన్ వూదరింగ్ హైట్స్‌లోనే ఉంటుంది. బోసిపోయిన థ్రష్‌క్రాసిస్ గ్రాండ్‌కు నెల్లీ హౌస్ కీపర్‌గా ఉంటుంది.

ఇంత జరిగినా కాథెరైన్ జీవితం కూడా సుఖంగా గడవలేదు. త్వరలోనే ఆమె భర్త మరణిస్తాడు. హెత్‌క్లిఫ్ అతడికి వైద్యసహాయం నిరాకరించటం అతడి మరణానికి కారణమవుతుంది.

లాక్‌వుడ్ తెలుసుకున్న వూదరింగ్ హైట్స్ వృత్తాంతమిది. అతడికి థ్రష్‌క్రాస్ గ్రేంజ్ అంటే అయిష్టం ఏర్పడుతుంది. అక్కడ ఉండలేక లండన్ వెళ్లిపోతాడు. మరుసటి సంవత్సరం కౌలు ఒప్పందం కాన్సిల్ చేసుకోవటానికి హెత్‌క్లిఫ్ కోసం వెళతాడు.

కాని ఈసారి ఆ దృశ్యం మరింత వింతగా కనిపించింది. ఇంట్లో పెద్దగా అలికిడి లేదు. కాథెరైన్, హేర్‌టన్ పుస్తకాలు చదువుకుంటూ ఓ మూలన కూర్చున్నారు. నెల్లీ ఇప్పుడిక్కడే ఉంటుంది. ఆమె మిగతా కథ చెప్పింది.

(సీనియర్) కాథెరైన్‌మీద ప్రేమ చంపుకోలేక హెత్‌క్లిఫ్‌కు పిచ్చెక్కినట్టుగా ప్రవర్తించాడు. చచ్చి కూడా ఆమె అతణ్ణి వదల్లేదు. ఒకనాడు ఆమె సమాధి తవ్వి, శవపేటిక తెరిచి అస్తిపంజరాన్ని చూశాడు. ఆ తర్వాత అతనిలో చాలా మార్పు వచ్చింది. హేర్‌టన్ మీద జాలిపడి, కాథెరైన్ అతడికి చదువు, సంధ్య నేర్పించింది. క్రమంగా ఇద్దరూ ఒకర్నొకరు ఇష్టపడ్డారు.

హెత్‌క్లిఫ్‌ను ఏదో ఆవహించింది. అతడి ప్రవర్తన మారింది. ఉన్మాదం పెరిగింది. భోజనం మానేశాడు. కొన్నాళ్లు ఒంటరిగా గదిలో గడిపాడు. హఠాత్తుగా ఒకనాడు మరణించాడు.

కాథెరైన్, హేర్‌టన్ ఇప్పుడు భార్యాభర్తలు. "హెత్‌క్లిఫ్, (సీనియర్) కాథెరైన్‌ల ప్రేతాలు ఆ ప్రాంతాల్లో రాత్రిళ్లు కనిపిస్తున్నాయని ఇక్కడివాళ్లు చెప్పుకుంటున్నారు" అంటూ ముగించింది నెల్లీ.

మిగతా లోపాలెన్ని వున్నా వూదరింగ్ హైట్స్ ఒక ఎక్స్‌ట్రా ఆర్డినరీ నవల అన్నది మాత్రం సాహిత్యకారుల ఏకాభిప్రాయం.

– ఎం. వసంత ✦

చిన్ననాడు కయ్యంతో మొదలైన అనుబంధం వారిద్దరినీ విడదీయరానంతగా చేరువ చేసింది.వారి వయసుతో పాటే ఆ బంధమూ పెరిగింది. సిసలైన స్నేహానికి నిలువెత్తు ప్రతిరూపాలైన ఆ ఇద్దరు స్నేహితురాళ్లది ఒకటే ఆలోచన, ఒకటే మార్గం, ఒకటే విధానం. ఒకరి పెళ్లి కుదిరేవరకు మరొకరు తమ పెళ్లినే సంవత్సరాల తరబడి వాయిదా వేసుకున్నారంటే వారి మధ్య ఆత్మీయతానురాగం ఎంత గాఢమైందో విశదమవుతుంది. కానీ విధి ఆడిన నాటకంతో పరిస్థితులు తారుమారై ఒకరికి వివాహమై పోతుంది. మరొకరు బాధ్యతల బరువును మోస్తూ గడపవలసిన అనివార్య పరిస్థితి. ఎందుకిలా జరిగింది? ఆ తర్వాతేమైంది?...



చక్కటి కథాకథనంతో స్నేహ మాధుర్యానికి అక్షర నీరాజనం పట్టిన **హైమవతి** నవల **సృష్టిలో తీయనిది** ఈ నెల చతుర సమర్పణ.

# సృష్టిలో తీయనిది

— హైమవతి



ఇల్లంతా పచ్చని తోరణాలతో కళకళలాడుతోంది. మరో పదిహేను రోజుల్లో కానున్న చిన్నకూతురి పెళ్లికోసం ఇప్పటి నుండే హడావిడి పడిపోతోంది ఇందిరమ్మ. పెళ్లి ఇంట్లో ఉండే సందడి సంరంభం అంతా ఇందిరమ్మ ముఖంలోనే ప్రతిఫలిస్తోంది. బియ్యం, పప్పులూ బాగు చేయడం అయిపోయింది. ఇంటికి సున్నాలు కొట్టడం, గడపలకు రంగుల పూసి బొట్లు పెట్టడం కూడా పూర్తయింది. ఇక వడియాలూ, అప్పడాల పనే ఉంది!

చెల్లెలి పెళ్లి కోసం కమల ముందుగానే వచ్చి ఉండడంతో అక్కచెల్లెళ్లిద్దరూ కలిసి ఇల్లంతా రంగవల్లులతో తీర్చిదిద్దారు. పనులన్నీ పూర్తయినట్లు కనిపిస్తున్నా విశ్వనాథం, ఇందిరమ్మలు దేనికో ఓ దానికి బజార్ల చుట్టూ తిరుగుతూనే ఉన్నారు.

అసలు చిన్న కూతురు ఆలోచనా విధానం, మంకు పట్టుదలా చూశాక మాలతికి ఈ జన్మలో పెళ్లి కాదేమోనని బెంగ పెట్టుకున్నారు ఇంత కాలం. అలా అని చిన్నకూతురి వాదనలో గల వాస్తవాన్నీ, వివేచననూ కాదనలేక పోయేవారు. తాహతుకు మించిన పరుగులు పెట్టి చతికిల పడడం అనేది మాలతికి నచ్చని విషయం! అలాగే తాను చదువుకుని సంపాదిస్తూ కూడా వరకట్నం ఎందుకు ఇవ్వాలనేది ఆమె వాదన. ఆచారం, సాంప్రదాయం అని తల్లిదండ్రులంటే, ఇవన్నీ మనం కల్పించుకున్నవే కదా అని కొట్టిపారేస్తుంది.

తన అక్క పెళ్లిలా తన పెళ్లి తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితి మీద ఎటువంటి భారం మోపరాదనే నిశ్చయంతో ఇంతకాలం పెళ్లి వాయిదా వేస్తూ వచ్చింది. అయితే అనుకోని విధంగా చిరంజీవితో మాలతి వివాహం నిశ్చయం కావడంతో అది కూడా మాలతి ఆలోచనలకు అనుకూలంగా ఉండడంతో అందరి మనసులూ ఆనందంతో నిండిపోయాయి.

కట్నకానుకలు లేకపోయినా పెళ్ళయినా ఘనంగా చేయాలని తల్లిదండ్రుల ఆలోచనకు మొదట్లోనే బ్రేక్ వేసింది మాలతి. "ఎందుకమ్మా లేనిపోని ఆడంబరాలకు పోవటం? మన తాహతుకు మించి ఖర్చు పెడితే ఈరోజు ఆహా... ఓహో అన్నవాళ్ళే రేపు మనం ఇబ్బందుల్లో కూరుకుపోతే హేళనగా నవ్వుతారే తప్ప ఒక్క రూపాయి సాయం చేయరు. కమలక్క ఆడపడుచు పెళ్లి వాళ్ల మామగారు ఉన్నంతలో ఎంత క్లుప్తంగా చేశారో తెలుసా? నా పెళ్లి కూడా అలాగే సింపుల్‌గా చెయ్యండమ్మా. మనింటి ముందర ఇంత ఖాళీ స్థలం ఉందికదా. వేరే కళ్యాణ మండపాలెందుకు బుక్ చేసి డబ్బు తగలెయ్యడం? కేటరింగ్‌ల పేరుతో డబ్బు వేస్టు చేసేకంటే, శుభ్రంగా వంటవాళ్లను పెట్టి వండించండి. ఆడంబరాలకు పోకుండా, ఉన్నంతలో చెయ్యండి!"- అలా మాలతి తల్లిదండ్రుల నోటికీ చేతికీ తాళం వేసింది.

"ఏమిటే నీదంతా మెట్ట వేదాంతం? ప్రతి దానికీ కాలికీ చేతికీ ఇలా అడ్డు తగులుతూ ఉంటే, ఇక మా పని అయినట్లే! పెద్దవాళ్లం, మా బాధలేవో మేం పడతాం. నీకెందుకు?" అంది ఇందిరమ్మ మందలింపుగా.

"వద్దమ్మా, నన్ను చిన్నదాన్ని చేసి నా నోరు కట్టెయ్యకండి. మీరు ఖర్చు చేసే ప్రతి రూపాయి నాన్నగారు చెమటోడ్చి సంపాదించిందే. అది చాలక మీరు అప్పుల పాలయితే నేనక్కడ అత్తవారింటిలో స్థిమితంగా ఉండలేనమ్మా. ప్లీజ్ నన్నర్థం చేసుకోండి!" అంది మాలతి అర్థింపుగా.

ఈ కాలం ఆడపిల్లల్లా కలల్లో తేలిపోకుండా జీవితం పట్ల స్థిరమైన అవగాహనతో చెప్పే మాలతి మాటను కాదనలేకపోయారు విశ్వనాథం దంపతులు.

అక్క ఆలోచనలకు అనుగుణంగా, ఉడతా భక్తిగా వాసూ, శ్రీకాంతూ రంగు కాగితాలు తెచ్చి కట్ చేసి అందమైన తోరణాలుగా, పూల బుట్టలుగా తయారుచేసి అలంకరించి ఇంటికి కొత్త అందాన్ని తెచ్చారు.

* * *

## రచయిత్రి పరిచయం

విశాఖపట్నం జిల్లా అనకాపల్లిలో 1953లో జననం. బి.ఎ. చదివారు. చదవడం, రాయడం రెండూ ఇష్టమే. సంగీతమంటే అమిత మక్కువ. అభిమాన రచయిత కొడవటిగంటి కుటుంబ రావు. అభిమాన కవి తిలక్. స్వాతి, ఆంధ్రభూమి మాసపత్రికలలో హైమవతి నవలలు సీరియల్స్‌గా, మినీ నవలలుగా వచ్చాయి. మరో రెండు నవలలు త్వరలో సీరియల్‌గా రాబోతున్నాయి. వివిధ పత్రికలలో దాదాపు పది కథలు ప్రచురితమయ్యాయి. విశాఖలోని సీనియర్ సిటిజన్స్ స్థాపించిన 'స్నేహసంధ్య' సంస్థ నిర్వహ ణలో వెలువడుతున్న 'సంధ్యారాగం' బులెటిన్‌కి తాత్కాలిక సంపాదకురాలిగా వ్యవహరిస్తున్నారు.

**పెబ్బిలి హైమవతి,**
9-9-127/1, శివాజీపాలెం,
విశాఖపట్నం-17.

కమలతో పాటు వడియాలు పెడుతూ ఉన్నట్లుండి అడిగింది మాలతి. "అక్కా! చిరంజీవిగారి అమ్మానాన్నలు ఇలా కట్నకానుకలు లేని పెళ్లి చేసుకుంటున్నందుకు ఏమీ అన లేదా? "

"ఏమిటే బాబూ నువ్వు? పెళ్లి పది రోజుల్లో పెట్టుకొని నీ ధర్మ సందేహాలూ నువ్వూను ! ఎవరైనా వింటే నవ్వుతారు" అంది కమల పరిహాసంగా.

"అది కాదక్కా! వారింట్లోకి కొత్తగా అడుగు పెడుతున్న నాకు ఎలా స్వాగతిస్తారోనని బెంగగా ఉందే. వెళ్లడం వెళ్లడంతోనే ఎటు వంటి పరిస్థితినెదుర్కోవలసి వస్తుందోనని ఆలోచిస్తున్నానంతే" అంది మాలతి.

"బాగుందే! ఇంత భయపడేదానివి మరి ఈ కట్నాలు లేని పెళ్లెందుకు చేసుకుంటు న్నావు? " అంటూ దిగులుగా తనవంకే చూస్తోన్న మాలతి భుజం తట్టి "మొద్దూ, భయపడకే! చిరంజీవి తల్లిదండ్రులు చాలా మంచివాళ్లు. నలుగురితో నారాయణా అనే పద్ధతేగాని వాళ్ళకి పెద్దగా కట్నకానుకల మీద ఆశల్లేవు. పైగా కట్నం వద్దంటే ఏదో లోపం ఉందని అనుమానించే ప్రబుద్ధుల నెంతమం దిని చూడలేదు మనం? అయినా ఎవరేం తెచ్చుకున్నా వాళ్లకేగాని మాకేమన్నా ఇస్తా రా? ఆ మాత్రం దానికి అవసాన దశలో చూడవలసిన కోడలితో శత్రుత్వం ఎందుకని మా అత్తారి వంక వాళ్ళ ఆలోచనలు. వాళ్ల మాట తీరు, ప్రవర్తనా మా ఆడపడుచు పెళ్లిలో చూశావు కదా నువ్వు కూడా. కనుక లేనిపోని అనుమానాలతో బెంగ పెట్టుకోక హాయిగా ఉండు" అంది కమల అభయం ఇస్తున్నట్లుగా.

కమల మాటలు విన్న మాలతి తేలిగ్గా ఊపిరి తీసుకుంది. కొంతసేపయ్యాక "చిరంజీ విగారి అభిరుచులూ, అలవాట్లు గూర్చి కాస్త చెప్పవే అక్కా!" అంది మాలతి అక్కగారి వంక ఆసక్తిగా చూస్తూ.

"ఏమీ తెల్సుకోకుండానే అమ్మా నాన్నల ప్రమేయం లేకుండా సంబంధం కుదుర్చుకు న్నారుగదే మీ ఇద్దరూ కల్సి. కొత్తగా తెల్సు కునేందుకేముంది? అభిరుచుల సంగతి తర్వాత. ముందు పనికానీ! అవతల ఎండ మండిపోతోంది" అంది కమల పరిహాసంగా చెల్లెలి వంక చూస్తూ.

"అబ్బ మురిపించుకోక చెప్పవే బాబూ! ఆయన తరచూ మీ ఇంటికి వస్తూ ఉంటా రట కదా" అంది నవ్వేస్తూ మాలతి.

"ఆహా! అప్పుడే చిరంజీవి ఆయనా అయి పోయాడటే నీకు? " అంది కమల అల్లరిగా నవ్వుతూ.

"ఛ పోవే, నిన్నడగడం నాదే బుద్ధి తక్కువ!" అంటూ విసురుగా వడియాలు పెట్టసాగింది మాలతి.

"తెలిసింది కదా ఇక అడక్కు. అయినా తినబోతూ రుచులడిగినట్లు ఎందుకే నీకంత

ఆరా!" అంటూ బుంగమూతి పెట్టిన మాలతి బుగ్గ మీద చిన్న దెబ్బవేసింది కమల.

వాళ్లిద్దరి దగ్గరికీ వాసు పరుగెత్తుకుంటూ వచ్చి "అక్కా...అక్కా ఇది విన్నావా? మన స్వాతక్క నాన్నగారు ఓ గంట క్రితం గుండె పోటుతో చనిపోయారట. అక్కడంతా గోలగోలగా ఉందక్కా!" అంటూ వచ్చి చెప్పాడు.

పిండిగిన్నె కడిగి లోపలికి తీసుకెళ్తున్న కమల తమ్ముడి మాట విని చేతిలో గిన్నె అక్కడే వదిలేసి "ఏమిట్రా నువ్వు సరిగ్గా చూశావా? " అని అడిగింది ఆతృతగా.

"చూశానక్కా చనిపోయింది రంగారావు గారే!" అన్నాడు వాసు పరిగెత్తి రావడం వల్ల ఇంకా ఆయాసపడుతూనే.

మాలతి అయితే ఒక్క క్షణం షాక్ తిన్నట్లుగా అయిపోయింది తమ్ముడి మాటలు విని. చెల్లెలి వాలకం చూసిన కమల గాభరా పడుతూ "మాలతీ... మాలతీ!" అంటూ భుజాలు పట్టుకుని కుదిపింది.

కమలవైపు నిస్తేజంగా చూస్తూ "నాకేం కాలేదక్కా. పాపం అక్కడ స్వాతి ఎలా గుందో? నిన్న సాయంత్రమే కదా మనం అంకుల్‌ని చూసింది. అప్పుడు బాగానే ఉన్నారు కదక్కా. ఇంతలోనే ఇలా ఎలా జరిగింది? " అంటూ చెప్పులు తొడుక్కుంది స్వాతి దగ్గరకు వెళ్లేందుకు.

"ఉండవే మాలతి, నేను కూడా వస్తాను. ఈ మాట విన్న దగ్గర నుండీ నాకు కాళ్లూ చేతులూ ఆడడం లేదు" అంటూ కమల కూడా చెల్లెలి వెంట బయలుదేరింది.

"ఈ వేళప్పుడు ఎక్కడకు బయలు దేరారే? " అంటూ వెనక నుండి ఇందిరమ్మ అడిగేది కూడా వినిపించుకోకుండా ఇద్దరూ పరుగు లాంటి నడకతో బయలుదేరారు అక్కడికి దగ్గరలోనే ఉన్న స్వాతి ఇంటికి.

వాసు తల్లితో అంటున్న మాటలు లీలగా వినిపిస్తూండగా సందు మలుపు తిరిగారు అక్కచెల్లెళ్లిద్దరూ కలిసి. విషయం విన్న ఇందిరమ్మ "అయ్యో పాపం!" అంది







జాలిగా.

మాలతిని చూడడంతోనే స్వాతి "చూశావా మాలతీ! నాన్నగారు మాకెంత అన్యాయం చేసిపోయారో? " అంటూ స్నేహితురాలిని అల్లుకుపోయింది. గుండెలు పగిలేలా ఏడుస్తూ.

"ఇలా అయిపోయిందేమిటే స్వాతీ? " అంది మాలతి కళ్లలో కన్నీరు చిప్పిల్లుతుంటే.

జానకమ్మ అయితే భర్త హఠాత్తుగా కన్ను మూయడాన్ని ఇంకా జీర్ణించుకోలేకపోతున్నది. కూతురి పెళ్లికి కావలసిన సరంజామా తెచ్చేందుకు గంట క్రితం బజారుకు బయలు దేరిన భర్త శాశ్వతంగానే తమనుండి సెలవు తీసుకుంటాడని కలలో కూడా ఊహించలేదు. కన్నీరు మున్నీరుగా విలపిస్తూ రంగారావు పాదాల దగ్గరే కుప్ప కూలిపోయింది.

ఆ దుఃఖం ఉధృతి కొంత తగ్గాక "ఎలా జరిగిందే స్వాతీ ఇది? " అనడిగింది మాలతి.

"నాన్నగారు సామాన్లు తెచ్చేందుకు మార్కెట్‌కు బయలుదేరారు. ఇంతలో రిజిష్టరు పోస్టు రావడంతో, సంతకం పెట్టి లెటర్ తీసుకున్నారు. అది చదివి మాటా పలుకూ లేకుండా ఇదిగో ఇలా కుప్ప కూలిపోయారు ఇక్కడే! ఆ దిక్కుమాలిన ఉత్తరం మా జీవితాలనిలా తారుమారు చేసేసింది" అంది స్వాతి వెక్కిళ్లు పెడుతూ.

"అయ్యో స్వాతీ ఏముందమ్మా అందులో? " అంది కమల బాధగా చూస్తూ.

"నాన్నగారి సంగతి మనందరికీ తెలిసిందే కదక్కా! అడిగిన వాళ్లకి లేదనకుండా సాయం చేస్తారు. అలాగే తెలిసిన వారని ఎవరికో షూరిటీ సంతకం పెట్టారట. అతను తీర్చవలసిన రెండు లక్షల రూపాయలకు నాన్నగారే జవాబుదారీ కనుక డబ్బు కట్టమని అతనికి అప్పు ఇచ్చిన ఫైనాన్స్ కంపెనీ వాళ్లు నాన్నగారికి నోటీసు పంపించారు. డబ్బు కట్టకపోతే చట్టబద్ధమైన చర్యలు తీసుకుంటామనే బెదిరింపుతో. నాన్నగారు ఇప్పటికిప్పుడు అంత డబ్బు ఎలా తేగలరు. ఆ షాక్‌తో నాన్నగారు ఇలా..." చెబుతున్న స్వాతి గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

స్వాతి ఏడవడం చూసి చిన్నవాడైన రవి అక్కను పట్టుకొని "అక్కా నాన్నగారింక మనకు లేరా? ఇది నిజం కాదని చెప్పక్కా!" అంటూ స్వాతిని పట్టుకొని బిగ్గరగా ఏడ్చాడు. తన బిడ్డలిద్దరినీ ఆ స్థితిలో చూసిన జానకమ్మ,

"ఎంత అన్యాయం చేశారండీ మాకు? ఏం పాపం చేశామని మాకింత శిక్ష వేశారు మీరు? " అంటూ తల బాదుకొని ఏడ్చింది.

వెన్నెల తప్ప చీకటి ఎరుగని వారి జీవితాల్లో మొదటిసారిగా చీకటి ప్రవేశించింది. అప్పటివరకూ ఆనంద నిలయంగా ఉన్న ఆ ఇల్లు విషాద నిలయంగా మారిపోయింది.

పెళ్ళి బాజాలతో కళకళలాడవలసిన ఆ ఇల్లు చావు మేళాలతో, ఏడ్పులతో మార్మోగిపోయింది. స్వాతి పెళ్లి ఆహ్వానాలందుకొని చావు విందుకు వచ్చారంతా.

రంగారావుగారు చనిపోయి ఆ వేళ్టికి పన్నెండు రోజులయింది. దిన కర్మలన్నీ పూర్తయ్యాక ఎవరింటికి వాళ్లు పయనమయ్యారు. స్వాతి చేసుకోబోయే సూర్య కుటుంబం తప్ప.

స్వాతి, మాలతిల పెళ్లిళ్లకు ఒక్కరోజు తేడాలో ముహూర్తాలు కుదిరాయి. మొదటి రోజు స్వాతిది, మరునాడు మాలతిది. రంగారావుగారు ఇలా అర్ధాంతరంగా పోవడంతో మరో రెండు రోజుల్లో జరగవలసిన స్వాతి పెళ్లి ఆగిపోయింది.

తమ ఇంట్లో జరుగుతున్న పెళ్లి పనులను పక్కకు పెట్టి స్వాతి దగ్గరే ఉండిపోయింది మాలతి. అనుక్షణం తన స్నేహితురాలిని కంటికి రెప్పలా చూసుకుంటూ జానకమ్మ పరిస్థితి పసిపిల్ల కంటే అధ్వాన్నంగా మారిపోయింది. తిండి తిప్పలు పూర్తిగా మానేసింది. సూర్య బలవంతానా చిన్నపిల్లకు తినిపించినట్లు తినిపిస్తే రెండు ముద్దలు తింటుందంతే.

పెళ్లి నాలుగు రోజులలో పెట్టుకొని ఇంకా మాలతి అలా చావు ఇంట్లోనే ఉండిపోవడం ఇందిరమ్మకు ఎంత మాత్రం నచ్చలేదు. అలా అని చిన్ననాటి నుండీ ప్రాణంలా పెరిగిన ఆ పిల్లల మనసును నొప్పించి దూరం చేయలేక మథన పడసాగింది. తల్లిపోరు పడలేక ఆ రోజు జానకమ్మను పలకరించడానికి వచ్చిన తల్లి వెంట బయలుదేరింది మాలతి అయిష్టంగా.




తడిపిన బట్టలు ఆరవేసేందుకు పెరటివైపు వెళ్ళిన స్వాతి తన కాబోయే అత్తమామలైన అమ్మమ్మా తాతయ్యల మాటలు అనుకోకుండా విన్నది.

"నువ్వేన్నయినా చెప్పు శాంతా! మునుపటి విషయం వేరు, ఇప్పుడు వేరు. ఏదో అయిన సంబంధమని స్వాతిని మన సూర్యానికి చేసుకోవాలని అనుకున్నాం కానీ ఇప్పుడు స్వాతిని చేసుకుంటే స్వాతితో పాటు జానకీ, రవిల బాధ్యతలు మన నెత్తిన పడతాయి. కొడుకు పెళ్లి చేసి క్రిష్ణా రామా అని నిశ్చింతగా ఉండవలసిన ఈ వయసులో తిరిగి ఈ బరువు బాధ్యతలు మన నెత్తినా వేసుకోవాలి లేదా ఇప్పుడిప్పుడే జీవితంలో అడుగిడుతున్న సూర్య నెత్తినయినా పెట్టాలి. అది నాకిష్టం లేదు!" అన్నాడు రాజయ్య.

"గతంలో నేనెప్పుడయినా స్వాతిని మన సూర్యానికి చేసుకుందామని చెప్పానా అసలు? నిక్షేపం లాంటి మా అన్నయ్య కూతురు నీలవేణిని చేసుకుందామని చెవినిల్లు కట్టుకుని పోరాను. మీ తండ్రీ కొడుకులిద్దరూ నా మాట విన్నారు కాదు ఆనాడు. ఇప్పుడు వీళ్ల ఆపదలో ఉండగా ఇలా అర్థాంతరంగా వదిలేస్తే నలుగురూ మన ముఖాన ఉమ్మేస్తారు తెలుసా? ఇంతకాలం నా అన్న మనవరాలు అంటూ ఎగబడ్డారు కదా. అనుభవించండి!" అంది శాంతమ్మ దెప్పిపొడుస్తున్నట్లుగా.

"అది కాదు నాన్నా! జానకక్క మనకు పరాయిదా బరువనుకునేందుకు? స్వయానా మీ అన్నగారి కూతురే కదా. ఇదే మీ కూతురయి ఉంటే ఇలా అర్థాంతరంగా వదిలేస్తామనే వారా? అయినా మనం ఒక పసివాడికీ తల్లికీ తిండి పెట్టలేనంత దీనస్థితిలో ఉన్నామా? అన్నీ సిద్ధం చేసుకున్నాక ఇప్పుడేదో అవాంతరం వచ్చిందని ఏకంగా పెళ్లే వద్దనడం ఏమైనా బాగుందా? ఇదే పెళ్లయ్యాక జరిగితే ఏం చేసేవారు? పీటలమీద పెళ్లి ఆగిపోతే స్వాతికి జన్మలో పెళ్లవుతుందా?" అన్నాడు సూర్య ఆవేశంగా.

"అప్పటి మాట అది ఏదో జరుగుతుందని ముందునుండీ ఊహించి పెట్టుకోవడం నా కలవాటు లేదు. మేము బయలుదేరుతున్నాము. మాతో పాటు నువ్వూ బయలుదేరితే మంచిది!" అన్నాడు రాజయ్య కటువుగా.

"నాన్నగారూ! నేను సీరియస్‌గా చెప్తున్నాను. స్వాతిని తప్ప మరెవరినీ నా పక్కన ఊహించుకోలేను. నేను పెళ్లంటూ చేసుకుంటే స్వాతినే చేసుకుంటాను. అక్కా రవీ మనకూ భారమనుకుంటే స్వాతి కూడా జాబ్ చేసి సంపాదిస్తుంది. అప్పుడు మీకెలాంటి అభ్యంతరం ఉండదు కదా!" అన్నాడు సూర్య నచ్చజెప్తున్నట్లుగా.

"ఆ చేస్తుంది ఉద్యోగాలు చెట్లకు కాస్తున్నాయక్కడ!" అన్నాడు రాజయ్య హేళనగా.

"అది కాదండీ వచ్చిన బంధువులంతా నెల తిరక్కుండా పెళ్లి చేసేస్తే రంగారావుకి కన్యాదాన ఫలం దక్కుతుందంటున్నారు. ఇప్పుడీ పెళ్లి కాదని మనం వెళ్లిపోతే నలుగురూ మనల్నే ఆడి పోసుకుంటారు" అంది శాంతమ్మ. ఆవిడకు జరిగిందాని గూర్చి బాధ



కంటే నలుగురూ అనిపోతారన్న దిగులే ఎక్కువగా ఉంది. అదే సమయంలో ఎలాగైనా ఈ పెళ్లి తప్పిపోతే తన అన్న కూతురు నీలవేణిని సూర్యకి చేసుకోవాలని మనసులోనే ఉవ్విళ్లూరసాగింది.

ఆద్యంతం ఆ సంభాషణంతా విన్న స్వాతి మనసు బాధతో సుడులు తిరిగింది. ఇంత కాలం ఎంతో ఆప్యాయత కనబరుస్తూ వచ్చిన అమ్మమ్మా తాతయ్యల నిజస్వరూపం ఇదా? ఎంత స్వార్థం? మమతా మానవత్వాల కంటే డబ్బుకే విలువా ప్రాధాన్యతా ఇస్తున్నారు. నాన్నగారు పోయిన దుఃఖం ఇంకా తీరనే లేదు. అమ్మా తమ్ముళ్ల బాధ్యత ఎక్కడ మీద పడుతుందోనని ఆలోచిస్తున్నారు.

అందుకేనా నిన్న నాన్నగారి ఆదాయ వివరాలు నాన్నగారి కొలీగ్స్ నడిగి తెలుసుకుంటున్నాడు తాతయ్య. అప్పులకు పోను మాకు పెద్దగా మిగిలేదేమీ లేదని తెలియడంతో ఇలా తప్పుకోవాలని చూస్తున్నారా? ఈ సంగతి అమ్మకు తెలిస్తే ఇంకెంత బాధపడుతుందో? అవసరమైతే సూర్య మామయ్య, తాతయ్యల కాళ్లు పట్టుకొని బతిమాలి ఈ పెళ్లి జరిగేలా చూస్తుంది. తనూ, తమ్ముడూ భారం కాకుండా ఎక్కడికయినా దూరంగా వెళ్లిపోతాం అంటుంది.

అమ్మా నాన్నల చేతిలో నేనెంత అపురూపంగా పెరిగాను? నాలాగే పుట్టిన నా తమ్ముడు రవి. నా పెళ్లి మూలంగా దిక్కులే



నివాడిలా పరుల పంచన పెరగాలా? నో అలా జరగడానికి వీల్లేదు. ఏదో చెయ్యాలి అనుకుంది స్వాతి. కాని ఏం చేస్తే బాగుంటుందో వెంటనే అంతు చిక్కలేదు.

ఇన్నాళ్లు హాయిగా ఆడుతూ పాడుతూ గడిపేసింది. గతమంతా ఓ సుందర స్వప్నంగా సాగితే భవిష్యత్తు పెనుభూతంలా స్వాతిని భయపెడుతోంది చాలా ఆలోచించిన మీదట, తాను ఈ పెళ్లి మానుకోవడమే పరిష్కారంగా భావించింది స్వాతి.

తానీ పెళ్లి వద్దని చెప్తే అమ్మమ్మ, తాతయ్యలు పైకి బాధపడినా లోలోపల చాలా సంతోషిస్తారు. సూర్య మామయ్య మాత్రం చాలా బాధ పడతాడు. కానీ తప్పదు! తానీరోజు తెగించి చెప్పకపోతే జీవితాంతం ఎదురయ్యే అనేక సమస్యలకు మరింత బాధ పడవలసి వస్తుంది. నిత్య సంఘర్షణలతో జీవితంలో పొందవలసిన ఆనందం పొందలేక ఎందుకు చేసుకున్నానా ఈ పెళ్లి? అని ఏదో ఒకరోజు సూర్య మామయ్య కూడా అనుకుంటే దాన్ని తాను భరించగలదా?

మరో పక్క తన తమ్ముడిని డాక్టరుని చేయాలని కలలు గన్న తన తండ్రి కలలను మరొకరి నీడలో ఉండి ఎలా పండించగలదు తను? ఏ మాత్రం ప్రేమాభిమానాలు లేని ఆ ఇంట్లో తన తల్లీ తోబుట్టువు పరిస్థితి ఏమిటి? వద్దు. నా తల్లికీ, తమ్ముడికీ అలాంటి దుస్థితి ఎన్నటికీ రానీయను అనుకుంది స్వాతి ధృఢంగా.

సూర్య తల్లిదండ్రులు వెళ్లాక స్వాతి దగ్గరకు వచ్చాడు. కాని ఏం మాట్లాడాలో తోచని వాడిలా మౌనంగా ఉండిపోయాడు స్వాతినే చూస్తూ. "ఇంత అమాయకురాలు అమ్మా నాన్నల ఆలోచన గూర్చి తెలిస్తే తట్టుకోగలదా? అన్నీ సవ్యంగా జరిగి ఉంటే మరో మూడు రోజుల్లో తమ పెళ్లి వైభవంగా జరిగి ఉండేది. కాని విధి వక్రించడం అంటే ఇదేనేమో! అమ్మా నాన్నల ఆలోచనలు ఎలా ఉన్నా ఈ పిచ్చిపిల్లను, ఈ అందాల రాశిని ఎట్టి పరిస్థితులలోనూ నేను ఒదులుకోను!" అనుకున్నాడు స్థిరంగా.

సూర్య ఆలోచనలలో మునిగి ఉండడం గమనించిన స్వాతి. "నువ్వు కూడా ఇవ్వాళే వెళ్తున్నావా మావయ్యా?" అంది దిగులుగా చూస్తూ.

"లేదు స్వాతీ! నేనేం అనుకోవడం లేదు, నువ్వెలా చెయ్యమంటే అలా చేస్తాను".

అన్నాడు సూర్య మార్దవంగా.

"అది కాదు, ఈ రోజు అందరూ ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోవాలటకదా. అందుకే తాతయ్యా, అమ్మమ్మా మధ్యాహ్నం భోజనాలయ్యాకే బయలుదేరి వెళ్లారు. నువ్వు కూడా..."

"అవన్నీ బంధువులకు వర్తిస్తాయి. స్వాతీ నేను నీకు బంధువును మాత్రమే కాదుగా? " అన్నాడు సూర్య.

ఆ మాటలకు బదులు చెప్పలేనట్లుగా కళ్లు వాల్చుకుంది స్వాతి. సూటిగా సూర్య కళ్లలోకి చూస్తే అతని కళ్లల్లో కదలాడే ప్రేమకు తాను బందీనై పోతానేమోనని.

ఏదో చెప్పాలని ఉన్నా ఏమీ చెప్పలేని అశక్తత ఇద్దరిలోనూ ఉంది. స్వాతి తండ్రి పోయిన దుఃఖంలో అలా ఉందనుకున్నాడే గాని తమ మాటలన్నీ విన్నదని, దాని ఫలితంగా స్వాతి తీసుకున్న కఠోర నిర్ణయం తమ జీవితాలనే తలకిందులు చేయబోతోందని ఊహించలేకపోయాడు సూర్య.

అతని కళ్లకి స్వాతి ఎప్పుడూ పసిపిల్లలాగే కనిపిస్తుంది. అందుకే ఓదార్పుగా స్వాతిని చేతుల్లోకి తీసుకొని హృదయానికి హత్తుకొని ఓదార్పుగా తల నిమరసాగాడు.

స్వాతి సేద తీరినట్లుగా సూర్య గుండెల మీద వాలిపోయింది. ఆ క్షణంలో సూర్యని తాను పెళ్లి చేసుకోకూడదు అన్న నిర్ణయాన్ని విస్మరించింది.

"అక్కా! అమ్మ రమ్మంటోంది" అంటూ వచ్చాడు రవి. ఆ మాటలు విని ఇద్దరూ విడివడి జానకమ్మ దగ్గరకు వెళ్లారు.

"సూర్య అన్నీ అనుకున్నట్లు జరిగితే మన ఇల్లు కళకళలాడే పచ్చ తోరణాలతో ముస్తాబయి ఉండేదీ పాటికి. అందరూ మీ బావగారు పోయిన నెలలోపే స్వాతి పెళ్లి కానిచ్చేస్తే ఆయనకు కన్యాదాన ఫలం దక్కుతుంది అంటున్నారు. అమ్మా నాన్నలతో మాట్లాడుదామంటే నాన్న ఏదో అర్జంటు పని ఉందంటూ వెళ్లిపోయాడు. మళ్లీ వస్తాంకదా మాట్లాడదాంలే అని. ఉదయమే శాస్త్రులుగారి నడిగాను. ఈ నెలాఖరులోనే మంచి ముహూర్తాలున్నాయన్నారు. మరి నువ్వేమంటావు? " అంది జానకమ్మ.

"నాదే ముందక్కా. మీరందరూ ఎలా చెప్తే అలాగే!" అన్నాడు సూర్య తేలిగ్గా నవ్వేస్తూ.

"ఇప్పుడు పెళ్లి మాటలేమిటమ్మా? మతుండే మాట్లాడుతున్నావా? నాన్నగారికి ఆత్మశాంతి కలగాలంటే ఇదేనా మార్గం? ఇప్పుడప్పుడే అలాంటి ఆలోచనలేం పెట్టుకోకు. నా మనసేం బాగుండలేదు!" అంటూ వెళ్లిపోయింది స్వాతి అక్కడి నుండి. తల్లి ముఖం, సూర్య ముఖాల్లో కదలాడే భావాలు తాను తీసుకున్న నిర్ణయాన్ని ఏ క్షణంలోనైనా బలహీన పరుస్తాయి అన్నట్లుగా.

"బాధ నీకే కాని మాకు లేదా తల్లీ!" అంది జానకమ్మ కూతురు వెళ్లినవంకే దిగులుగా చూస్తూ.

ఆరు సంవత్సరాల నుండి కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూసిన శుభఘడియ వచ్చినట్లే వచ్చి వెనక్కి వెళ్లిపోయింది. ఎన్ని కలలు కన్నది తను, కూతురి పెళ్లి కోసం? చివరికిలా జరిగిపోయి తన నుదుటి కుంకుమే రాలిపోయింది అనుకుంది జానకమ్మ బాధగా.

అదంతా తండ్రి పోయిన దుఃఖమే అనుకున్నాడు సూర్య.

## 3



ఎలాగో తల్లికి నచ్చజెప్పి ఆ సాయంత్రం తిరిగి స్వాతి దగ్గర కొచ్చింది మాలతి.

మనసులో చెలరేగే సంఘర్షణను బలవంతాన అదిమి పట్టి అతి మామూలుగా

ఉండేందుకు ప్రయత్నిస్తోంది స్వాతి. ఎవరి ముందు నటించినా మాలతి ముందు మాత్రం నటించలేదు స్వాతి. తేలిగ్గానే స్నేహితురాలికి పట్టుబడిపోయింది.

"స్వాతీ! ఎందుకలా ఉన్నావు. ఎనీ ప్రోబ్లమ్?" అంది మాలతి.

"ఎలా ఉన్నాను? బాగానే ఉన్నానే.?" అంది స్వాతి

"అబద్ధాలాడినా అతికినట్లుండాలి. ఆ వాడిన ముఖం, ఎర్రబడిన కళ్లూ నిజం చెప్పు. నేను వెళ్లిన దగ్గర నుండి ఏడుస్తూనే ఉన్నావు కదూ? మా అమ్మ కసలు బుద్ధి లేదు. ఎంత చెప్పినా వినకుండా లాక్కుపోయింది నన్ను. ఇప్పుడు చూడు, నువ్వెలా ఏడుస్తూ కూర్చున్నావో? నేను వెళ్లనంటే బలవంతాన అమ్మ వెంట పంపావు" అంది మాలతి నిష్ఠూరంగా.

"పంపక నా దగ్గరే అట్టిపెట్టుకోనా? ఈ రోజు కాకపోతే వారం తరువాతైనా మనిద్దరికీ ఈ ఎడబాటు తప్పదు కదా!" అంది స్వాతి.

"అలా అని కలగంటూ ఉండు" అంది మాలతి విసురుగా.

"అదేమిటే, నీకేమైనా పిచ్చా?" అంది స్వాతి.

"నాకేం పిచ్చీ లేదు, గిచ్చీ లేదు. నువ్వింత బాధలో ఉంటే నేను పెళ్లి చేసుకొని వెళ్లిపోవాలా? ప్రస్తుతానికి పెళ్లీ లేదు, గిల్లీ లేదు. నీ పెళ్లితో పాటే నాదీ జరుగుతుంది. ఆ సంగతిప్పుడే ఇంట్లో చెప్పి వచ్చాను" అంది మాలతి.

"అదేంటే మాలతీ! అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాక నువ్విలా పెళ్లి మానేస్తే అమ్మా నాన్నా ఎంత బాధపడతారో ఆలోచించావా? ఈ చేసినవన్నీ వదిలేసి మళ్లీ మీ ఇంట్లో మరోసారి పెళ్లి ప్రయత్నాలు చేయడం అంటే ఎంత ఖర్చుతో కూడుకున్నదో తెలియదా నీకు? ఈ పెళ్లి ఆపేస్తే అవతల మగపెళ్లి వారి వద్ద మీ అమ్మా నాన్నా తలెత్తుకోగలరా? అసలే కట్నం లేకుండా చేసుకుంటున్నారు. ఇప్పుడిలా పెళ్ళిపీటల మీద పెళ్లి ఆపుచేస్తే చిరంజీవిగార్ని వాళ్లింట్లో వాళ్లు బతకనిస్తారా?" అంది స్వాతి బాధగా చూస్తూ

"అయిందా నీ ఉపన్యాసం? అమ్మ నాన్నలకు జరిగే నష్టానికి నేను కష్టపడి సంపాదించి పూడుస్తాను. ఇంకా చాలదంటే కొంత కాలం ఒక పూట భోజనం మాని ఆ నష్టాన్ని పూడుస్తాను. చిరంజీవి గారంటావా? నిజంగా నేను కావాలనుకుంటే మరి కొన్ని రోజులు నా కోసం ఆగలేరంటావా? అయినా స్వాతీ! నాకు జీవితంలో అన్నిటికంటే అందరి కంటే నువ్వూ నీ స్నేహమే ముఖ్యం. నాకు పిచ్చనుకో ఇంకేదన్నా అనుకో. నా కోసం ఒకటి కాదు, రెండు కాదు, ఆరు సంవత్సరాలు పెళ్లి వాయిదా వేస్తూ వచ్చావు. ఈ కొద్ది రోజులూ నేను నీ కోసం ఆగలేనా? ఈ పెళ్లి ఇప్పుడే జరగాలని ఆ చిరంజీవిగారు పట్టుబడితే అతను నాకు వద్దే వద్దు!" అంది మాలతి తిరుగులేనట్లుగా.

"అది కాదే. నువ్వనుకున్నట్లు నా పెళ్లి ఇప్పుడప్పుడే జరగదనుకో. అప్పుడేం చేస్తావు?" అంది స్వాతి.

"అయినప్పుడే అవుతుంది. ఇప్పుడు పెళ్లి కావాలని ఎవడేడ్చాడే బాబూ!" అంది మాలతీ చిరాగ్గా చూస్తూ.

"మనమనుకోకపోవచ్చు కానీ మన కన్నవాళ్లకు ఉంటాయిగా ఆశలు. వాళ్లను బాధపెట్టి మనం ఏం బావుకుంటామే మాలతి?" అంది స్వాతి నిస్తేజంగా చూస్తూ.

"ఓహో ఈ తెలివి ఈ ఆరు సంవత్సరాలుగా ఎక్కడికి పోయిందో?" అంది మాలతి వెటకారంగా.

"నా సంగతి వదిలెయ్యి మాలతీ. నా నుదుట కళ్యాణ యోగం ఉందో లేదో నాకు తెలియదు. నాతోపాటు నువ్వూ ఇలా ఉండిపోవడం నా కిష్టం లేదు. నువ్వనే దానివో మాట గుర్తుందా? మనం స్పోర్ట్స్‌లో పాల్గొన్నప్పుడు మనిద్దరిలో ఎవరు గెల్చినా అది ఇద్దరం గెలిచినట్లేనని. అందుకే మాలతి చెప్తున్నాను. నిన్ను పెళ్లి చేసుకొమ్మని"

ఆ మాటలు విని మాలతి ఆశ్చర్యంగా స్వాతి వంక చూస్తూ. "స్వాతీ! ఏమైందే నీకూ? ఎందుకిలా మాట్లాడుతున్నావు ఈ రోజు? " అంది.

"నాకేం కాలేదు. ఇప్పుడిప్పుడే జీవితమంటే ఏమిటో అర్థం చేసుకుంటున్నాను. చిన్నప్పటి నుండి మనిద్దరం ఒక్కలాంటి జీవితాలనే గడపాలనుకున్నాను నేను. అది అసాధ్యమని... పరిస్థితులతో రాజీ పడాలని ఈ రోజే అర్థం చేసుకున్నాను. ప్రస్తుతం నేను కోరుకునేది ఒక్కటే. మనిద్దరిలో ఏ ఒక్కరు జీవితంలో స్థిరపడినా ఇద్దరం స్థిరపడినట్లే భావించి తృప్తి పడతాను. నా మాట విని ఈ ముహూర్తానికే నీ పెళ్ళి జరిగిపోనీ మాలతీ! ఇప్పుడు నీ పెళ్లి ఆగిపోతే ఎంతమంది బాధ పడతారో ఒక్కసారి ఊహించు" అంది స్వాతి నచ్చ చెప్తున్నట్లుగా.



"స్వాతీ, నువ్వేనా ఈ మాట అంటున్నది? జీవితంలో కష్టమైనా సుఖమైనా మనిద్దరికీ ఫిఫ్టీ ఫిఫ్టీ అనేదానివి కదా. మనిద్దరి శరీరాలూ వేరైనా ప్రాణం మాత్రం ఒక్కటే అని చెప్పే నువ్వేనా... ఈ నిర్ణయం చేసింది? ఎప్పుడో స్థిరపడిన నీ పెళ్లిని ఇన్నాళ్లూ నా కోసం వాయిదా వేశావు. ఇప్పుడు అనుకోని అవాంతరం వచ్చి నీ పెళ్ళి ఆగిపోతే... నిన్ను ఇలా దుఃఖసాగరంలో వదిలేసి నన్ను మాత్రం పెళ్ళి చేసుకుని వెళ్ళిపొమ్మంటావా? ఇదే సలహా గతంలో నేను చెప్తే విన్నావా నువ్వు? నీకో నీతీ, నాకో నీతీనా? నీలాంటి దాన్ని కానా నేను? నువ్వినాళ్లూ స్నేహం చేస్తున్నది ఒక రాయితోనూ రప్పతోనూ కాదే ప్రాణమున్న మనిషితో. నాకూ కొన్ని స్వంత అభిప్రాయాలుంటాయి. నీ స్థానంలో నేనుండి నీకిలాంటి సలహానిస్తే నువ్వు ఆచరిస్తావా? " అంది మాలతి ఏడుపూ ఆవేశం కలగలిపిన గొంతుతో.

"వద్దు మాలతీ! తర్కంతో నా మనసుని మరింత బాధించకు. అప్పటి స్థితి వేరు ఇప్పటి స్థితి వేరు. ఆనాడు నువ్వు హెచ్చరిస్తూనే ఉన్నా నేను ఊహాలోకం విడిచి రాలే

కపోయాను. ఏనాడూ వాస్తవంలోకి తొంగి చూడలేకపోయాను. అప్పుడు నా ప్రపంచం చాలా చిన్నది. అమ్మా నాన్నా, తమ్ముడూ నువ్వూ, సూర్య మావయ్య తప్ప ఇంకెవరూ లేరందులో. నా ఆలోచనలెప్పుడూ మీ చుట్టూనే పరిభ్రమించేవి. నాకే ఆనందం దొరికినా అది మీతో పంచుకోవాలి. మీకెవరికి ఏ కష్టం వచ్చినా అది నాదేనన్నట్లుగా ఉండేది నాకు.

నేనొక మంచి పుస్తకం చదివితే అది నువ్వు చదవాలి, నీతో పంచుకోవాలి. నీకు గాని నాకు గాని ఆనందం కలిగినా విచారం కలిగినా అది కలిసి పంచుకోవాలి. అదే జీవితం అనుకున్నాను ఇన్నాళ్ళూ! ఇప్పుడు వాస్తవంలోకి అడుగు పెట్టాక జీవితమంటే ఏమిటో, మనుషుల మనస్తత్వాలేమిటో ఎలా ఉంటాయో అర్థమైంది. అందుకే చెప్తున్నాను. ఇప్పుడు ఇదివరలా మనం ఒకరి జీవితాలతో మరొకరం లంకె పెట్టుకొని మన చుట్టూ ఉన్న వాళ్ళను బాధలకు గురి చేయవద్దు. ప్రేమించే వాళ్ళను దూరం చేసుకోవద్దు" అంది స్వాతి కళ్ళు తుడుచుకుంటూ.

అంతవరకూ స్వాతినే పరిశీలనగా చూస్తూండిపోయిన మాలతి సూటిగా స్నేహితురాలి వైపు చూస్తూ, "స్వాతీ, నేనొక మాట చెప్పనా? " అంది.

"లేదు మాలతీ! ఇక నువ్వేం చెప్పినా వినే పరిస్థితి కాదు నాది. అందుకే నా మాట వినమని ప్రాధేయపడుతున్నాను. ఇంత వరకూ వచ్చాక ఇక దాచి లాభం లేదు. అసలు ఈ విషయం నీతో చెప్పకూడదనే అనుకున్నాను. కానీ నీ పెళ్ళి సజావుగా సాగాలన్న ఉద్దేశ్యంతో ఆగలేక చెప్తున్నాను. మా పెళ్ళి ఇప్పుడే కాదు ఎప్పటికీ జరగదు. ఈ పెళ్ళి మా తాతయ్యకిష్టం లేదు" అంది స్వాతి చూపులు ఎక్కడో నిలిపి.

ఆ మాటలు వినడంతోనే పక్కలో

## బాపూజీ



జాతి పిత గాంధీజీ హాస్యప్రియుడు. చురకలు వేయడం, మాటలతో చమక్కులు చేయడంలో అగ్రగణ్యుడు. సమయస్ఫూర్తికీ చతురతకూ అద్దంపట్టే ఆయన వ్యాఖ్యలలో కొన్ని ఈనెల 'చతుర' పాఠకులకు ప్రత్యేకం...

### ప్లీజ్ పారిపోండి

**గాం**ధీజీ మేకపాలు తాగుతారని అందరికీ తెలిసిందే. దీనిపైన చాలామంది పలురకాలుగా జోకులు వేసుకునేవారు. ఓసారి ఓ జర్నలిస్టు 'బాపూజీ.. మనం తీసుకునే ఆహారాన్ని బట్టే మన అలవాట్లూ ఉంటాయంటారు.. దీనిపై మీరేమంటారు?' అన్నాడు నర్మగర్భంగా.

బాపూజీకి అతని ఉద్దేశం అర్థమైంది. అందుకే-

'కావచ్చు. నేను రోజూ ఓ గ్లాసుడు మేకపాలు తాగుతాను.. అన్నట్లు ఎందుకో కణతలమీద దురదగా ఉంది.. బహుశా కొమ్ములుగానీ పొడుచుకొస్తున్నాయేమో? మిమ్మల్ని కుమ్మేస్తానో ఏమో.. దయచేసి పారిపోండి ప్లీజ్' అన్నారు సమయస్ఫూర్తిగా.

బాంబు పడినట్లు అదిరిపడింది మాలతి. "అదేంటే ఈ సంగతి సూర్య మావయ్యకు తెలుసా? " అంది ఆతృతగా.

"వాళ్ళ కిష్టం లేకపోవడానికి కారణం విని మిగతా సంగతి అడుగు. ఈ పెళ్ళి జరిగితే నాతో పాటు అమ్మా తమ్ముడి భారం వాళ్ళ మీద పడుతుందట. అందుకే తాతయ్యకీ, అమ్మమ్మకీ ఈ పెళ్ళి ఇష్టం లేదు" అంది స్వాతి నిర్లిప్తంగా.

"అదేమిటి? స్వంత తల్లిదండ్రులకే బరువై పోతారా మీ అమ్మగారు? అయినా నువ్వు చదువుకున్నదానివేగా. ఏదో ఉద్యోగం చేసి వాళ్లని పోషించుకోలేవా? " అంది మాలతి బాధగా.

"ఆ మాటే మావయ్య అన్నాడు. కానీ తాతయ్య ఒప్పుకోలేదు. ఉద్యోగాలు చెట్లకు కాస్తాయా? అని హేళన చేశాడు. అయినా నా పోస్టు గ్రాడ్యుయేషనింకా పూర్తి కాలేదు. ఉత్త డిగ్రీ క్వాలిఫికేషన్‌కి ఇంత త్వరగా ఉద్యోగమెలా వస్తుందే? అంతే కాదు, నువ్వనుకుం టున్నట్లు వాళ్ళు మా స్వంత అమ్మమ్మ తాతయ్యలు కారు. వాళ్లు నా చిన్నతనంలోనే మేమీ ఊరు రాకముందే చనిపోయారు అనారోగ్యంతో. ఆయన మా తాతగారి తమ్ముడు. కానీ అమ్మ మాత్రం వాళ్లని ఎప్పుడూ పిన్నీ చిన్నాన్న అని పిలవదు. అమ్మా నాన్నా అనే అంటుంది. అందుకే ఈ విషయం మీకెవరికీ తెలియదు.

మా నాన్నగారు పెద్ద పొజిషన్‌లో ఉన్నారు కనుక బాగా కూడబెట్టి ఉంటారనే ఆశతో వాళ్ళీ పెళ్ళికి ఒప్పుకున్నారు. ఈ పది రోజులుగా ఇక్కడ ఉండి మా ఆర్థిక పరిస్థితి అంతా తెలుసుకున్నారు. నాన్నగారి బంధుప్రీతీ, ఉదార స్వభావం ఆయన ధర్మాత్ముడనే మంచి పేరు తెచ్చిపెట్టాయి తప్ప ఆస్తులేం కూడబెట్టలేకపోయాయి. చివరికి ఆ మంచితనమే ఆయన ప్రాణాలను బలి గొంది. ఏది ఏమైనా నాన్నగారు మధ్యలో వదిలేసిన బాధ్యతను నేను తీసుకోవాలను కుంటున్నాను. ఇక మీదట నా ఆశా, ఆలోచనా ఒక్కటే! తమ్ముణ్ణి ప్రయోజకుడిని చేయడం. అంతే! మంచికో, చెడుకో నాన్నగారుండగా నా పెళ్ళి వాయిదా వేస్తూ వచ్చాను. ఆయనకి చాలా బాధ కలిగించి ఉంటాను. కానీ ఈ రోజు నేను చేస్తున్న మంచి పనిని ఆ లోకం నుండి చూసి ఆశీర్వదిస్తారనే నా నమ్మకం. అలా అని నేను పెళ్ళి చేసుకోనని భ్రమపడకు. నా ఆలోచనలను అర్థం చేసుకొని సహకరించేవాడు తటస్థ పడితే తప్పక నిండు మనసుతో నా జీవితంలోకి ఆహ్వానిస్తాను. మావయ్యలాంటి మంచి వ్యక్తిని కోల్పోతున్న మాట నిజమే అయినా ఇది తన జీవితం ప్రశాంతంగా సాగాలనే కోరికతోనే ఈ నిర్ణయం తీసుకున్నాను. ఇప్పుడు చెప్పు. నా నిర్ణయం తప్పంటావా? ఇదంతా విన్నాక కూడా నువ్వు పెళ్ళి మానుకుని నన్ను బాధ పెడతానంటావా? చెప్పవే మాలతి" అంది స్వాతి జాలిగా చూస్తూ.

అంతవరకూ రెప్ప వేయడం మరచిన దానిలా స్వాతి వైపే చూస్తూ ఆ మాటలన్నీ విన్న మాలతి లోకం తెలియని పసిపాపలా ఉండే స్వాతిలో ఇంత పరిణత దాగి ఉందా? తన కళ్ల ముందే అందనంత ఎత్తుకు ఎదిగిన తన నేస్తం ముందు మరో మారు తల వంచింది మాలతి. ఆవేశం వివేకం ముందు తల వంచడం అంటే ఇదే!

ఇలా తనని ఒప్పించిన ప్రతీ సారీ ఈ స్వాతి ఉత్త మొండితనం. తన మాట తన దేగాని ఇతరుల ఫీలింగ్స్ అసలు పట్టించుకోదు అనుకునేది మాలతి ఎప్పుడూ. కాని ఈసారి మాలతి అలా అనుకోలేకపోయింది. స్వాతి నిర్ణయాన్ని మనస్ఫూర్తిగా ఆమోదించింది, ఓ పక్క బాధపడుతూనే.

ప్రస్తుతం పెళ్లి చేసుకోనని కరాఖండీగా చెప్పి వెళ్ళిన మాలతి ఇంటికి వచ్చాక సైలంటయి పోవడం చూసి ఆశ్చర్యపోయింది ఇందిరమ్మ. ఇంకా అనుమానం తీరక కమ

లని పిల్చి "ఓసారి చెల్లాయితో మాట్లాడి చూడమ్మా, దాని ధోరణి నాకేం అంతుబట్టటం లేదు. నిజంగా అది పెళ్లి చేసుకుంటుందో లేదో తేల్చుకో!" అంది బాధగా చూస్తూ.

ఆ మాటే అడిగిన కమలతో "నిజంగానే చెప్తున్నానక్కా. ఇందాక, ఏదో కోపంలో అన్నాను అంతే. పెళ్ళి ఆగిపోయిందని ఎవరికీ ఏ కబురూ పంపనక్కరలేదు. నేనీ పెళ్ళి చేసుకుంటాను" అంది మాలతి కమల భుజాల మీద తల వాల్చి

"అది కాదే స్వాతి..." అంటున్న కమలను వారించింది మాలతి. "ఒద్దక్కా! ఇంకా విషయం ఎత్తకు. స్వాతికి ఇష్టం లేని పని నేనెప్పుడైనా చేశానా? ఇదీ అంతే. మీరింక మనసులో ఎలాంటి ఆలోచనా పెట్టుకోకండి!" అంది హామీ ఇస్తున్నట్లుగా.




**నూ**తన దంపతులను నిండు మనసుతో అభినందించింది స్వాతి. కళ్లల్లో కన్నీటితో పెదవులపై చిరు దరహాసంతో స్నేహితురాలిని ఆలింగనం చేసుకుంది మాలతి. ఒకనాటి స్వాతి కల తమ రెండు పెళ్లిళ్లూ ఒకేసారి జరగాలనేది. కానీ అన్నీ మనం అనుకున్నట్లు జరిగితే లేనిదేముంది? ఇలా తాను ముందుగా పెళ్లి చేసుకొని స్వాతి కలను చెరిపేసిందా? లేక స్వాతి కోరిక మేరకే పెళ్లి చేసుకొని స్నేహితురాలిని ఆనందపరిచిందో అర్థం కాలేదు మాలతికి. అన్నీ అర్థం చేసుకొన్న దానిలా స్నేహితురాలి చేయి నొక్కింది స్వాతి ప్రేమగా.

వేడుకలన్నీ ముగిసి మాలతి అత్త వారింటికి బయలుదేరింది. అందరితో వెళ్తున్నానని చెప్పిన మాలతి, స్వాతి ముందు కొచ్చి మూగ దానిలా నిలబడిపోయింది.

ఆ క్షణంలో ఇద్దరి మనసుల్లోనూ మెదిలిందొక్కటే. నెల రోజుల క్రితం పెళ్ళి ముహూర్తాలు పెట్టాక ఎన్నో ఊహించుకున్నారు తామిద్దరూ. ఈ రోజు ఎలా ఉంటారో ఊహించుకొని, ఊహించుకొని నవ్వుకున్నారు. ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకునేందుకు కూడా కుదరదని బాధ పడ్డారు. అయినా ఆ బాధ తీయగానే ఉంటుందిలే అని చమత్కరించుకొని నవ్వుకున్నారు. కాని ఈ రోజు స్వాతి ప్రేక్షకురాలిలా మిగిలిపోతే నేను మాత్రం పెళ్లి కూతురిగా ముస్తాబై పెళ్లి పీటలమీద కూర్చున్నాను అనే భావన మాలతిని ముల్లులా బాధిస్తూనే ఉంది.

చివరికి మౌనాన్ని ఛేదిస్తూ "ఈ హృదయం లేని పేద స్నేహితురాలిని మర్చిపోతావా స్వాతీ!" అంది మాలతి కన్నీళ్లతో.

"ఛ, అవేం మాటలు మాలతీ. మన శరీరాలు దూరమైనా మనసు లొకచోటే ఉంటాయి. మన స్నేహానికా మాత్రం శక్తి ఉందిలే! శుభమా అని మొదటిసారి అత్తవారింటికి వెళ్తూ ఈ కన్నీళ్లేమిటే పిచ్చిదానిలా!" అంటూ మాలతి కళ్ళు తుడిచి తాను కంట తడి పెట్టింది స్వాతి.

మాలతిని సాగనంపి భారమైన మనసుతో ఇంటికి వచ్చిన స్వాతిని చూసి, "పెళ్ళి బాగా జరిగిందా స్వాతీ!" అనడిగాడు సూర్య.

"బాగానే జరిగింది మావయ్యా. నిన్ను రమ్మంటే అమ్మకి తోడుంటానంటూ ఉండిపోయావు. నువ్వు రాలేదని మాలతి నన్ను నిష్ఠూరమాడింది" అంది స్వాతి చిరునవ్వుతో.

"పిచ్చి తల్లి. ఇంకా నవ్వుతున్నావా? అన్నీ సవ్యంగా జరిగితే నిన్నూ ఇలాగే అత్తారింటికి సాగనంపేదాన్ని కాదూ. మీ నాన్నగారు" ఆ పైన మాటలు పూర్తి చేయలేనట్లుగా కొంగుతో ముఖం కప్పుకొని కుమిలి కుమిలి

ఏడ్చింది జానకమ్మ.

"అమ్మా... అమ్మా! నువ్వలా అయిపోతే మేమెలా తట్టుకోగలమమ్మా. నాకూ తమ్ముడికీ మిగిలింది నువ్వే కదా!" అంది స్వాతి బేలగా తల్లివంక చూస్తూ.

"ఎందుకక్కా అంత బాధ పడతావు. నాలుగు రోజులు ఓపిక పడితే అంతా సవ్యంగా జరిగిపోతుంది" అన్నాడు సూర్య ఓదార్పుగా.

"ఎప్పుడో జరిగేదానికి ఇప్పటి నుండే ఊహాగానాలెందుకులే మావయ్యా!" అంది స్వాతి తేలిగ్గా కొట్టిపడేస్తూ.

"ఊహాగానమేముంది స్వాతీ. ఎప్పటి నుండో అనుకుంటున్నదే కదా. ఇవ్వాళ కాకపోతే రేపైనా జరగేదే కదా మన పెళ్లి" అన్నాడు సూర్య ఆశ్చర్యంగా చూస్తూ.

"ఎప్పటి నుండో అనుకున్నంత మాత్రాన ఇప్పుడు జరగాలని ఎక్కడుందిలే మావయ్యా!" అంటూ ఆ పైన మాట్లాడడం ఇష్టం లేనిదానిలా వెళ్లిపోయింది స్వాతి అక్కడి నుండి.

అక్కగారి ముందు సంభాషణ పొడిగించడం ఇష్టం లేని సూర్య అప్పటికి మౌనం వహించాడు. ఆ సాయంత్రం మొక్కలకి నీళ్ళు పోస్తున్న స్వాతి వద్దకు వచ్చాడు. తనెందుకలా మాట్లాడిందో తెలుసుకోవాలన్నట్లుగా.

సూర్య రాకను గమనించినా గమనించనట్లే తన పని తను చేసుకుపోసాగింది స్వాతి.

"స్వాతీ ఇందాక అమ్మ దగ్గర ఎందుకలా అన్నావు?" అన్నాడు సూటిగా చూస్తూ. అతని చూపుల్లో చూపులు కలపలేని దానిలా ముఖం పక్కకి తిప్పుకుంది స్వాతి. ఆ తరువాత మెల్లగా అంది.

"ఎలా అన్నాను? ఉన్న మాటేకదా. నాకిప్పుడప్పుడే పెళ్లి చేసుకోవాలని లేదు. నా కోసం ఎన్నాళ్ళాగుతావు? ఇప్పటికే నా మూలంగా చాలా కాలయాపన జరిగింది. ఇంకా ఎంతకాలం ఇలా. నువ్వు వెంటనే వేరే పెళ్ళి చేసుకో మావయ్యా!" అంది స్వాతి మాటలు కూడదీసుకుంటున్నట్లుగా.

"కాలయాపన గూర్చి ఇప్పుడు తెలిసి వచ్చిందా నీకు? అయినా నాకు లేని బాధ నీకెందుకు. పోనీ నాన్న పోయిన బాధ తీరే వరకూ పెళ్ళి వాయిదా వేద్దాం. ఈలోగా నీ ఎం.ఏ. కూడా పూర్తయి డిగ్రీ చేతికి వస్తుంది' అన్నాడు సూర్య.



"సారీ మావయ్యా. తమ్ముడికి ఒక దారి చూపేవరకూ పెళ్ళే వద్దనుకుంటున్నాను నేను. అందుకే అలా అన్నాను"అంది స్వాతి.

"అయితే రవి బాధ్యత నీకే గాని, నాకేం లేదనుకుంటున్నావా? అసలు నేనొక మాట అడుగుతాను నిజం చెప్తావా?" అన్నాడు సూర్య తీక్షణంగా చూస్తూ.

"అదేమిటి మావయ్యా. నేనెప్పుడైనా నీతో

అబద్ధం చెప్పానా? " అంది స్వాతి.

"చెప్పలేదనే ఇంతవరకూ నమ్ముతూ వచ్చాను. కాని ఈ రోజు సందేహించక తప్పడం లేదు. అసలు నేనంటే మొదటి నుండీ నీకు ఇష్టం లేదు కదూ. అందుకే కదా ఇలా పెళ్లి వాయిదా వేస్తూ వచ్చావు. అసలు నా గురించి ఏమనుకుంటున్నావు నువ్వు? నన్ను పిచ్చివాడి కింద జమ కట్టేశావు కదూ ఇన్నాళ్ళూ" అన్నాడు సూర్య ఆవేశంగా.

"మావయ్యా!" దెబ్బ తిన్న పక్షిలా ఆర్త నాదం చేసింది స్వాతి. ఆ పిలుపు సూర్య లోని ఆవేశాన్ని మంచులా కరిగించేసింది.

నిజంగా పెళ్లికీ ఆ ఇష్టానికీ అర్థమేమిటో, సంబంధం ఎందుకుండాలో తెలియక మొదటి సారి పెళ్ళి వద్దన్నాను. రెండవసారి నా స్నేహితురాలి కోసం పెళ్ళి వాయిదా వేశాను. ఇప్పుడు చేసుకోవాలని అనుకుంటే నాన్నగారు ఇలా హఠాత్తుగా పోవడంతో మన పెళ్ళి వాయిదా పడింది. ఇక ఎప్పటి మాటో నీవు చెప్తున్నావు. కానీ ఒక్కటి ఆలోచించు. నా పెళ్లయి నేను నీతో వచ్చేస్తే అమ్మనీ, తమ్ముణ్నీ ఎవరు చూస్తారు? వాళ్లను గాలికి



ఆర్తిగా స్వాతి దగ్గరకొచ్చి ఆమె చేతిలో నీళ్ల ట్యూబు తీసుకొని కింద పడేశాడు. చేయి పట్టుకొని మెల్లగా సిమెంటు బెంచీ దగ్గరకు తీసుకొచ్చి కూర్చోబెట్టాడు.

"మావయ్యా, నువ్వు నమ్మినా నమ్మకపో యినా నువ్వంటే నాకెప్పుడూ ఇష్టమే! వదిలేసి నేను రాగలనా అసలు? " అంది స్వాతి గద్గద స్వరంతో.

"మళ్ళీ అదే మాట. ఆమె నీకు అమ్మ యితే నాకు అక్క. వాళ్ల బాధ్యత నీకెంత ఉందో నాకూ అంతే ఉంది. అది అర్థం చేసుకోవేం? " అన్నాడు సూర్య బాధగా.

"అందులో నాకెంత మాత్రం సందేహం లేదు మావయ్యా! కానీ ఎంతవరకూ చూడగలవు నువ్వు? తిండీ, బట్టా ఇవ్వగలవు తప్ప నా తమ్ముడి భవిష్యత్తు తీర్చి దిద్దగలవా? నాన్నగారు వాడిని డాక్టరును చేయాలని ఎన్నో కలలు కన్నారు. ఆయన ఆశలు తీర్చగలవా? పోనీ తీర్చాలని నీకున్నా, ఓ పక్క మన సంసారం మనకి తయారవుతుంది. మనకీ పిల్లలు పుట్టుకు వచ్చి బరువు బాధ్యతలు మీద పడితే వీళ్ళు అదనపు భారంగా అనిపించరా నీకు? మరోపక్క నీ తల్లిదండ్రులను చూడాలి. ఇన్ని బరువు బాధ్యతలు మీద పడితే ఇక జీవితంలో ఏం ఆనందం మిగులుతుంది నీకు? " అంది స్వాతి నచ్చజెప్తున్నట్లుగా.

ఎప్పుడూ గలగల పారే సెలయేరులా నవ్వులు చిందిస్తూ అమాయకంగా పరుగులు తీసే నా స్వాతేనా ఇలా మాట్లాడుతున్నది? అని విస్మయంగా స్వాతి వైపే చూస్తూండిపోయాడు సూర్య.

బావగారి మరణం అక్కయ్యను కృంగదీస్తే పసిపాపలాంటి స్వాతి ఈడుకు మించిన ఆలోచనలు చేసేలా చేస్తోందా?

ఈ పది రోజుల్లోనే ఇంత ఎదిగిపోయిందా? చివరికి తన జీవితాన్నే పణంగా పెట్టాలనుకుంటోంది. దీన్ని అంగీకరించి అభినందించాలా! నీవు లేని నా జీవితం ఎడారి వంటిది. నీ నిర్ణయం మార్చుకో అని అర్థించాలా? అయినా నా మనసేమిటో తెలిసిన స్వాతే ఇంత నిర్దాక్షిణ్యంగా ఎలా ఆలోచిస్తోంది? అని ఆలోచిస్తూండి పోయాడు సూర్య.

తాను చెప్తున్నది సూర్య వినడం లేదన్న సంగతి తన ధోరణిలో తానున్న స్వాతి చాలా సేపటివరకూ గమనించలేదు. విస్మయంగా తనవంకే మాటా పలుకూ లేకుండా చూస్తున్న సూర్యని "మావయ్యా!" అంది భుజాలు పట్టి కుదుపుతూ. దాంతో ఈ లోకంలోకి వచ్చాడు సూర్య.

"స్వాతీ! నువ్వు చెప్పేదంతా నిజమే. ఒప్పుకుంటాను. కాని ఇన్ని రకాలుగా అందరి సమస్యల గూర్చీ ఆలోచించే నువ్వు నా గూర్చి ఒక్క క్షణమైనా ఆలోచించావా? నువ్వు లేని నా జీవితం కలలో కూడా ఊహించలేనిది. దయచేసి నీ నిర్ణయం మార్చుకో స్వాతీ. ప్లీజ్!" అన్నాడు సూర్య అర్థిస్తున్నట్లుగా స్వాతి రెండు చేతులూ పట్టుకొని.

స్వాతి మాట్లాడలేనట్లుగా చూసింది సూర్య వైపు ఒక్క క్షణం. అంతలోనే సూర్య తండ్రి అన్న మాటలు గుర్తుకు రాగా మనసు రాయి చేసుకుంది. తాను వారి మాటలు విన్న విషయం కూడా సూర్యకి తెలియనివ్వకూడదు. అలా తెలిస్తే సూర్య మనసు నొచ్చుకుంటుందని అనుకున్న స్వాతి మెల్లగా అంది "క్షమించు మావయ్యా! నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను. నిన్ను అనేకసార్లు నేనెంతో ఇబ్బంది పెట్టాను. ఇదే చివరిసారి. ఇంకెప్పుడూ నిన్ను బాధపెట్టనులే" అంటూ ఏడ్చేసింది స్వాతి.

"స్వాతీ, ఏమిటిది చిన్న పిల్లలా. నువ్వేడుస్తూంటే నేను చూడగలనా? " అన్నాడు సూర్య జాలిగా చూస్తూ.

"నాకు తెలుసు మావయ్యా. నువ్వు నాకున్నావనే ధైర్యంతోనే నాన్నగారు పోయిన బాధను దిగమింగి, ఇలా తిరగగలిగాను ఇన్ని రోజులూ. కానీ నా వల్ల కాదనిపిస్తోంది మామయ్యా ఈ బాధను భరించడం! ఎందుకు మామయ్యా ఏ స్పందనా లేని నాలో ఇంతటి ప్రేమను రగిలించావు? " అంది స్వాతి ఏడుస్తూ.

ఇప్పుడు మాత్రం ఏమయింది స్వాతీ కష్టాలనేవి రాకుండా ఉంటాయా జీవితమన్నాక తాత్కాలికంగా వచ్చిన ఈ అవాంతరాన్ని ఇద్దరం కలిసి అధిగమిద్దాం నువ్వే చెప్తున్నావు కదా స్వాతీ, ఈ బాధను ఒంటరిగా భరించ లేనని. అందుకే నీ నిర్ణయం మార్చుకోమంటున్నాను"అన్నాడు సూర్య నచ్చజెప్తున్నట్లుగా.

"వద్దు మావయ్యా, నువ్విలా నచ్చజెప్తూ ఉంటే ఏదో క్షణంలో నేను కరిగిపోయి ఔన

నేస్తాను. కానీ ఆ తరువాత వచ్చే పరిణామాలను మనిద్దరం తట్టుకోలేము. నా నిర్ణయం మార్చుకోక ముందే దయచేసి ఇక్కడి నుండి వెళ్లిపో మావయ్యా!" అంది స్వాతి ఆగని కన్నీళ్లతో.

వెంటనే సూర్యకి వచ్చేసింది అనుమానం. మొన్న అమ్మా నాన్నలు నాతో అన్నదంతా స్వాతి వినలేదు కదా? లేకపోతే ప్రేమించడం తప్ప పొరపాటున కూడా ఇతరులను నొప్పించడం తెలియని స్వాతి ఇంతగా బాధపడుతూనే ఇలాంటి కఠిన నిర్ణయం ఎందుకు తీసుకుంటుంది? వెంటనే స్వాతిని తనకి అభిముఖంగా తిప్పుకుంటూ "నిజం చెప్పు స్వాతీ! ఆరోజు అమ్మా నాన్నల మాటలన్నీ నువ్వు విన్నావు కదూ? "అన్నాడు సూటిగా చూస్తూ.

"మావయ్యా నన్నేం అడక్కు మావయ్యా ఇంక!" అంటూ సూర్య ఒళ్లో ఒరిగిపోయింది స్వాతి ఏడుస్తూ. అలాంటి స్థితిలో స్వాతిని కదిలించడం ఇష్టంలేక మౌనంగా తల నిమురుతూ ఉండిపోయాడు. చివరికి ఆ సమస్యకిక పరిష్కారాన్ని కాలానికే వదిలేస్తూ హైద్రాబాదు వెళ్లిపోయాడు సూర్య వికలమైన మనసుతో.




సూర్య వెళ్లిన మరునాడు రంగారావు కొలీగ్స్ కొన్ని పేపర్లు పట్టుకొని వచ్చారింటికి. వాళ్లను చూడడంతోనే జానకమ్మ కంటి వెంట జలజలా జారాయి కన్నీళ్లు.

"ఊరుకోండమ్మా! ఎంత ఏడిస్తే మాత్రం పోయినవారు తిరిగి వస్తారా? మనసు రాయి చేసుకోండి పిల్లల కోసమైనా!" అన్నారు ఓదార్చుతున్నట్లుగా.

ఈలోగా స్వాతి వచ్చిన వాళ్లిద్దరికీ రెండు గ్లాసులతో మంచి నీళ్లు తీసుకువచ్చి అందించింది. మంచి నీళ్లు తాగి గ్లాసులు తిరిగి ఇచ్చేస్తూ.

"అమ్మా స్వాతీ, ఒకసారిలా కూర్చో నీతో మాట్లాడాలి" అన్నారు చక్రధరంగారు.

"ఒక్క నిమిషం అంకుల్ కాఫీ కలుపుకొచ్చేస్తాను" అంటూ లోపలికెళ్లింది స్వాతి.

"అమ్మా మీరు కూడా స్థిమితంగా కూర్చోండి" అంటూ జానకమ్మకి కూడా ఎదురుగా ఉన్న కుర్చీని చూపించారు.

స్వాతి కాఫీలు తెచ్చాక "మొన్న మీ ఇంట్లో ఉన్నాయన ఎవరమ్మా? " అనడిగారు చక్రధరంగారు.

"ఆయన మా చిన్నాన్నగారండీ!" అంది జానకమ్మ.

"ఎందుకనో ఆయన చాలా లిటిగేషన్ మనిషిలా అనిపించారమ్మా. అందుకే మీవారికెంత వస్తుంది? అని తరచి తరచి అడిగినా సరైన జవాబు ఇవ్వాలనిపించలేదు. ఇప్పటికే రంగారావుగారి అతి మంచితనం వలన అన్ని విధాలుగా నష్టపోయారు. చివరికి ప్రాణాలు కూడా పోగొట్టుకున్నారు. ఇప్పుడు ఈ వచ్చే కాస్త డబ్బు కూడా ఎవరైనా గద్దల్లా తన్నుకుపోతారేమోనన్న భయంతో నిజం దాచామమ్మా. రంగారావుగారు పెట్టిన లోన్లు పోగా రెండున్నర లక్షల రూపాయలు చేతికందుతుంది. కానీ ఆయన ష్యూరిటీగా రెండు లక్షలకు చేసిన సంతకం వలన బ్యాంకు నుండి అప్పు తీసుకున్న అతను పరారైనాడు కనుక ఆ రెండు లక్షలూ చెల్లించవలసిందేనట మీరు. మిగిలిన యాభై వేలూ మీ చేతికందుతాయి. అయితే గుడ్డిలో మెల్లగా రంగారావుగారు సర్వీసులో ఉండగా చనిపోయారు కనుక అమ్మాయికి మా ఆఫీసులోనే అసిస్టెంటుగా ఉద్యోగం ఇస్తారు. కాకపోతే ఓ ఐదారు నెలలు పడుతుంది ఉద్యోగం వచ్చేందుకు" అన్నారు చక్రధరంగారు.

ఆయన మాటలు వినడంతోనే ప్రాణం లేచొచ్చినట్లయింది స్వాతికి. ఇన్ని రోజులుగా నా డిగ్రీకి ఉద్యోగం ఏమొస్తుంది అని దిగులు పడుతూ వచ్చిన స్వాతికీవార్త కొండంత బలాన్నిచ్చింది.

"నిజంగానా అంకుల్! ఎంత చల్లని వార్త చెప్పారు. దిక్కుతోచని స్థితిలో ఉన్న మాకు కొండంత అండ దొరికినట్లుగా ఉంది, మీ మాటలు విన్నాక. డబ్బు పోయినా ఫర్వా లేదు నాన్నగారి మీద మాట పడకుండా ఉంటే అంతే చాలు అంకుల్, నాకా ఉద్యోగం చాలు" అంది స్వాతి ఆనందంగా.

"అందుకేనమ్మా నాకీ వివరాలు తెలిసినా మొన్న మీ తాతయ్యగారికేం చెప్పలేదు... మిగిలిన ఆ కాస్త సొమ్మునూ వాళ్లెగరే సుకుపోతారేమోనన్న భయంతో. అయితే ఈ పేపర్లమీద మీరిద్దరూ సంతకాలు చేసి ఇస్తే మిగతాదంతా మేము చూసుకుంటాము" అన్నారు చక్రధరంగారు.

వాళ్లు వెళ్ళిపోయాక... తల్లిని రెండు చేతులతో చుట్టేసి... "అమ్మా! మన కష్టాలన్నీ తీరిపోతాయమ్మా... ఇక తమ్ముడి చదువు గూర్చి నాకే దిగులూ లేదు" అంది స్వాతి సంతోషంగా.

"అవునమ్మా... ఇదంతా మీ నాన్నగారి మంచితనమే... అదే మనందర్నీ శ్రీరామ రక్షగా కాపాడుతుంది. సరేగానీ, ఈ సంగతి తాతయ్యకూ, సూర్యం మావయ్యకూ తెలియజెయ్యి. వాళ్ళూ సంతోషిస్తారు" అంది జానకమ్మ.

"అలాగేనమ్మా!" అంది తల్లిని వదలి దూరంగా జరుగుతూ. వాళ్ళ ప్రస్తావన రావడంతో అంతవరకూ ఉన్న ఆనందం చప్పున చల్లారిపోయింది స్వాతిలో.

ఈ వార్త విని తాతయ్య ఏమంటాడు? ఈ పెళ్ళికి తనకేం అభ్యంతరం లేదంటాడా?

## మార్కెట్లోకి... మహిళా కండోమ్స్

మనుషుల్లో లింగభేదం ఉన్నట్టు కండోమ్స్‌లో కూడా లింగభేదం ఉన్నవి వస్తున్నాయట. ఇన్నాళ్ళూ ట్యూబెక్టమీలు, వాసెక్టమీలూ, కాపర్-టిలు; మాలడిలు, కండోమ్స్ (మగవారికి) గురించే విన్నాం. ఇపుడు ఆడవాళ్లకీ కండోమ్స్ వస్తున్నాయట నిజంగానండీ!



అమెరికాలో 1990 నుంచే ప్రచారంలో ఉన్న ఈ మహిళా కండోమ్స్‌ని ఇపుడు మన దేశం దిగుమతి చేసుకుంటోంది. వీటిని హిందూస్థాన్ లేటెక్స్ కంపెనీవాళ్లు మార్కెట్లోకి తెస్తున్నారు.

రెండు చివరల్లో ప్లాస్టిక్ రింగు కలిగి ఉండి, పాలీ యూరేథేన్ పదార్థంతో తయారుచేసిన ఈ కండోమ్‌లని ప్రయోగాత్మకంగా ఆంధ్ర, కేరళ, మహారాష్ట్రలలో సెక్సు వర్కర్లకి ఉచితంగా పంపిణీ చేసి సత్ఫలితాలని సాధించినట్టు భోగట్టా. వీటి ధర 20 నుంచి 50 రూ॥ దాకా ఉండొచ్చు. కృత్రిమ నైట్రైల్ లేటెక్స్ పదార్థంతో విదేశీ సాంకేతిక పరిజ్ఞానం ఆసరాతో వీటిని ఉత్పత్తి చేసి తక్కువ ధరకే అందించే సన్నాహాలు జరుగుతున్నాయి.

ఇవి ఎయిడ్స్ మహమ్మారికి అడ్డుకట్టలా ఉపకరిస్తాయని ఆశిద్దాం... వేచి చూద్దాం.

ఇప్పుడలాగే ఒప్పుకొని పెళ్ళయ్యాక నా జీత మంతా తమకే చెందాలంటాడేమో! ఎందుకొచ్చిన బాధ. కొన్నాళ్ళు నా విషయాలు వాళ్లకి తెలియకపోవడమే మంచిది అనుకుంది స్వాతి.

ఆ రాత్రి జానకమ్మతో అంది స్వాతి "అమ్మా! ఎలాగూ ఉద్యోగం వచ్చేందుకు అయిదారు నెలలు పడుతుందన్నారు కదా. ఈలోగా నేను క్లాసులకు అటెండ్ అవుతానమ్మా. ఈ ఎం.ఏ. అయిందనిపిస్తే నాకూ తృప్తిగా ఉంటుంది. ఫ్యూచర్‌లో పి.జి. కూడా ఓ అదనపు క్వాలిఫికేషన్‌గా ఉంటుంది"

"సరేనమ్మా! అలాగే కానీయ్. మెల్లగా తమ్ముడి దృష్టి కూడా చదువువైపు మళ్లించు. అసలే ఈ సంవత్సరం టెన్త్ రాయాలి వాడు' ' అంది జానకమ్మ.

"అవునమ్మా వాడి కెరీర్‌కిది టర్నింగ్ పాయింట్ లాంటిది. నాన్నగారుంటే ఆ రోజుల్లో నన్నెలా దగ్గర కూర్చొని చదివించేవారో వాడినీ అలా చదివించేవారు" అంది స్వాతి బాధగా.

"మనకంత అదృష్టముంటే ఇలా ఎందుకు జరుగుతుందమ్మా! మంచికి పోతే చెడు ఎదురయినట్లు ఈ ఇంటి సౌభాగ్యాన్నే కొల్లగొట్టింది మీ నాన్నగారి మంచితనం!" అంటూ కుమిలి కుమిలి ఏడుస్తున్న తల్లిని ఓదార్చేందుకు స్వాతికి మాటలు దొరకలేదు. మనసు బాధతో ముడుచుకుపోగా తల్లి భుజం చుట్టూ చేతులు వేసి దగ్గరకు లాక్కుంది.

రవి తల్లి వంకా అక్క వంకా బేలగా చూస్తూ ధారగా కారుతున్న కన్నీళ్లను చేతులతో తుడుచుకుంటూ "అక్కా!" అంటూ స్వాతి భుజం మీద తల వాల్చాడు.

తల్లినీ తమ్ముడినీ చెరో చేత్తో పట్టుకుని వారిద్దరికీ ధైర్యమిస్తున్నట్లుగా మెల్లగా తట్టింది స్వాతి. భగవంతుడా, నాన్నగారు నా మీదుంచిన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించే బలాన్ని నాకివ్వు తండ్రీ అనుకుంటూ మనసులోనే ప్రార్థించింది.

## 6



పెళ్లయిన సంతోషం లేకుండా ఎప్పుడు చూసినా పరధ్యానంగా ఉండే మాలతిని చూస్తే చాలా బాధగా అనిపించసాగింది చిరంజీవికి. స్నేహితురాలి గూర్చి మాలతి పడే బాధని తాను అర్థం చేసుకోగలడు. కానీ ఎంత కాలమిలా? మాలతితో తన జీవితం ఓ తీయని పాటలా హాయిగా సాగిపోతుందని ఎన్ని కలలు కన్నాడు తను? కాలం వేళ్ల సందులోనుండి జారే నీటిలా నిరుపయోగంగా గడిచిపోతుంటే వారితోపాటు తన ఆశలూ కలలూ వసివాడిపోతున్నాయి. మాలతి మాత్రం ఇవేవీ పట్టనట్లుగా అలా స్తబ్ధుగా ఉండిపోతోంది. తన స్నేహితురాలి గూర్చి ఆలోచించిన దానిలో పదో వంతయినా నా గూర్చి ఆలోచించదేం? అనుకున్నాడు చిరంజీవి బాధగా.

ఆ రోజూ అలాగే కిటికీ దగ్గర నుంచుని ఎక్కడో ఆలోచిస్తున్నట్లుగా చూస్తున్న భార్యను తట్టి పిల్చాడు చిరంజీవి.

"మాలతీ... ఏమిటి మాలతీ ఇదీ? కొత్తగా పెళ్లయిన వాళ్ళం. ఓ ముద్దూ ముచ్చటా లేకుండా ఇలా స్తబ్ధంగా ఉంటే ఏం బాగుంటుంది? మనని చూసి అమ్మా నాన్నా ఏమనుకుంటారు? పెళ్ళి కాకముందు ఎంత హుషారుగా ఉండేదానివి? ఏమైపోయింది అదంతా? ఎంతసేపూ మీ స్వాతి గూర్చి చింతనే తప్ప నీ పతిదేవుడి గోడేమీ పట్టించుకోవా? " అన్నాడు చిరంజీవి ప్రేమా, నిష్ఠూరమూ మిళితం చేసి.

"సారీ అండీ! ఎంత కంట్రోలు చేసుకుందమనుకున్నా అనుక్షణం మా స్వాతి

మాటలూ చేతలే కళ్లల్లో కదలాడుతున్నాయి. అసలు ఇన్ని రోజులు దాన్ని చూడకుండా ఎప్పుడూ లేను తెలుసా? అక్కడాది ఎలా ఉందో, ఏం చేస్తోందో? వేళకు తింటోందో లేదో ఎవరు చూస్తారు? " అంది మాలతి దిగులుగా.

"తెలుసు. నీ ఫ్రెండ్ స్వాతంటే నీకు ప్రాణమని, పెళ్లికి ముందే తెలుసు. కానీ నిన్నే ప్రాణంగా ప్రేమించే ఈ జీవిని కాస్త కరుణించి నీ మనసు కాస్త నా వైపు మళ్లించుకోవా ప్లీజ్!" అన్నాడు చిరంజీవి వంక దీనంగా చూస్తూ.

చిరంజీవి మాటలు విని ఫక్కున నవ్వేసింది మాలతి.

"అమ్మయ్య నవ్వేశావా? ఏది ముత్యాలెక్కడైనా రాలాయేమో ఏరుకుంటాను తప్పుకో!" అన్నాడు చిరంజీవి చుట్టూ చూస్తూ.

భర్త అల్లరి చూసి నవ్వేస్తూ "చాల్లెండి, ఎవరైనా వింటే నవ్వుతారు గాని పదండి కిందకు కాలేజికి టైమవ్వడం లేదా? " అంది మాలతి.

"అవుతుంది దానికేం బుద్ధిలేదు. ఆ గడియారానికి వేరే పనేం లేనట్లు ఉదయం పూట గిర్రున తిరిగిపోతుంది. సాయంత్రం నత్తనడకలా నెమ్మదిగా నడుస్తుంది. ఎంతకీ ఐదు కాదు, అదేమిటో గానీ" అన్నాడు చిరంజీవి ఆశ్చర్యం నటిస్తూ.

"అదంతే లెండి మీ కోసం రెండు రకాల గడియారాలు మీ మనసులోనే తయారవుతున్నాయి. ఒకసారి వేగంగా ఒకసారి ఆలస్యంగా నడిచేందుకు! పదండి, అత్తయ్యగారు కేకలేస్తారు అన్నం చల్లారిపోతుందని" అంటూ చిరంజీవిని చెయ్యి పట్టుకొని కిందకు తీసుకువచ్చింది మాలతి మేడ మీద నుండి.

చిరంజీవి భోజనం చేసి వెళ్లాక అత్తగారితో పాటు తానూ భోజనం చేసి వంటిల్లంతా సర్ది మీది గదిలోకి వెళ్లిపోయింది మాలతి.

చిరంజీవి అన్నట్లు కాస్త తను మనసు మళ్లించుకోవాలి. భార్యగా తన నుండి ఎన్నో ఆశిస్తున్న అతన్ని చాలా నిరాశ పరుస్తోంది తను అనుకుంది మాలతి. రూమ్ అంతా నీట్‌గా సర్దింది. బట్టలన్నీ పొందిగ్గా మడత పెట్టింది. పెళ్లినాటి తన ఫొటోని ఫ్రేమ్‌లో పెట్టి టేబిల్ మీదుంచింది. ఏదో పని కల్పించుకుని చేస్తున్న ఆమె మనసంతా అదోలానే ఉంది. మనసు మళ్లించుకోవాలని కల్పించుకున్న పని ఆపేసి కిటికీ దగ్గరకు వెళ్లి నుంచుంది బయటకు చూస్తూ. ఎదురింటి ముందు వాకిలిలో ఆడుకుంటున్న ఇద్దరు పిల్లల్ని చూస్తూండిపోయింది. వాళ్లని చూస్తుంటే తన చిన్నతనం మదిలో మెదిలింది.

అసలు ఆ రోజు స్వాతిని మొదటిసారి చూసిననాడు... మెల్లమెల్లగా మాలతి తన జ్ఞాపకాల దొంతరలలోకి జారిపోయింది.




రంగారావుకి సంవత్సరం మధ్యలో ట్రాన్స్ఫర్ కావడంతో స్వాతిని స్కూల్లో చేర్చడం పెద్ద సమస్య అయిపోయింది. మంచి కాన్వెంట్‌లో ఎక్కడా సీటు దొరకలేదు. ఆఫీసులో చాలా మంది 'ఆర్వెల్ స్కూల్" మిగిలిన వాటిలో కాస్త బెటర్. మీ అమ్మాయిని అక్కడ జాయిన్ చేయండి!" అని సలహా ఇచ్చారు.

పోనీలే ఇదీ బాగానే ఉంది. ఈ స్కూల్ అయితే మేముంటున్న ఇంటికి కాస్త దగ్గరగా కూడా ఉంటుంది అనుకున్న రంగారావు స్వాతిని "ఆర్వెల్ స్కూల్"లో జాయిన్ చేసేందుకు నిశ్చయించుకున్నాడు. ఆ స్కూలు ప్రిన్సిపాల్ "సంవత్సరం మధ్యలో ఎలాగండీ ఎడ్మిషన్? " అని గొణుగుతూ బిల్డింగ్ ఫండ్ పేరిట కొంత డబ్బు డొనేషన్‌గా కట్టించుకొని తమ స్కూల్లో ఉచితంగా, ఉదారంగా సీటిస్తు

న్నట్లుగా స్వాతిని అడ్మిట్ చేసుకుంది.

ప్యూన్ వచ్చి స్వాతిని క్లాస్‌రూంలో దిగవిడిచి వెళ్లిపోయాడు. కొత్తగా చేరిన స్వాతి బెరుకు బెరుకుగా చూస్తూ లోపలికి వచ్చింది.

అయితే ఎవరికి వారే కొత్తగా చేరిన స్వాతిని తమ జట్టులో చేర్చుకోవాలని తాపత్రయ పడిపోతూ తమ పక్కన చోటుచేసి కూర్చోమని చూపించసాగారు.

మాలతి కూడా అందరి లాగే తన పక్కన కూర్చోమని స్వాతికి చోటు చూపించింది. మాలతి వేసుకున్న బట్టలు కొంచెం పాతబడి మాసిపోయి ఉండడంతో స్వాతి ఆమె పక్కన కూర్చునేందుకు ఇష్టపడలేదు. ఆ వెనక బెంచీలో ఉన్న లీల పక్కకు వెళ్లి కూర్చుంది. లీల మిగతా అందరి వైపూ గర్వంగా చూసింది. దాంతో ముఖం చిన్నబోయింది.

లీల ఆడంబరాల కిచ్చిన ప్రాధాన్యత చదువుకు ఇవ్వదు. ఎప్పుడూ పదిమంది పిల్లలను వెంటేసుకొని వాళ్లకు చాక్లెట్లూ ఐస్‌క్రీంలూ కొని పెట్టి తన చుట్టూ తిప్పుకుంటుంది. తన మాట వినని వారిని ఏదో విధంగా ఏడిపించి ఆనందం పొందుతూ ఉంటుంది.

మాలతి అందుకు పూర్తి వ్యతిరేకంగా ఉంటుంది. ఏది ఉన్నా లేకపోయినా చదువులో ఎప్పుడూ ఫస్ట్ రాంక్ మాలతిదే! స్వాతి ఏవరేజ్ స్టూడెంటే అయినా లీలతో స్నేహం వలన వచ్చింది కూడా మరచిపోయే పరిస్థితి ఏర్పడింది. అందులోనూ సంవత్సరం మధ్యలో చేరడంతో జరుగుతున్న పాఠాలను అందుకోలేకపోయింది.

టీచర్ క్లాసులో పాఠం సీరియస్‌గా చెప్తుండగా లీల, స్వాతి పుస్తకం అడ్డుపెట్టుకొని ముందురోజు చూసిన సినిమా కథ చెప్పుకుంటున్నారు. వాళ్ల గుసగుసలను గమనించిన టీచర్ ఇద్దర్నీ నించోమని తానంతవరకూ చెప్పిన పాఠం ఎంతవరకూ అర్థమైందో చెప్పండి అంటూ ప్రశ్నించింది.

టీచర్ హఠాత్తుగా అలా నించోబెట్టి ప్రశ్నించడంతో ఇద్దరూ తెల్లమొహం వేశారు.

దాంతో అదే ప్రశ్నను మాలతిని అడిగారు. వెంటనే మాలతి టీచర్ అడిగిన ప్రశ్నకు చక్కగా జవాబు చెప్పింది. వెంటనే టీచర్ తన అలవాటు ప్రకారం జవాబు చెప్పని ఇద్దరికీ మాలతితో చెరో దెబ్బా వేయించారు. అలా చేస్తే తోటి పిల్లలతో క్లాసులో దెబ్బలు తినడం అవమానంగా భావించి మరెన్నడూ క్లాసులో పాఠం చెప్తుండగా కబుర్లు చెప్పరని చదువును నిర్లక్ష్యం చేయరని ఆ టీచరు నమ్మకం.

అయితే ఆ విధంగా వాళ్లిద్దర్నీ కొట్టమనడంతో లీలని మాత్రం మామూలుగా కొట్టిన మాలతి తన జట్టు చేరలేదనే ఉక్రోషంతో తన బలమంతా ఉపయోగించి స్వాతి చెంపమీద కొట్టింది. ఆ దెబ్బకి లేత బుగ్గ వాత తేలి ఎర్రగా కందిపోయింది. అది చూసిన టీచరు మనస్సు చివుక్కుమంది. కాని కొట్టమన్నది తానే కనుక అప్పటికే మీ అనక మౌనం వహించినా ఆ తరువాత మాలతిను చాటుకు పిల్చి చీవాట్లు వేసింది.

దెబ్బ కొట్టడమైతే కొట్టింది గానీ స్వాతి చెంప మీద తేలిన వాత చూశాక ఎంతో భయం వేసింది మాలతికి. ఆపైన టీచరు కూడా తిట్టడంతో ఇంకా భయపడింది ఏం జరుగుతుందోనని.

ఆ మరునాడు స్వాతి స్కూలుకు రాలేదు. మూడోరోజు స్వాతికి జ్వరంగా ఉన్నట్లు లీవు లెటర్ పంపడంతో పాటు ప్రిన్సిపాల్‌గారి రూముకు మాలతిని పిలిపించారు. రంగారావు కూడా అక్కడ ఉండడం గమనించిన మాలతి మరింత భయపడిపోయింది.

రంగారావు ఎదుటే ప్రిన్సిపాల్ చెడామడా తిట్టడంతో వెక్కివెక్కి ఏడుస్తున్న మాలతిని చూస్తే రంగారావుకి జాలి వేసింది "ఛ అనవసరంగా వచ్చాను. అసలా అమ్మాయి తప్పేముంది? స్వాతి సరిగ్గా చదవకే కదా ఇదంతా వచ్చింది" అనుకున్నాడు. చివరికి తానే ప్రిన్సిపాల్‌కి సర్ది చెప్పి మాలతి భుజం తట్టి వెళ్లిపోయాడు. టీచర్లు అంతటితో తమ

బాధ్యత తీరిపోయినట్లుగా వదిలేశారా విష యాన్ని.

కాని మాలతి మాత్రం ఇంటికి వచ్చినా అలా బాధపడుతూనే ఉండిపోయింది అన్నం కూడా తినకుండా. "నా మూలంగానే స్వాతికి జ్వరం వచ్చిందే" అనే అపరాధ భావంతో.

ఎప్పుడూ చలాకీగా ఉండే చెల్లెలు అలా దిగులుగా ఉండడం గమనించిన కమల "మాలా, ఎందుకలా ఉన్నావు? మీ టీచరుగా రేమన్నా అన్నారా? లేక క్లాసులో ఎవరైనా కొట్టారా? " అనడిగింది లాలనగా.

ఆ మాటలకు చల్లగాలి తగిలిన మేఘంలా భోరున ఏడ్చేసింది మాలతి. ఏడుస్తూనే జరి గిందంతా చెప్పింది కమలకి.

అలా అంత గట్టిగా స్వాతిని కొట్టినందుకు కమలకి కూడా బాధనిపించినా అప్పటికే చేసిందానికి ఏడుస్తున్న మాలతిని ఏమీ అన లేక "సరే, జరిగిందేదో జరిగింది, నువ్వు ఇప్పుడు వాళ్లింటికి వెళ్లి ఎలా ఉందో చూసిరా. జరిగిందానికి సారీ చెప్పిరా వెళ్లు!" అంది కమల.

"అమ్మో! నాకు భయం. నేను తనని అంత గట్టిగా కొట్టానని వాళ్లమ్మా వాళ్ళకి చెప్పి నన్ను కొట్టిస్తుందేమో!" అంది మాలతి గుండెల మీద చేతులుంచుకొని భయంగా చూస్తూ.

"ఏం కొట్టించదు. చూడడానికి నువ్వలా వెళ్లడంతోనే సగం కోపం తగ్గిపోతుంది. మిగతా సగం నువ్వు క్షమించమనడంతో పోతుంది" అంది కమల అభయం ఇస్తున్న ట్లుగా.

కమల ఇచ్చిన ధైర్యంతో మనసు చిక్కబట్టు కొని స్వాతి ఇంటికి వెళ్లింది మాలతి. కాని వాకిట్లో కుక్క "భౌ" మంటూ మీదకు రావ డంతో గేటు దగ్గరే ఆగిపోయింది జంకుగా. అలా ఎంతసేపు ఉండేదో? ఈలోగా స్వాతి తల్లి జానకమ్మ కుక్క అరుపు విని బైటకు వచ్చి మాలతిని చూసింది.

ఉదయం స్కూలుకు వెళ్లి మట్టి కొట్టుకుపో యిన బట్టలతోనే ఇంటికి వచ్చిన మాలతిని చూసి జానకమ్మ ముఖం చిట్లిస్తూ "ఎవరు కావాలి? " అంది విసుగ్గా.

మాలతి బితుకు బితుకుమనే గుండెలతో నేలవైపు చూస్తూ "స్వాతి నిన్న, ఈ రోజూ స్కూలుకు రాలేదు, చూసిపోదామని వచ్చాను' ' అంది.

"స్కూలుకెలా వస్తుంది? ఎవరో రాలు గాయి పిల్ల మా స్వాతి చెంప పగలగొట్టే సింది. దాంతో పిచ్చిపిల్ల బెంగపడి జ్వరం తెచ్చుకుంది" అంది.

ఆ కొట్టింది తనేనని చెప్పే ధైర్యం లేక "ఇప్పుడెలా ఉందండీ? ఒకసారి చూడొ చ్చా? " అంది మాలతి మర్యాద ఉట్టి పడు తున్న గొంతుతో.

వేసుకున్న బట్టలు బాగా లేకపోయినా మాలతి మాటతీరు నచ్చింది జానకమ్మకు. తమ ఇల్లు స్కూలుకు దగ్గరే కనుక, స్కూల య్యాక ఆటల కోసం అందర్నీ వెంటబెట్టు కొస్తూ ఉండేది స్వాతి. తాను పెట్టినవన్నీ తినేసి హాయిగా ఆడుకొని వెళ్లిన వాళ్లలో ఏ ఒక్కరూ స్వాతిని చూడడానికి రాలేదు. ఈ పిల్ల ఎప్పుడూ తమింటికి రాకపోయినా స్వాతికి బాగా లేదని తెలిసి రావడంతో జానకమ్మ మనసు మెత్తబడిపోయింది.

"స్వాతి కోసం వచ్చావా రామ్మా లోపలికి, అదుగో ఆ గదిలో పడుకుంది వెళ్లు" అని ఎంతో మృదువుగా అంటూ లోపలికి ఆహ్వా నించింది జానకమ్మ తన చిరాకునంతా మరి చిపోయి.

మాలతి స్వాతి దగ్గరకు వెళ్లి "స్వాతీ!" అంటూ తన పిలుపు తనకే వినబడనంత మెల్లగా పిలిచింది.

ఆ పిలుపుతో మెల్లగా కళ్లు తెరిచిన స్వాతి ఎదురుగా మాలతి కనిపించడంతో ఆశ్చర్యపో యింది. అంతలోనే తనని అంత గట్టిగా కొట్టింది కదా అన్న కోపంతో "ఎందుకొ చ్చావు? " అంది.

స్వాతి అలా కోపంగా అడిగేసరికి మాలతికి

దుఃఖం ముంచుకు వచ్చింది. అతిప్రయత్నం మీద దాన్ని బిగబట్టి "నిన్ను అంత గట్టిగా కొట్టినందుకు, స్కూల్లో టీచరుగారూ, ప్రిన్సిపాలుగారూ నన్ను బాగా తిట్టారు. మా అక్కయితే నువ్వెలా ఉన్నావో చూసి, నీకు సారీ చెప్పి రమ్మంది" అంటూ ఏడ్చేసింది మాలతి. అలా ఏడుస్తున్న మాలతిని చూడడంతోనే స్వాతి మనసు కరిగిపోయింది.



అంతవరకూ మాలతి మీదున్న కోపం లీల మీదకు మళ్లింది. అసలు దీనికంతకూ కారణం లీలే. తాను వద్దంటున్నా సినిమా కథ చెప్పి టీచరుగారి దృష్టిలో పడేలా చేసి కొట్టించింది. చివరికి తనకింత జ్వరంగా ఉన్నా చూడడానికి రాలేదు. ఇక మీదట లీల జట్టు అసలుండనే కూడదు అనుకుంది స్వాతి.

స్వాతి ఏమంటుందోనని ఆదుర్దాగా చూస్తున్న మాలతి నవ్వు ముఖంతో తన వంక చూస్తున్న స్వాతిని చూసి కొండంత భారం దిగి పోయిన ట్లుగా అనిపించింది.

"మరి నన్నంత గట్టిగా కొట్టావెందుకు?" అంది స్వాతి సందేహంగా చూస్తూ.

"నువ్వు నా జట్టుండడం మానేసి లీల జట్టు చేరావు కదా అందుకే కోపమొచ్చి అలా కొట్టాను" అంది మాలతి అసలు విషయం బైటపెడుతూ.

"నిజంగా నీ జట్టు లేననే కొట్టావా?" అంది స్వాతి ఆశ్చర్యంగా చూస్తూ.

"ఒట్టు. నా జట్టుంటే నిన్నెందుకు కొడ తాను?" అంది మాలతి తన అరచెయ్యి తల మీద పెట్టుకుంటూ.

"సరే, అయితే ఇవ్వాళ నుండీ మనిద్దరం ఒక్కటీ!" అంది స్వాతి ఉత్సాహంగా.

కూతురు లేచి ఉత్సాహంగా మాట్లాడడం గమనిం చిన జానకమ్మ ఇద్దరికీ బిస్కెట్లు పెట్టి తాగేందుకు పాలిచ్చింది.

చాలాసేపు ఇద్దరూ ఎంతో ఉత్సాహంగా కబుర్లు చెప్పుకున్నారు. ఆ తరువాత చీకటి పడటం గమనిం చిన మాలతి

"ఇక నేను వెళ్తాను. ఇంటి దగ్గర అమ్మ చూస్తూ

ఉంటుంది" అంటూ లేచింది.

"అప్పుడేనా? మరి కాసేపుండలేవా? " అంది స్వాతి దిగులుగా చూస్తూ.

"ఉహు... వెళ్తాను. మళ్ళీ రేపు వస్తాను కదా!" అంది మాలతి హామీ ఇస్తున్నట్లుగా.

"అయితే ఉండు" అంటూ పక్కనే స్టూల్ మీదున్న యాపిల్ పండు అందుకుని దాన్ని చాకుతో కోసి "ఫిఫ్టీ ఫిఫ్టీ ఇక మీదట ఏద యినా సగం సగమే మనిద్దరికీ!" అంది స్వాతి మాలతికి యాపిల్ ముక్క అందిస్తూ.

తన మనసులోని భావాన్ని వ్యక్తీకరించే భాష స్వాతికి తెలియకపోయినా స్వచ్ఛమైన మనసుతో ఆ విధంగా స్నేహహస్తం అందిం చింది మాలతికి.

దానికి జవాబుగా ఆ ముక్కని ఎంతో ఇష్టంగా అందుకొని "సరే అయితే ఇక ముందెప్పుడూ మనిద్దరం పోట్లాడుకోకూడదు. ఎప్పుడూ కలిసే ఉందాం!" అంది మాలతి వాగ్దానం చేస్తున్నట్లుగా.

అలా ఆ పసి హృదయాలు రెండూ ఒకటై పోయాయి. ఆనాడు అల్లిబిల్లిగా అల్లుకున్న ఆ స్నేహలత ఇంతింతై వటుడింతై అన్నట్లు ఆకా శమంత ఎత్తు ఎదిగిపోయి విడదీయరానంత బలంగా అల్లుకుపోయింది వారి మధ్య.

**8**




స్వాతి జ్వరం తగ్గాక మాలతి, స్వాతి కలిసి స్కూలుకు రావడం టీచర్లతో సహా అందర్నీ ఆశ్చర్యపరచింది.

స్వాతి స్కూలుకు వచ్చాక పగ తీర్చుకుందా మని కాచుక్కూర్చున్న లీల వారిద్దరూ కలసి రావడం చూసి మరీ ఆశ్చర్యపోయింది. స్వాతి లీలతో పూర్తిగా మాట్లాడడం మానే సింది. మాలతిని చూసి "మురికి పిల్ల!" అని ఈసడించే స్వాతి ఇప్పుడు స్కూల్లో మాలతిని ఒక్కక్షణం కూడా విడిచి ఉండడం లేదు.

ఈ సంఘటన జరిగిన తరువాత క్లాసులో ఫస్ట్, సెకెండ్ రాంకులు స్వాతీ, మాలతిలవే అయ్యాయి.

మాలతితో స్నేహం చేయకముందు టీచర్లు స్వాతిని చూసి, "అబ్బే ఈ పిల్లకు షోకుల మీదున్న శ్రద్ధ చదువు మీద లేదు!" అని పెదవి విరిచిన వారు ఇప్పుడు స్వాతి తెచ్చు కొనే మార్కులు చూసి "తెలివైన పిల్ల!" అని మెచ్చుకోసాగారు.

స్వాతి మాత్రం "నీతో స్నేహమే నాకిన్ని పొగడ్తలు తెచ్చి పెడుతోంది చూశావా? " అంటూ నవ్వేది హాయిగా.

రోజులు గడుస్తున్నకొద్దీ మాలతి, స్వాతిల మధ్య స్నేహం మరింత గాఢమయింది. వాళ్ళు చదవని మంచి పుస్తకం, చూడని మంచి సినిమా లేవంటే అతిశయోక్తి కాదు.

చెట్టా పట్టా లేసుకు తిరిగే వాళ్ళిద్దర్నీ చూసి ఇంట్లో వాళ్ళు "మగరాయుళ్ళలా ఆ తిరుగుళ్ళే మిటి? " అని తిడితే, టీచర్లు మాత్రం "వాళ్ళి ద్దర్నీ చూసి నేర్చుకోండి!" అంటూ మిగతా వారిని మెత్తగా చీవాట్లు వేసేవారు.

మాలతికి ఒక అక్క ఇద్దరు తమ్ముళ్ళు. స్కూలు అయ్యాక బుక్స్ ఇంట్లో పడేసి మాల తితో పాటు వాళ్ళింటికి వచ్చేస్తుంది, మాలతి తమ్ముళ్ళతో ఆడుకునేందుకు, అక్కడికి వాళ్ల ఇల్లు దగ్గరే కావడంతో.

స్వాతిలో స్నేహం కాకముందు మాలతి తన తమ్ముళ్లనసలు దగ్గరకు చేరనిచ్చేది కాదు, తన వస్తువుల్ని పాడు చేస్తున్నారంటూ, కాని స్వాతి "నాకు తమ్ముళ్ళు లేరు, ఎంచక్కా నీకు ఇద్దరు తమ్ముళ్ళున్నారు. నాకో తమ్ముడ్ని ఇవ్వ కూడదూ? ఆడుకునేందుకు" అనేది ఏదో ఆట వస్తువు అడిగినట్లుగా. మాలతి స్నేహితురాలి కోర్కె తీర్చాలని ఆ మాట తల్లితో చెప్పింది. అది విన్న ఇందిరమ్మ "ఒక్కడ్నేం ఖర్మ! నీక్కా వాలంటే ఇద్దర్నీ ఇచ్చేస్తుంది మా మాలతి.

తీసేసుకో!" అంది నవ్వుతూ.

"నిజంగానా? " అనడిగింది స్వాతి ఆశ్చ ర్యంగా చూస్తూ. అలా అమాయకంగా అడు గుతున్న స్వాతికి ఎలా సమాధానం చెప్పాలో అర్థం కాని ఇందిరమ్మ "వీళ్లిద్దరూ మాలతికే కాదు, నీకూ తమ్ముళ్ళే. కానీ చిన్నవాళ్లు కదా. నన్ను విడిచి ఉండలేరు. పెద్దయ్యాక తీసుకు పోదువు కాని, అంతవరకూ రోజూ ఇక్కడికి వచ్చి ఆడుకో!" అంది నవ్వుతూ.

ప్రస్తుతం తీసుకు వెళ్ళవద్దన్నందుకు నిరాశ పడినా తరువాత ఇచ్చేస్తానన్నందుకు ఎంతో సంతోషపడింది. తనకి తినమని తల్లి ఇచ్చే బిస్కెట్లూ, చాక్లెట్లూ దాచి ఉంచి వాసుకీ, శ్రీకాంత్‌కీ తెచ్చి ఇచ్చేది ఎంతో ప్రేమతో. స్వాతిని చూసి తమ్ముళ్ళు ఉండడం గొప్పగా భావించిన మాలతి తాను కూడా వాళ్లని ప్రేమగా చూడసాగింది. ఇద్దరిళ్లూ కాస్త దగ్గర కావడంతో దాదాపు నిద్రవేళ వరకూ ఒకేచోట గడిపేవారిద్దరూ.

రోజులు గడుస్తున్నకొద్దీ స్వాతికి పరిస్థి తులు అర్థం కాసాగాయి. మాలతి తమ్ముళ్ళు తన తమ్ముళ్ళు కారని, వాళ్ళు పెద్దవాళ్లయినాక కూడా ఇందిరమ్మ తనకు ఇవ్వదని అర్థం చేసుకుంది. నాకూ ఓ తమ్ముడుంటే ఎంత బాగుండును? అనుకోసాగింది.

అలాంటి సమయంలో ఓ రోజు సాయంత్రం స్కూలు నుండి వచ్చిన స్వాతిని రంగారావు ముద్దులతో ముంచెత్తుతూ, "ఒరే తల్లీ, తొందరలోనే అమ్మ నీకో చిట్టి తమ్ము డినో, చెల్లెలినో ఇస్తుందటరా!" అంటూ తాను బజారు నుండి తెచ్చిన స్వీటును కూతురి నోటికందించాడు. ఆ మాట విన్న స్వాతి ఆనందానికి అంతే లేదు.

"నాకు చెల్లి వద్దు నాన్నగారూ. మాలతిలా నాకూ తమ్ముడే కావాలి" అంది స్వాతి ఉప్పొంగే సంతోషంతో.

"తప్పు అలా అనకూడదు. దేముడు ఎవర్ని ఇస్తే వాళ్లని నువ్వు బహుమతి అనుకొని స్వీకరించాలి" అన్నాడు రంగారావు లాలనగా.

"సరే అయితే ఈ సంగతి మాలతికి చెప్పి వస్తాను" అంటూ తండ్రి తెచ్చిన స్వీట్ బాక్సులో నుండి చేతికందినన్ని స్వీట్లు పట్టు కొని బట్టలైనా మార్చుకోకుండా మాలతి ఇంటికి పరుగు తీసింది స్వాతి. వెనుక నుండి జానకమ్మ "పాలు తాగి పోవే" అంటున్నా వినిపించుకోకుండా.

"పిచ్చి పిల్ల. దానికెంత తోస్తే అంత! ఏమిటో ఈ బంధం? ఆ పిల్లంటే పంచప్రా ణాలు పెడుతుంది. ఆ పిల్ల కూడా ఒక్క క్షణం దీన్ని విడిచి ఉండడానికి ఇష్టపడదు" అంది జానకమ్మ కూతురు వెళ్ళిన వంకే ఆపే క్షగా చూస్తూ.

పుట్టబోయే తమ్ముడి కోసమని తన బొమ్మలూ, ఆట సామాన్లూ జాగ్రత్త చెయ్య సాగింది. "నేను మా తమ్ముడు గాని, చెల్లి గాని పుడితే ఇలా ఆడిస్తాను, అలా ఆడిస్తాను' ' అంటూ స్వాతి చెప్పే కబుర్లు అన్నీ ఎంతో ఆసక్తిగా వినేది మాలతి. వాళ్ళ కబుర్లు ఎలా ఉండేవంటే వాడు పుట్టిన వెంటనే తమతో ఆటలకు వచ్చేస్తాడు అన్నట్లుండేవి.

జానకమ్మ పండంటి మగపిల్ల వాడికి జన్మ నిచ్చింది. వాడి బుల్లి బుల్లి కాళ్లూ చేతులూ చూసి ఎంతో ఆశ్చర్యపోయేది స్వాతి. వాడు నవ్వినా, ఏడ్చినా అటూ, ఇటూ కదిలినా అదో అపురూప దృశ్యంలా చూస్తుండేది. వాడిని విడిచి బడికి వెళ్ళాలన్నా స్వాతి ఇష్టపడేది కాదు. రోజూ రంగారావూ జానకమ్మా ఎంతో బుజ్జగించి బడికి పంపేవారు.

పూర్వం స్వాతి మాలతి ఇంటి దగ్గర గడి పితే ఇప్పుడు మాలతి స్వాతి ఇంట్లోనే గడు పుతోంది. ఇద్దరూ మంచం చుట్టూ చేరి "రవీ, రవీ" అంటూ జానకమ్మ ఎంత వారిస్తున్నా వినకుండా పోటీలు పడి ఎత్తుకొనేవారు.

రోజులు నిమిషాల్లా అతి సంతోషంగా గడిచి పోతున్నాయి. మాలతి, స్వాతి టెన్త్ లోకి వచ్చారు. సిసింద్రీల్లా తిరిగే చిన్నారులి ద్దరూ టెన్త్ క్లాసులోకి రావడంతోనే పెద్ద ఆరిందాల్లా ఫీలయిపోతూ "బాల్యం ఎంతో

మధురమైంది కదూ!" అని చిన్నప్పటి చెంప దెబ్బలు తరువాత తమ స్నేహం, ఆట పాట లూ తలచుకొని, తలచుకొని నవ్వుకొనేవారు.

ఇంట్లో పెద్దవాళ్లు కూడా వాళ్లిద్దరి స్నేహా నికీ ఎటువంటి అభ్యంతరం తెలుపలేదు.

## 9

టెన్త్ పరీక్షలు రాసేసి ఫలితాల కోసం ఎదురు చూస్తున్నారు స్నేహితులిద్దరూ.

ఆ రోజు స్వాతి మాలతి ఇంటికి వెళ్లేసరికి మాలతి భవిష్యత్తుపై చర్చా, నిర్ణయం జరిగి పోతున్నాయి. అయితే అందులో మాలతి అభిప్రాయం ఏమిటని విశ్వనాథం గానీ, ఇందిరమ్మ గానీ అడగలేదు. చాలీచాలని మధ్య తరగతి సంసారంలో ఉండే ఒడిదుడు కులు ఆ ఇంటా ఉన్నాయి. పెద్ద కూతురు కమలని పెద్దమనిషైన వెంటనే, ఎనిమిదవ తరగతి చదువుతున్నదాన్ని చదువు మానిపిం చారు. కమల చదువుకుంటానని ఎంత గొడవ పెట్టినా వినకుండా, నువ్వు పెద్ద చదు వులు చదివితే ఇంకా పెద్ద చదువులు చది విన వరుణ్ణి మేము తేలేమంటూ కనీసం టెన్త్ వరకైనా కమలని చదివించలేదు.

ఇప్పుడు చదువు మానిపించి ఐదేళ్లయినా ఏ సంబంధమూ కుదరక అటు చదువూ లేక ఇటు పెళ్ళీ జరగక రెంటికీ చెడిన రేవడిలా ఉండిపోయింది కమల. తల్లిదండ్రులు చేస్తున్న చర్చంతా వింటున్న కమల అంది.

"నాకెలాగూ చదువుకునే అదృష్టం లేకుండా పోయింది, కనీసం దాన్నయినా చదువుకోనీ యండి నాన్నా. ఎలాగూ నా పెళ్లయితే గాని మాలతి పెళ్లి చేయలేరు కదా. అందాకా అదేం చేస్తుంది. ఇంట్లో గోళ్లు గిల్లు కుంటూ కూర్చోవాలి నాతో పాటూ"

"అది కాదు కమలా. మాలతి ఇంకా చదువుతూపోతే దాని చదు వుకు తగిన వరుణ్ని తెచ్చి పెళ్ళి చెయ్యగలనా నేను? " అన్నాడు విశ్వ నాథం.

"వద్దు



నాన్నా. ఈ మాటే చెప్పి ఆనాడు నన్ను స్కూలు మానిపించారు. ఐదు సంవత్సరాలయినా ఇంతవరకూ ఒక్క సంబంధమూ కుదరలేదు. ఇప్పుడంతా నన్నేమంటున్నారు. బొత్తిగా ఎనిమిదవ తరగతా అనడుగుతున్నారు. రేపు చెల్లాయినీ అలాగే అంటారు. టెన్త్ క్లాసూ ఓ చదువేనా అని. అప్పట్లో మీకు ఎదురు చెప్పే ధైర్యం లేక తల వంచాను నేను. కానీ ఈసారికి నా మాటవిని చెల్లాయిని కాలేజీలో చేర్పించండి నాన్నా!" అంది కమల ప్రాధేయపడుతున్నట్లుగా.

"అది కాదే కమలా. దీని వెనక వాసూ, శ్రీకాంతూ చదువులకు ఎక్కి వస్తున్నారు. నాన్నగారికి ముగ్గుర్ని చదివించే తాహతెక్కడుందే" అంది ఇందిరమ్మ.

"ఇంకా తమ్ముళ్ళిద్దరూ ఆ స్థాయికి చేరలేదు కదమ్మా. అందాకా నా మాట విని దాన్ని చదువుకోనివ్వండి" అంది కమల. అంతలోనే స్వాతి రావడంతో మాలతి ఎదురు వెళ్ళి లోపలికి తీసుకు వచ్చింది.

"ఏమిటే మాలతీ. ఇంట్లో అంతా చాలా సీరియస్‌గా కనబడుతున్నారు?" అనడిగింది స్వాతి.

"ఏముంది. నన్ను కాలేజీలో చేర్పించాలా వద్దా? అని" అంది.

"అయితే ఏం తేల్చారు?" అంది.

"తేల్చడానికేముంది? అక్కెంత గోల పెట్టినా వినకుండా ఎయిత్ క్లాస్‌తోనే దాని చదువాపేశారు. కాని ఇంత కాలమైనా సరైన సంబంధం ఒక్కటీ కుదరలేదు. నాన్నకొచ్చే కొద్దిపాటి జీతం, అమ్మ చేసే చిన్న చిన్న పొదుపులతో సంసారం గడవడానికే బొటాబొటీగా సరిపోతోంది. పెళ్ళివారడిగే కట్నాలూ, గొంతెమ్మ కోరికలూ నాన్నగారెక్కడ తీర్చగలరు? ఇప్పుడు కొత్తగా మరో చిక్కు వచ్చి పడింది. అక్క చదువు తక్కువని, అందుకే అక్క నన్ను కాలేజీలో చేర్పించమని గట్టిగా చెప్తోంది. ఇంతలో నువ్వొచ్చావు"

"బాగుందే, మరి నీ అభిప్రాయం ఏమిటి?" అంది.

"ఇంకా అర్థం కాలేదా? అమ్మా నాన్నా ఏం చెప్తే అదే. మరి నీ సంగతేమిటి?" అంది మాలతి కుతూహలంగా చూస్తూ.

"నా సంగతి మరీ ఘోరంగా ఉందే మాలతీ. అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని అన్నట్లు మా అమ్మకు నా పెళ్ళి చేసేయాలని చాలా తొందరగా ఉందే. నాన్నగారేమో దాని కింకా పసితనమే వదల్లేదు, అప్పుడే పెళ్ళేంటి అంటారు. కానీ అమ్మ వినదు. మా సూర్య మావయ్య తెలుసు కదా నీకు. తను ఎం.ఏ. చదువుతున్నాడు. తన్ని ఎవరైనా ఎగరేసుకు పోతారేమోనని అమ్మ భయం. ఎంత చెప్పినా ఒకే మొండి పట్టుదల. అమ్మ ఇలా అంటోందని నాన్నగారి ఆఫీసులో చెప్తే, అంతా ఒకటే నవ్వారట. వాళ్లంతా నవ్వుతున్నారని నాన్నగారంటే, నవ్వితే నవ్వనీయండి. వాళ్ల కోసం రత్నంలాంటి నా తమ్ముడ్ని చేయి జార్చుకుంటామా ఏమిటి? కావాలంటే తరువాత చదువుకుంటుందిలెండి. ఏం? పెళ్ళిళ్ళు అయ్యాక ఎంతమంది చదువుకోవడం లేదు" అంది.

"మీకు ఆర్థిక పరిస్థితి సమస్య అయితే, నాకు మా అమ్మ ఆలోచన పెద్ద సమస్యయిపోయింది. మన క్లాసుమేట్సంతా పరీక్షలు రాయకముందే మెడిసిన్ చదువుతామని, ఇంజనీరింగ్ చదువుతామని, లా చదువుతామని ఒకటే కబుర్లు. ఆఖరికి ఆ మొద్దు పిల్ల లీల. పరీక్షల్లో కాపీలు కొట్టేది కూడా లా చదువుతానని గొప్పలు పోతోంది. అవకాశాలు లేకపోయాక. మనకు ఇన్ని తెలివితేటలుండి ఏం లాభం? ఇక రేపటి నుండీ వంటలక్కల్లా వంటింట్లో పడి ఉందాం!" అంది స్వాతి అక్కసుగా.

"బావుందే... వంట చేసేవాళ్లంతా వంటలక్కలయితే మనమ్మా వాళ్లంతా వంటలక్కలే నన్నమాట!" అంది మాలతి నవ్వుతూ.

"ఊc సంతోషించాంలే తెలివికి. కాస్త తొందరగా తయారయితే బీచ్‌కి తగల

దదాం!" అంది స్వాతి ఇంకా తగ్గని కోపంతో.

"అయ్యో స్వాతీ! మనం బీచ్‌కెళ్లి తగలడితే అక్కడున్న మనషులంతా చూస్తూ ఊరుకుంటారంటావా? సముద్రంలో నీళ్లన్నీ తోడి తెచ్చి మనమీదే పోస్తారు. ముఖ్యంగా బాయ్స్ అస్సలూరుకోరు!" అంది మాలతి టీజ్ చేస్తున్నట్లుగా.

"చాల్లే తెలివి. నువొస్తే రా, లేకపోతే మానేయ్. నేపోతున్నా!" అంటూ చరచరా బైటకు నడిచింది స్వాతి.

"అయ్యో, ఇదంతా కోపమే. మా బంగారు స్వాతికి కోపం పోవాలంటే ఏం చెయ్యాలటా? " అంది మాలతి బుగ్గన చేయి పెట్టుకొని ఆలోచన నటిస్తూ. దాంతో స్వాతి ఫక్కున నవ్వేసింది.

"అమ్మయ్య, నవ్వేశావా? ఈ పూటకి గండం గడిచినట్లే!" అంటూ స్వాతిని లాక్కొచ్చి కుర్చీలో కూర్చోబెట్టింది.

"ఏంటే మాలా పెద్దవాళ్ల నిర్ణయాలు చూసి నాకు వళ్లు మండిపోతూంటే నువ్వలా నిమ్మకు నీరెత్తినట్లు ఎలా ఉండిపోతున్నావే? " అంది స్వాతి.

"లేకపోతే ఏడుస్తూ కూర్చోనా? మా కమలక్క ఏమంటుందో తెలుసా? ప్రతీ సమస్యకీ ఓ పరిష్కారం ఉంటుంది కనుక ఆవేశపడి బాధపడేకంటే ఆలోచించి జీవితంలో గెలుపు సాధించే మార్గం ఎంచుకోవాలీ అంటుంది. అందుకే అమ్మా నాన్న చదువాపేసినా అది కష్టపడి మనతోపాటు చదివి పరీక్ష రాసింది. తమ్ముళ్లకు ట్యూషన్ల బాధ లేకుండా దగ్గర కూర్చోబెట్టుకొని చదివిస్తుంది. అమ్మకి ఇంట్లో సాయం చేస్తూనే మా ఇంటికి దగ్గరగా ఉన్న లైబ్రరీకి వెళ్లి మంచి మంచి పుస్తకాలు తెచ్చి చదువుతుంది. అక్కని చూసే నేనిలా నిబ్బరంగా ఉండడం నేర్చుకున్నాను" అంది మాలతి నవ్వేస్తూ.

అప్పుడే అటుగా వచ్చిన కమల "ఏమిటే మాలా! నీ స్నేహితురాలికి గీతోపదేశం చేస్తున్నావు? " అంది.

"గీతోపదేశమా, నా మొహమా. పొద్దు గూకులూ ఇది అలగడం నేను బతిమాలుకోవడంతోనే సరిపోతుంది" అంది మాలతి.

"అదలాగే అంటుంది గానీ అక్కా, ఇంతకీ మాలతి చదువు విషయం ఏం తేల్చారు? " అంది స్వాతి.

"అతి కష్టం మీద చదివించడానికే ఒప్పించానమ్మా!" అంది కమల నవ్వుతూ.

"ఏమో అక్కా... నాకు కాలేజీలో చేరి చదవాలని లేదింక" అంది మాలతి.

"అదేమిటే, ఇంత కష్టపడి నేను ఒప్పిస్తేనూ. ఇప్పటిదాకా చదువుకుంటానని ఏడ్చి రాగాలు పెట్టావు కదే!ఇంతలోనే ఏమైంది? ' ' అంది కమల ఆశ్చర్యంగా చూస్తూ.

"అవునే. చదివిస్తానంటూంటే హాయిగా చదువుకోక"అంది స్వాతి కూడా ఆశ్చర్యపోతూ.

"అదంతే. నీకు లేని కాలేజీ చదువు నాకెందుకు? " అంది మాలతి ప్రేమగా స్వాతి వంకే చూస్తూ. స్వాతి స్నేహం కంటే తనకి చదువు ఎక్కువ కాదన్నట్లుగా ఎంతో తేలికగా చదవనని చెప్పేసింది. అంతవరకూ కాలేజీలో చేరి చదువుతానని తల్లిదండ్రుల దగ్గర హఠం చేసిన మాలతి స్వాతి చదవననగానే తానూ మానేస్తానంది.

"ఏమిటే మాలతి, నా కోసం నువ్వు చదువు ఆపేస్తావా? ఎందుకే నేనంటే నీకింత ప్రేమా? " అంది స్వాతి చెమరించిన కళ్లతో స్నేహితురాలి వంక ఆప్యాయంగా చూస్తూ.

"కాదా మరి? నువ్వే అంటుంటావు కదా. జీవితంలో కష్టమైనా సుఖమైనా మనిద్దరికీ ఫిఫ్టీ ఫిఫ్టీ అని. కనుక నీకు లేని ఏ ఆనందమూ నాకు వద్దు" అంది మాలతి స్నేహితురాలి చేయి పట్టుకొని ఉద్వేగంగా.

"ఎంత మంచిదానివే నువ్వు!" అంది స్వాతి ఆర్ద్రత నిండిన గొంతుతో.

స్వాతి ఇంటికి వచ్చినా మాలతి మాటలే

మనసులో మెదలసాగాయి. నేనంటే మాల తికి ఎంత ఇష్టం? నాకోసం చదువు కూడా మానేస్తానంటోంది. ఈ సూర్య మావయ్య లేకపోతే వాళ్లింట్లో ఒప్పుకున్నందుకు హాయిగా ఎంచక్కా కాలేజీలో చేరి చదువు కునేవాళ్లం అనుకుంది.

స్వాతికి బాగా చదువుకోవాలన్న ఆశ ఒక్కటే కాదు, తన చిన్నారి తమ్ముడు రవిని విడిచి వెళ్లాలనే బెంగ ఒక వైపయితే ప్రాణా నికి ప్రాణం లాంటి మాలతికి దూరంగా ఉండడమనే విషయాన్నసలు భరించలేకపో తోంది. మాలతి ఎంత తేలిగ్గా చెప్పేసింది. నేను చదవకపోతే తాను కూడా చదవనని. పరిస్థితుల కనుగుణంగా నడుస్తున్నట్లు కని పించే మాలతి అవసరమైతే దేన్నయినా ఎదిరిస్తుందన్నమాట. నా కోసం, నా స్నేహం కోసం చదువు కూడా మానేస్తా నంది. అంటే దానికి నాపైన ఎంత ప్రేమ. ఇంత మంచిదాన్ని స్నేహితురాలిగా పొందడం నిజంగా నా అదృష్టమే. వెంటనే స్వాతికి తమ ఇంగ్లీషు టీచర్ స్నేహం గురించి అన్న మాటలు గుర్తు వచ్చాయి.

"ఫ్రెండ్‌షిప్ ఈజ్ రైన్‌బో బిట్వీన్ టూ హార్ట్స్. ఆ మాటలు ఎంత నిజం? నిజంగా మా స్నేహం ఇంద్రధనస్సు లాంటిదే కదా!" అనుకుంది స్వాతి.




జానకమ్మ భర్తను ఒప్పించి సూర్యని రప్పించింది. సూర్య ఎం.ఏ. ప్రీవియస్ పరీ క్షలు రాశాడు ఆ సంవత్సరమే! అక్కగారి ఆంతర్యం అర్థమైనా ఏమీ ఎరగనివాడిలా తిరుగుతున్నాడు సూర్య.

గతంలో సూర్య ఎప్పుడు వచ్చినా వెంట వెంటే తిరుగుతూ కబుర్లు చెప్తుండే స్వాతి ఈసారి సూర్య వచ్చిన దగ్గర నుండీ తప్పిం చుకు తిరుగుతోంది.

అంతకుముందు స్వాతిపై ఎలాంటి అభి ప్రాయం లేని సూర్యకి యవ్వనం తెచ్చిన కొత్త శోభలతో అప్పుడప్పుడే రేకులు విచ్చు కుంటున్న గులాబీలాంటి స్వాతి సౌందర్యం కట్టిపడేసింది. యవ్వన ప్రాంగణంలో అడుగి డినా పసితనం ఛాయలు వీడని స్వాతి లేడిపి ల్లలా గంతులేస్తూ తన తమ్ముడు రవితో పాటు ఆడుకుంటున్న స్వాతి రూపం మరింత ఆకట్టుకుంది సూర్యని.

తన భయాల్లో తానుండడం వలన సూర్య తనని గమనిస్తున్నాడనే ఆలోచన గాని, అత డిని చూడాలనే కుతూహలం కాని స్వాతిలో కలగలేదు. అసలలాంటి యవ్వన సహజమైన కోరికలామెలో లేనే లేవు. తన చదువుకు ఆటంకంగా మారిన సూర్య స్వాతి కంటికో విలన్‌లా కనిపించడంతో సూర్యని తప్పుకు తిరుగుతోంది. ఆమె అలా తటిల్లతలా మెరిసి మాయమవ్వడం చూసి సిగ్గేమో అనుకు న్నాడు సూర్య.

వాళ్లిద్దర్నీ ఏకం చేయాలని తపనపడే జాన కమ్మ పనిగట్టుకొని కూతుర్ని పిలిచి "స్వాతీ! మావయ్యకీ కాఫీ ఇచ్చిరా!" అంది.

స్వాతి విసుక్కుంటూనే కాఫీ తీసుకు వెళ్లి "కాఫీ తీసుకో!" అంటూ టక్కున గ్లాసు చప్పు డయేలా టేబుల్ మీద పెట్టి వెనుదిరిగింది.

కాఫీ గ్లాసు తీసుకుంటూ "స్వాతీ, ఇటురా మాట!" అని పిల్చాడు వెనక్కి.

ఇక తప్పదన్నట్లుగా "ఏమిటీ? త్వరగా చెప్పు, పనుంది!" అంది స్వాతి ముళ్లమీద నించున్నట్లుగా సూర్యని చూస్తూ.

"అలా ఎంతసేపు నించుంటావు. కూర్చో" అన్నాడు ఎదుటనున్న కుర్చీని చూపిస్తూ.

"లేదు. నే వెళ్లాలి... పనుంది!" అంది స్వాతి అయిష్టంగా చూస్తూ.

"వెళ్లుదువులే. కూర్చో ముందు, ఏం నాతో మాట్లాడడం మానేశావు? " అనడిగాడు సూర్య అభిమానంగా చూస్తూ.

ఆ మాటకు స్వాతి ఆలోచనలో పడింది. నిజమే మామయ్య రెండేళ్ల క్రితం వచ్చినపుడు వెంటవెంటే ఉండి ఎంత అల్లరి చేసింది తను? బజారంతా తిప్పి రవికీ తనకీ ఎన్ని బొమ్మలు కొనిపించుకుంది? అమ్మ సూర్య మావయ్యతో పెళ్లి అని, చదువు మానిపించే స్తామని ఉండకపోతే ఇలా ఉండేదా తను? అనుకుంది.

అది సిగ్గుగా భావించిన సూర్య "ఇప్పుడే ఇంత సిగ్గయితే ఎలా? " అంటూ బుగ్గమీద చిటికేశాడు. దాంతో స్వాతి ముఖం ఎర్రబ డగా చటుక్కున అక్కడి నుండి వెళ్లిపో యింది. నవ్వుకున్నాడు సూర్య.

అక్కడి నుండి వెళ్తూ స్వాతి "అమ్మ కిష్టమే. నాన్నగారు ఒప్పేసుకున్నారు. సూర్యా మావయ్యకు కూడా ఇష్టం లాగే ఉంది. ఐతే ఇక ఈ పెళ్లి తప్పదన్నమాట" అనుకుంది బాధగా.

* * *

ఆ మరునాడు రవ్వదోశెలు వేస్తోంది జాన కమ్మ. వేడివేడిగా దోసెలు వేస్తుంటే కావల సినన్ని తినడం స్వాతి కెంతో ఇష్టం. ఆ సంగతి తెలిసిన సూర్య స్వాతిని ఏడిపిద్దామని తానూ వంటింట్లో చేరాడు. సూర్య రావ డంతో ఒక దోశ తిని రెండవ దాని కోసం ఎదురు చూస్తున్న స్వాతికి దోశె వెయ్యకుండా సూర్యకి వేరే ప్లేట్‌లో వేసిచ్చింది జానకమ్మ. దాంతో ఒళ్లు మండిపోయిన స్వాతి కోపంగా సూర్య వంక చూస్తూ చెయ్యి కడిగేసుకొని వెళ్లిపోయిందక్కడ నుండి. అల్లుడి మర్యాదలు చేయడంలో మునిగిపోయిన జానకమ్మ కూతురి విషయాన్నంతగా పట్టించుకోలేదు.

ఆ సాయంత్రం బీచ్‌కు వెళ్దాం రమ్మన్నాడు సూర్య. ఉదయం కోపం ఇంకా తగ్గని స్వాతి నేను రానంటూ మొండికేసింది. కూతురి మొండితనం చూసి చిరాకేసిన జానకమ్మ గట్టిగా గద్దించడంతో "నేనసలు వెళ్లనంటే వెళ్లను" అంటూ ఏడుస్తూ లోపలికి వెళ్లిపో యింది. తానేదో సుడిగుండంలో చిక్కుకు న్నట్లు, తన్నెవరూ రక్షించేవారు లేరు అన్న భావన కలగ్గా గదిలో మంచం మీద పడి వెక్కివెక్కి ఏడ్చింది.

సూర్య స్వాతి వెంటే గదిలో కొచ్చాడు. ఏడుస్తున్న స్వాతిని ఆశ్చర్యంగా చూస్తూ "స్వాతీ, ఎందుకేడుస్తున్నావు? " అనడిగాడు ఆప్యాయంగా.

"ఏం లేదు మావయ్యా!" అంది అక్కడి నుండి లేవబోతూ.

"ఏం లేకుండా ఎవరైనా ఏడుస్తారా? నాకు చెప్పవా? " అంటూ లాలనగా అడగడంతో,

"ఏడవక ఏం చేయను? నేను చదువుకుం టానని ఎంత చెప్తున్నా వినకుండా అమ్మా వాళ్లు పెళ్లి చేస్తానంటున్నారు. మీరంతా ఒప్పేసుకున్నారు" అంది వెక్కుతూనే.

"ఓస్, ఇంతేనా? నేనింకా ఏమిటో అనుకు న్నాను. పెళ్లయ్యాక నేను చదివిస్తానులే, నువ్వెంత వరకూ చదివితే అంత వరకూను" అన్నాడు అభయం ఇస్తున్నట్లుగా.

"ఏం కాదు. నేనిప్పుడే పెళ్లి చేసుకోను. నాకు మా తమ్ముడు రవి కావాలి. నా ఫ్రెండు మాలతి కావాలి. వీళ్లక్కడికి రారు కదా" అంది అమాయకంగా.

"నాకీ బొమ్మ కావాలీ" అంటూ పసిపిల్ల మారాం చేసినట్లుగా స్వాతి అడిగిన తీరు చూస్తే జాలేసింది సూర్యకి. ఈ పసిదానికి అప్పుడే పెళ్లేమిటి? అనుకున్నాడు. కానీ తనంటే ఇష్టమా కాదా? అనే మాటను అడ గకుండా ఉండలేకపోయాడు.

"పోనీ పెళ్లి ఇప్పుడప్పుడే చేసుకోవద్దులే. మరి నేనంటే ఇష్టమేనా నీకు? " అనడిగాడు సూర్య మృదువుగా స్వాతి చెంపలను రుమా లుతో అద్దుతూ.

పెళ్లి చేసుకోనక్కరలేదని చెప్పడంతో ఆనం దపడిపోయిన స్వాతి ఆ క్షణంలో సూర్య తన ప్రాణమడిగినా ఇవ్వడానికి సిద్ధమైపోయింది.

అందుకే "ఓ నువ్వంటే చాలా ఇష్టం మావయ్యా... మావయ్యా నువ్వెంత మంచివాడివి?" అంటూ సూర్య మెడ చుట్టూ చేతులు వేసి చటుక్కున బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

తండ్రి తన కిష్టమైన పని ఏదైనా చేసినపుడు తన సంతోషాన్ని తండ్రికి ఇలాగే తెలియజేస్తుంది స్వాతి. అనుకోకుండా స్వాతి అలా చేయడంతో ఆశ్చర్యపోయాడు సూర్యం. కానీ ఆ చర్యలో వయసులో ఉండే పిల్లల కుండవలసిన ఉద్రేకం కనిపించలేదు సూర్యకి. పసిపాప తల్లిని కౌగలించుకొని మురిసిపోతున్నట్లుగా ఉంది.

పెళ్లి మాట తలపెట్టిన దగ్గర నుండి స్వాతి తనకేదో ఆప్తురాలయినట్లు స్వాతి మంచి చెడ్డలు చూడవలసిన బాధ్యత, సంతోషపెట్టవలసిన బాధ్యత తనదైనట్లుగా భావించిన సూర్య లతలా తనని అల్లుకుపోయిన స్వాతిని వాత్స ల్యంగా మరింత దగ్గరకు హత్తుకున్నాడు.

లోపలికి వెళ్లిన కూతురూ తమ్ముడూ ఎంతకీ రాకపోవడంతో జానకమ్మ వచ్చింది విషయం ఏమిటో తెలుసుకోవాలన్నట్లుగా. ఆవిడకి కూతురు ఓ కొరకరాని కొయ్యలా కనిపిస్తోంది. అందుకే ఆరాటంగా వచ్చింది. అయితే వాళ్ల మాటలు వినలేదు గానీ వాళ్లిద్దరూ ఒక లిప్త కాలమే అయినా అలా ఒకర్ని ఒకరు హత్తుకొని ఉండడం చూసింది. తనని చూసైనా వాళ్లు తప్పు చేసినట్లు జంకకుండా అలా ఉండడం చూసి మరీ ఆశ్చర్యపోయింది.

తరువాత స్వాతిని చాటుకు పిల్చి "పెళ్లి వద్దని ఎగిరావు కదే. కాని ఎంత మామయ్య అయితే మాత్రం అంత తొందరెందుకు?" అంది చీవాట్లు పెడుతున్నట్లుగా.

"ఏమిటమ్మా నువ్వంటున్నది? దేనికి తొందర?" అనడిగింది స్వాతి, తల్లి వంక ఆశ్చర్యంగా చూస్తూ.

"ఏం నంగనాచితనం నేర్చావే. నిన్నేమో వాడి ముఖం చూస్తేనే చిటపటలాడావు. ఇవ్వాళ పెళ్లి కాకుండానే... హవ్వ" అంది జానకమ్మ బుగ్గలు నొక్కుకుంటూ.

తాను మావయ్యతో మాట్లాడడం చూసి



## మీరే మొదలెట్టండి

సహాయ నిరాకరణ ఉద్యమం ఉధృతంగా జరుగుతున్న రోజులు. గాంధీజీ పిలుపునకు స్పందించి లక్షలాదిమంది భారతీయులు ప్రభుత్వ ఉద్యోగాలకు వీడ్కోలు పలికారు. ఆ సందర్భంగా ఓ పాత్రికేయుడు బాపూజీని కలిసి 'అందరినీ బ్రిటిష్ ప్రభుత్వఉద్యోగాలను వదలమంటున్నారు. కాంగ్రెస్ అధికారం చేపట్టబోతోందా?' అని వ్యంగ్యంగా అడిగాడు.

'మీకేమైనా మంత్రిపదవి కావాలా?' రకీమని జవాబిచ్చారు బాపూజీ.

ఆ తర్వాత అదే పాత్రికేయుడితో 'మీ టోపీని భిక్షా పాత్రగా వాడుకుంటాను.. అభ్యంతరమా?' అని అడిగారు.

గాంధీ అంతటివాడు అడిగితే ఎవరు కాదంటారు? అతను మౌనంగా టోపీ తీసి ఇచ్చాడు.

వెంటనే బాపూ దాన్ని పాత్రలా పట్టుకుని 'చారిటీ బిగిన్స్ ఫ్రమ్ హోమ్ అంటారు గదా? పార్టీకి మీరే ఎంతోకొంత విరాళం వేయండి' అని అడిగారు. గాంధీజీ తీరుకు అతను విస్తుపోయినా ఆయన చందా అడిగిన పద్ధతికి మనస్ఫూర్తిగా నవ్వేశాడు.

అలా అనుకుంటోంది తల్లి అనుకున్న స్వాతి "ఇప్పుడు మాత్రం పెళ్లెవరు చేసుకుంటామ న్నారూ? " అంది స్వాతి చిరాగ్గా చూస్తూ.

"ఆ, ఇదేం చోద్యమే? " అని నోరు వెళ్లబెట్టే సింది జానకమ్మ.

ఆ రాత్రి సూర్య అక్కతోనూ, బావగారి తోనూ చెప్పాడు "బావగారూ! స్వాతిని చేసు కొనేందుకు నాకెలాంటి అభ్యంతరం లేదు. తనింకా చిన్నపిల్లే కదా. చదువుకుంటానని సరదా పడుతోంది, చదువుకోనివ్వండి. ఈ కాలం లో డిగ్రీ అయి నా లేకపోతే అది చదువు కింద లెక్కే కాదు. అదీగాక నాకింక చదువు పూర్తి కావాలి, ఉద్యోగం రావాలి వీలైతే రీసెర్చ్ చేసి పి. హెచ్. డి తీసు కుందామనుకుంటు న్నాను. వీటన్నిటికీ చాలా టైమ్ పడు తుంది. కనుక స్వాతినేమీ ఇబ్బంది పెట్ట కుండా చదువుకో నీయండి హాయి గా. ఇక అమ్మా నాన్నల విషయ మంటారా? వాళ్లకి నేనెలాగో నచ్చజెప్పు తాను. వాళ్లకొకటే తొందరగా ఉంది. నాకు పెళ్లిచేసి మనవళ్ల నెత్తుకోవాలని" అన్నాడు సూర్య నవ్వేస్తూ.

భార్య మాట కాదనలేక ఒప్పుకున్నాడే గాని స్వాతి కిప్పుడప్పుడే పెళ్లి చేయడం అస్సలిష్టం లేదు. దానికి అనుగుణంగానే బావమరిది మాటలుండ డంతో "అలాగే సూర్య నువ్వన్నట్టే చేద్దాం!" అన్నాడు ఉత్సాహంగా

"కాదేమిట్రా మరీ నీ తరువాత ఇంకెవరూ లేరాయె వాళ్ల అచ్చటా ముచ్చటా ఎలా తీరేను? " అంది జానకమ్మ.

"నువ్వు కూడా ఏమిటక్కా పాతకాలపు దానిలా. చదువయి నా కాళ్ల మీద నేను నిల బడేవరకైనా ఆగాలి కదా" అన్నాడు సూర్య.

సూర్య మాటలు వినడంతో మొదట సంతోషపడింది రంగారావే. భార్య మాట కాదనలేక ఒప్పుకున్నాడే గాని స్వాతి కిప్పుడ ప్పుడే పెళ్లి చేయడం అస్సలిష్టం లేదు. దానికి అనుగుణంగానే బావమరిది మాటలుండ డంతో "అలాగే సూర్యా! నువ్వన్నట్టే చేద్దాం!" అన్నాడు ఉత్సాహంగా.

స్వాతి, సూర్య పెళ్లి కొప్పుకున్నారు కనుక పెళ్లెప్పుడైనా జానకమ్మకు చింతలేదు. సూర్య చేజారిపోకూడదనే ఆమె తాపత్రయం.

సూర్య అక్కడ ఉండగానే టెన్త్ పరీక్షా ఫలి తాలు తెలిశాయి. ఇద్దరికీ ఫస్ట్ క్లాసులు రావ డమే కాదు ఎప్పటిలాగే మాలతి ఆ స్కూలు ఫస్ట్‌గాను, స్వాతి సెకండ్‌గానూ వచ్చారు. ఈ వార్త తెలియడంతోనే రెండిళ్లలోనూ ఆనందం పరవళ్లు తొక్కింది. స్వాతికి సూర్య మంచి ఫౌంటెన్ పెన్ను కానుకగా ఇచ్చాడు. రంగా రావు స్వాతికి మంచి రిస్ట్‌వాచీ కొనిచ్చాడు. జానకమ్మ స్వాతికీ, మాలతికీ ఒకేలాంటి బట్టలు తీసి ఇచ్చింది. అవి చూసిన స్వాతి ఆశ్చర్యపోతూ "మా అమ్మ ఎంత మంచి దో? " అంటూ తల్లి బుగ్గమీద ముద్దు పెట్టు కుంది, రెండు చేతులతో చుట్టేస్తూ.

మాలతి తండ్రి విశ్వనాథం డబ్బులిచ్చి స్వాతినీ, మాలతిని సినిమాకి వెళ్లి రమ్మ న్నాడు. అంతకు మించిన ఆర్థిక స్తోమత లేదాయనకు. పిల్లలందరూ కలసి ఆ పూట సరదాగా సినిమాకెళ్లి వచ్చారు.

* * *

ఆ రోజు స్వాతి పుట్టిన రోజు. ఆకాశ నీలంరంగు పట్టులంగా మీద తెల్లని ఓణీ వేసుకొని, క్రితం పుట్టిన రోజుకు చేయించిన పగడాల నెక్లెస్ మెడలో వేసుకొని వచ్చి తల్లి దండ్రులకు నమస్కరించింది స్వాతి. ఆ అలంకరణలో స్వాతి ఎంతో అందంగా కని పించడంతో స్వాతిని అపురూపంగా దగ్గరకు

తీసుకొని ముద్దులాడారు. "ఇలాగే కళకళ లాడుతూ పది కాలాలపాటు చల్లగా ఉండ" మని మనసారా ఆశీర్వాదించారు.

స్వాతి తన గదిలో కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తుండగా ఆ గదిలోకి వచ్చిన సూర్య చప్పుడు చేయకుండా వెళ్లి వెనక నుంచి ఆమె కళ్లు మూశాడు. స్వాతి ఉలిక్కిపడింది.

కళ్లు మూసింది ఎవరో గుర్తించి "ఏమిటి మావయ్యా ఇదీ? " అంటూ విసురుగా చేతులు లాగేసింది. దాంతో చిన్నబోయింది సూర్య ముఖం. బాధపడినట్లుగా దూరంగా వెళ్లి నించున్నాడు మౌనంగా.

సూర్య ముఖం చూసిన స్వాతి నొచ్చుకుంటున్నట్లుగా దగ్గరకెళ్లి "సారీ మావయ్యా హఠాత్తుగా కళ్లు మూసేసరికి చికాకనిపించి అలా అరిచేశాను. కోపం వచ్చిందా నా మీద? " అంది క్షమాపణ కోరుతున్నట్లుగా.

ఆ మాటలతో మామూలుగా అయిపోయిన సూర్య "లేదులే స్వాతీ! నేను రేపు వెళ్దామనుకుంటున్నాను" అన్నాడు.

"ఏం, అప్పుడే వెళ్తానంటున్నావు? ఇంకా సెలవులున్నాయికదా నీకు? " అంది స్వాతి ఆశ్చర్యంగా చూస్తూ.

ఇక్కడ ఉండి నిన్ను చూస్తూ నన్ను నేను అదుపు చేసుకోలేకపోతున్నాను స్వాతి అని చెప్పలేకపోయాడు సూర్య.

"కాదు, నా మీద కోపమొచ్చే నువ్వు వెళ్తానంటున్నావు, సారీ అన్నాను కదా!" అంది స్వాతి సూర్య చేయి పట్టుకుంటూ.

"నీ మీద కోపమా? నీ మీద ప్రేమ తప్ప కోపమెప్పుడైనా వచ్చిందా నాకు? " అన్నాడు సూర్య అనురాగంగా స్వాతి వంక చూస్తూ.

"ఎందుకు మావయ్యా నేనంటే అంత ఇష్టం నీకు? " అనడిగింది స్వాతి అమాయకంగా చూస్తూ.

"ఇష్టానికి కారణం ఏమని చెప్పను? ఎలా చెప్తే నీకర్థమవుతుంది? వెన్నెల ఎందుకు కాస్తుందో, సెలయేరు గలగలా ఎందుకు పారుతుందో చెప్పగలమా? ఇదీ అంతే!" అన్నాడు సూర్య భావోద్వేగంతో.

"ఏమిటో నీదంతా కవితా ధోరణి నాకేం అర్థం కాదు" అంది స్వాతి.

"అదే కదా నా బాధంతా. ఈ అందాల స్వాతికి పదహారేళ్లయితే వచ్చాయిగాని మనసు మాత్రం ఆరేళ్ల పసిపాపలా ఉంది!" అంటూ దగ్గరకు తీసుకొని హృదయానికి హత్తుకున్నాడు. ఆ కౌగిలిలో హాయేమీ కనిపించకపోయినా ఇందాకటిలా కసిరి కొట్టలేక మౌనంగా ఉండిపోయింది సూర్య బాధపడతాడని.

ఆ మరునాడు సూర్య వెళ్లిపోయాడు.




స్వాతీ, మాలతి కాలేజీలో జాయిన్ అయ్యారు. ఒకరోజు తీరిగ్గా స్నేహితురాళ్లిద్దరూ కూర్చొని కబుర్లాడుకుంటున్న సమయాన మాటల మధ్యలో తన పుట్టిన రోజునాడు సూర్య తనతో అన్న మాటలు మాలతితో చెప్పింది.

"నీకు బొత్తిగా సిగ్గు లేదే. ఇలాంటివన్నీ ఇతరులతో చెప్తారా ఎవరైనా? " అంది మాలతి పెద్ద ఆరిందాలా.

"ఏం చెప్తే తప్పా అయినా అందులో అంత సిగ్గు పడవలసినంత విషయం ఏముందే నాకు తెలియక అడుగుతాను" అంది స్వాతి ఆశ్చరపోతూ. తన పుట్టిన రోజునాటి సంఘటన మనసులో మెదిలి ఆ కన్నె మనసులో ఏదో తెలియని అలజడి రేగి మొదటిసారిగా సిగ్గు పడింది స్వాతి.

అప్పుడప్పుడు సూర్య ఉత్తరాలు రాసేవాడు స్వాతికి. దాని నిండా ప్రేమ కబుర్లే ఉండేవి.

స్వాతి పెళ్లి వద్దన్నప్పుడు చిన్న పిల్ల అంటూ సమర్థించిన సూర్య ఆ విషయాన్నెపుడో మరచిపోయాడు. అనుక్షణం అతనికి స్వాతి ధ్యాసే అయిపోయిందీమధ్య. పెళ్లి మాట తల పెట్టిన దగ్గర నుండీ స్వాతి తన స్వంతమనే భావన సూర్యని నిలువనీ యడం లేదు. దాని ఫలితమే ఈ ప్రేమ సందేశాలు!

ఆ ఉత్తరాలన్నీ తీసుకువెళ్లి మాలతికి చూపించేది స్వాతి.

"ఎందుకే బాబూ నాకు చూపిస్తావివన్నీ" అనేది మాలతి.

"ఎందుకేమిటి జవాబు రాయాలి కదామరి. అందుకే నీకు చూపిస్తున్నాను" అంది స్వాతి అదేదో మామూలు విష యంలా.

"బాగుందే స్వాతీ ఇది. అతను ఉత్తరాలు రాసేది నీకు, చేసుకునేదీ నిన్నే, మధ్యలో నన్నెందుకే బాబూ తింటావు? " అంది మాలతి.

"అదంతా నాకు తెలియదు మహరాజా అని మనవి చేస్తే మరి రెండు తన్నుమన్నట్లుగా వెధవ్వాగుడు వాగ కుండా ఉత్తరం రాద్దాం రా!" అంటూ మాలతి చెయ్యి పట్టు కులాగింది స్వాతి.

ఇద్దరూ కలిసి పెరట్లో బాదం చెట్టు కింద కూర్చొని నానా తంటాలూ పడి సూర్యకి ఉత్తరం రాశారు.

రోజులు నిమిషాల్లా గడిచిపోతున్నాయి. స్వాతీ మాలతీ ఇంటరు పాసై డిగ్రీలో చేరారు. మాలతికి ఎకనామిక్స్ అంటే ఇష్టం. మాలతితో పాటే స్వాతి కూడా బి.ఏలో చేరి పోయింది.

ఇప్పుడు గతంలోలా సరదాక్కూడా స్నేహితురాళ్లిద్దరూ పోట్లాడుకోవడం లేదు.

గతంలో మాదిరిగా మాలతిని సహాయం అడగకుండా సూర్యకి తానే స్వయంగా ప్రేమలేఖలు రాస్తోంది స్వాతి. తల్లి దండ్రులు తొందర పెడుతున్నా చదువుకుంటాను మావయ్యా! అని అడిగిన వెంటనే ఒప్పుకున్న సూర్య అంటే ప్రేమకంటే గౌరవమే ఎక్కువ స్వాతికి.

"మన మధ్య ఇలాంటి గౌరవ మర్యాదల ప్రశ్న ఉండకూ డదు" అని సూర్య అంటే,

"అదేమో నాకు తెలియదు మావయ్యా. అప్పట్లో అమ్మ ధోరణి చూస్తే చాలా బెంగగా ఉండేది నాకు. నన్ను బాగా చదివించి డాక్టర్నో, లాయర్నో చేయాలని నాన్నగారికుండేది. కాని అమ్మ మాట కాదనలేక పెళ్లికి ఒప్పుకున్నాను. ఆ రోజు నువ్వేకాని నాకు అండగా లేకపోతే ఇప్పుడిలా చదువుకునే దాన్నా? " అని అంటున్న స్వాతిని చూస్తే నవ్వు వచ్చేది సూర్యకి.

ఎప్పుడు చూసినా చదువూ, స్నేహితుల గోల తప్ప మరో మాట





రాని స్వాతిని చూస్తే ఓ పక్క ముచ్చేటేస్తున్నా మరోపక్క ఈ స్వాతి నా మనసు తెలుసుకునేది ఎప్పుడు? అని మధనపడే వాడు సూర్య.

* * *

ఆ రోజు మాలతి, స్వాతి కాలేజీకి వెళ్తూంటే ఓ సంఘటన జరిగింది. అదే కాలేజీలో చదువుతున్న రాజు మాలతిని రాసు కుంటూ వెళ్తూ "ఓ చెలియా నా ప్రియ సఖియా చేజారెను నా మనసే ఏ చోటా అది దాగినదో ఆ జాడే తెలియదులే నీ అందెలలో చిక్కుకుంది" అనీ అంటూ పాడుకుంటూ వెళ్తున్న అతన్ని నిప్పులు రాల్చే కళ్లతో చూస్తూ.

"మిస్టర్ రాజూ ఓ సారిటు వస్తారా? " అని పిల్చింది మాలతి.

"ఎస్ ప్లీజ్!" అంటూ స్టైల్‌గా వెనక్కి వచ్చాడు రాజు. ఏం జరుగుతుందోనని భయంతో బిగుసుకు పోయి చూడసాగింది స్వాతి.

"ఏం లేదూ... మీకు అక్కలూ చెల్లెళ్లూ ఎవరూ లేరా? " అనడిగింది మాలతి తెచ్చి పెట్టుకున్న సౌమ్యంతో.

"లేకేమండీ? అందరూ ఉన్నారు కానీ ప్రియురాలే లేదు!" అన్నాడు తానూ ఏమీ తీసిపోనట్లుగా విలా సంగా.

"ఓహో అలాగా? ఈ మధ్య మీ మానసిక పరిస్థితి బాగున్నట్లు లేదు. అందుకని మా నాన్నగారిని మీ ఇంటికి పంపిద్దామనీ" అంది మాలతి వెటకారంగా.

"ఎందుకండీ ఆయనేమైనా డాక్టరా? " అన్నాడు మరింత వేళాకోళంగా.

"కాదులెండి, మన పెళ్లి గుర్చి మాట్లాడేందుకు. అదేగా మీ వ్యాధికి తగిన మందు. ఇక పైన మీ మనసు ఎటు జారిపోయిందోనని ఇలా వెతుక్కోనక్కర లేదు, అందరి దగ్గరా" అంది మాలతి పదునుగా చూస్తూ.

ఆ మాటలు వినడంతోనే జావ కారిపోయిన రాజు "ఆ, అబ్బే ఎందుకు? " అన్నాడు తడబడుతూ ఇందాకటి ఫోజు మచ్చుకైనా లేకుండా.

"మిస్టర్ రాజూ కాస్త ఒళ్లు దగ్గర పెట్టుకొని మసలుకోండి. అందరూ ఉన్నారు. ప్రియురాలే లేదని చాలా పాత జోకే వేశారు, తీరా పెళ్లి మాటలకొస్తే నీళ్లు నములుతున్నారు. ఇదే నీ చెల్లెలు నిర్మలను అంటే ఎలా ఉంటుందో ఒకసారి ఊహించండి. ఏం అలా చూస్తారు? అందరూ నీ చెల్లెలి లాంటివారు కారా? ఇక ముందు ఇలాంటి పిచ్చి వేషాలు వేస్తే నోటితో చెప్పను. చేత్తో

చెప్తాను. రావే స్వాతీ!" అంటూ విసురుగా వెళ్లిపోయింది మాలతి అక్కడి నుండి.

వాళ్లు వెళ్లిన కాసేపటివరకూ తేరుకోలేకపోయాడు. "ఇదే నీ చెల్లెలు అయితే" అన్న మాటలు గుర్తొచ్చి నా చెల్లెలయితే ఎముకలు ఏరెయ్యనూ? అనుకున్నాడు. తాను చేసిన పనికి ఒకే క్షణం సిగ్గుపడ్డాడు. కానీ సినిమాల్లోలా అతనిలో పరివర్తనేమీ రాలేదు. మళ్లీ కథ మామూలే! అదో థ్రిల్. ఎదుటి వాడి గాయం, నొప్పి కలిగించే ఆనందం పైశాచికానందం అది.

"అదేమిటే మాలతి అంత దురుసుగా మాట్లాడావు? రేపు వాడు నీ మీద కక్ష గట్టి ఏదైనా చేస్తే" అంది స్వాతి భయంగా చూస్తూ.

"ఆ, ఏం చేస్తాడు? తల దీసి మొలేస్తాడా? ఇలాంటి వాళ్లందరిదీ మేకపోతు గాంభీర్యమే. చూశావా, పెళ్లనగానే ఎలా తోక ముడిచాడో? అంతకు ముందిలా రెండు మూడుసార్లు నా వెంటపడ్డాడు. పోన్లే మన కంటే సీనియర్స్ కదా వాళ్లతో ఎందుకని ఊరుకున్నాను. అనుకోకుండా నిన్ననే తెలిసింది నాకు. తను మన క్లాస్‌మేట్ నిర్మల అన్నయ్య అని. అందుకే కాస్త సెంటిమెంట్ జోడించి ఒక డోసిచ్చాను. ఛస్తే మన జోలికి రాడు చూడు!" అంది మాలతి.

"ఏమో బాబూ, ఇలాంటి వాళ్లతో తగువు పెట్టుకుంటే చాలా ప్రమాదమే మాలతి చూడు, ఆ మధ్య జ్యోతి ఎలా అయిపోయిందో మర్చిపోయావా? " అంది స్వాతి బేలగా చూస్తూ.

"అది పిరికిది కాబట్టి ఆత్మహత్య చేసుకుంది. అదే నేనైతేనా తగిన గుణపాఠం నేర్పే దాన్ని చూడూ, అది చచ్చినంత మాత్రాన వాళ్లేమైనా మారారా? అది తమ విజయానికి గుర్తుగా భావించి మరింత విజృంభిస్తున్నారు. దాని గతే మనకీ పడుతుందని బెదిరిస్తున్నారు. కానీ ఒక్కటి గుర్తు పెట్టుకోవే స్వాతీ! మనం బెదిరినంత సేపేనే ఎవరైనా బెదిరించేది. ఎదురు తిరిగితే ఇదుగో ఇలా తోక ముడుస్తారు" అంది మాలతి ఆవేశంగా.

"ఏమో బాబూ, నువ్వు ధైర్యస్తురాలివి, నీలా నేనుండలేను" అంది స్వాతి బెదురుగా చూస్తూ.

## 'మందు' మమ్మీలూ... జాగ్రత్త!

"తల్లులు చేసే తప్పులకి, పిల్లలు శిక్ష అనుభవించాలంటున్నారు శాస్త్రజ్ఞులు. తస్మాత్ జాగ్రత. ఈ విషయాన్ని ఏకంగా 'జర్నల్ ఆఫ్ పీడియాట్రిక్స్'లో ప్రచురించారు కూడా.

అసలు విషయమేమిటంటే... గర్భవతులైన స్త్రీలు మద్యం సేవిస్తే... పుట్టబోయే పిల్లలకి దృష్టిమాంద్యత, అంధత్వం ఏర్పడుతుందట. బిడ్డ పుట్టిన ఆరు నెలల నుండి చూపు సరిగా కన్పించదట. దీనిని "ఫీటల్ ఆల్కహాల్ సింద్రోం" అంటారు. దీనివల్ల పిల్లలు సరిగా పెరగకపోవడం, మెదడు అభివృద్ధి ఆగిపోవడం, వికృత ముఖకవళికలు ఏర్పడటం వంటివి కల్గుతాయయట.



- చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం కంటే ముందు "మందు" జాగ్రత్త మంచిదంటున్నారు. 30 ఏళ్ళ పైబడ్డ గర్భవతులు మద్యం సేవిస్తే పుట్టబోయే బిడ్డలకి అంధత్వం తథ్యం అంటున్నారు.

"ఐతే ఓ పాలబుడ్డీ, పాలపీకా కొనిస్తాను, చప్పరిస్తూ కూర్చో" అని నవ్వుతూ స్వాతి వైపు చూసి "ఇంత పిరిగ్గొడ్డువి ఎలా బతుకుతావే. ఎవ్వరైనా ఎప్పుడైనా మనలో ఏదైనా తప్పుంటే అనాలిగాని అకారణంగా మనని అంటే ఎందుకూరుకోవాలీ, చాతగాని వాళ్లలా!" అంది మాలతి.

"నీతో నేనార్గ్యూ చెయ్యలేనే మాలతి నన్నొదిలేయ్!" అంది స్వాతి.

"అయితే నోర్మూసుకొని నేనెలా చెప్తే అలా చెయ్యి!" అంది మాలతి మహారాణిలా ఫోజు పెట్టి.



ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ ఉండే మాలతి మూగనోము పట్టినట్లుగా కనబడడంతో "ఏమిటే మాలతి అలా ఉన్నావు?" అనడిగింది స్వాతి.

"మాలాంటి మధ్య తరగతి కుటుంబాల్లో బాధలూ, నిరాశలూ తప్ప ఇంకేముంటాయి? ఒకవేళ ఉన్నా రాణించవు?" అంది మాలతి నిర్లిప్తంగా.

"ఏమిటే ఈ రోజు కొత్తగా వేరుచేసి మాట్లాడుతున్నావు. మా లాంటి, మీ లాంటి అంటూ భారీ డైలాగులు ఉపయోగిస్తున్నావు. ఏం? నేను మాత్రం మీ లాంటి దాన్ని కానా?" అంది స్వాతి నిష్ఠూరంగా.

"నువ్వు మాలాంటి దానివెందుకవుతావే? మీ నాన్నగారికి నువ్వొక్కతివే కూతురువు. ఆపైన మీ నాన్నగారు ఆఫీసరు, దానికితోడు రెడిమెడ్‌గా మీ సూర్య మావయ్య వరుడుగా సిద్ధంగా ఉన్నాడు. ఇక మా సంగతి, మా నాన్న మామూలు గుమస్తా. ఆయనకు మా అక్కా, నేనూ గుండెల మీద కుంపట్లలా ఉన్నాం. మా భారం ఎలా దిగుతుందా అని నిత్యం బాధ పడుతుంటారు. అలాంటప్పుడు నువ్వూ మేమూ సమానమే నంటావా?" అంది మాలతి.

"ఇదిగో మాలతి! సరదాకి కూడా ఇలాంటి మాటలనవద్దని నీకిదివరకే చెప్పాను. నువ్విలా వేరుచేసి మాట్లాడితే నాకెంత బాధగా ఉంటుందో తెలుసా? మీ కుటుంబ పరిస్థితులు బాగా లేదను. ఒప్పుకుంటాను. అంత మాత్రాన నీకు పెళ్లి కాకుండా నేను చేసుకొని వెళ్లిపోతాననుకున్నావా. అలా ఎన్నటికీ జరగదు కాబట్టి మనిద్దరి మధ్యా భేదాలెంచకు. మనిద్దరం ఒకేసారి పెళ్లి చేసుకుందాం. ఒకేసారి పిల్లల్ని కందాం, ఒకేసారి చద్దాం!" అంది స్వాతి ఉద్వేగంగా.

"నయం ఒక్కళ్లనే చేసుకుందాం అనలేదు. మీ అమ్మగారు మనిద్దరికీ బడితె పూజ చేసేవారు" అంది మాలతి నవ్వేస్తూ.

"జోకా? డోకొస్తోందే బాబూ" అంది స్వాతి ఆముదం తాగినట్లు ముఖం పెట్టి.

"నీకలాగే ఉంటుంది మరి. మా ఇంట్లో పరిస్థితులు చూస్తే బుర్ర తిరిగిపోతుంది. అక్కకి బొత్తిగా చదువు తక్కువని ఎంచేవారు ఇంత కాలం. ఇప్పుడది ఎలాగో కష్టపడి టెన్త్ పాసయింది. ఇప్పుడేమో, ఇంత వయసు వచ్చే వరకూ ఎందుకు పెళ్లి కుదరలేదు. అమ్మాయిలో ఏమైనా లోపాలున్నాయా? అని రంధ్రాన్వేషణ చేస్తున్నారు. పాపం అక్క వయసు ఎంతని? మొన్ననే ఇరవై రెండు నిండి ఇరవై మూడు వచ్చింది. ఈ కాలంలో ఇదో పెద్ద వయసా చెప్పు? అదయ్యాక పెళ్లయ్యాక ఉద్యోగం చేస్తుందా? అని అడుగుతారు. దాని టెంత్‌క్లాస్ క్వాలిఫికేషన్‌కి ఎవరిచ్చేస్తారే ఉద్యోగం? సరే, మీ కిష్టమైతే చేస్తుంది అని చెప్తే అప్పుడు కట్నకానుకల దగ్గర కొస్తారు. అసలు మగపెళ్లి వారనగానే ఏదో ఆకాశం నుండి దిగి వచ్చినట్లు ఏం

దర్జా వెలగబెడతారే, ఎన్ని యక్ష ప్రశ్నలు వేస్తారే?

ఆడపిల్ల అతనిలాగే పుడుతుంది. అంతో ఇంతో చదివి అవసరం అయితే ఉద్యోగం చేస్తుంది. అయినా కట్నం ఇచ్చి మొగుడ్ని కొనుక్కోవలసిందే. కట్నమొక్కటేనా? మీ పిల్లే కదా, షికారుకో సినిమాకో వెళ్లాలంటే వెధవ సిటీ బస్సులో అవస్థపడేది, కాబట్టి ఓ మోటార్ సైకిలో స్కూటరో కొనివ్వండి. మీ పిల్లే కదా, హాయిగా కాలు మీది కాలు వేసు కొని ఎంజాయ్ చేస్తుంది. ఓ కలర్ టీవీ కొని వ్వండి. ఈ కాలంలో రుబ్బురోళ్లనీ ఎవరు వాడుతున్నారు? ఓ మిక్సీనో వెట్ గ్రైండరో కొనివ్వండి. ఆ చేత్తోనే ఫ్రిజ్ కూడా అంటూ గొంతెమ్మ కోరికలతో పిల్ల సుఖం పేరిట ఆమె కన్నవారిని నిలువుదోపిడి చేసి రాబట్టు కుంటున్నారు.

అబ్బాయికి అమ్మాయి ఎంత అవసరమో అమ్మాయికీ అబ్బాయి అంతే అవసరం. ఇద్దరూ సృష్టికార్యంలో సమానంగా పాలుపంచుకుంటారు. ఇద్దరిలో ఏ ఒక్కరూ లేకపోయినా సృష్టే ఆగిపోతుంది. అలాంట ప్పుడు స్త్రీ మాత్రం ఎందుకు ఈ వివాహ సుంకం చెల్లించాలి? ఆడపిల్లగా పుట్టినందుకు అపరాధపు పన్నా ఇది? " అంది మాలతి ఉద్రేకంగా. ఎప్పటి నుండో ఉగ్గబట్టుకున్న ఆక్రోశాన్ని అలా తన స్నేహితురాలి ముందు వెళ్లగక్కింది.

మాలతి మాట్లాడుతున్నంతసేపూ మంత్ర ముగ్ధలా వింటూండి పోయిన స్వాతి వాస్త వంలో కొస్తూ "మాలతి నువ్వు చెప్పేదంతా వాస్తవమే కాదనను. కానీ ఇలా ఉద్రేకపడి నంత మాత్రాన సమస్య పరిష్కారం అవు తుందా? " అంది వాతావరణాన్ని చల్లబర చాలి అనే ధోరణిలో.

"ఉద్రేకం కాదు స్వాతీ! బాధ! వాళ్లని కన్నట్టే మనమ్మా నాన్నలు మననీ కంటారు. కనీ పెంచీ చదువు సంధ్యలు చెప్పించి ప్రయోజకుల్ని చేస్తారు. ఐనా ఆడపిల్లల్ని కని ఏదో తప్పు చేసినట్లు వాళ్ల దగ్గర ఉన్నా లేక పోయినా తల తాకట్టు పెట్టయినా అడిగిన సొమ్ము చెల్లించి కన్యాదానాలు చేస్తారు. ఆ మగ మహారాజులు అన్నీ చల్లగా పుచ్చుకొని ఎదురు మనమీదే పెత్తనం చెలాయిస్తారు. ఆపైన ఉద్యోగం చేసి సంపాదిస్తే అదీ వాళ్ళే తీసుకుంటారు. కానీ ఇంత కష్టపడి కని పెంచిన తల్లిదండ్రులకు కష్టాలూ కన్నీళ్లూ తప్ప ఏం మిగులుతోంది? " అంది మాలతి, ఏ మాత్రం తగ్గని బాధతో.

"నిజమే మాలతీ, ఇన్ని బాధలూ మనమే పడుతున్నా, అదేమని ఎవరైనా ఎదిరిస్తే బరి తెగించిన పిల్ల అంటూ ముద్ర వేసేస్తున్నారే గానీ వాస్తవాన్ని గ్రహించడం లేదు. తామూ ఆడవాళ్లయి ఉండీ అత్తల పొజిషన్‌లోకి షిఫ్ట్ కాగానే ఏదో కొమ్ములు మొలిచినట్లు ప్రవర్తి స్తారు. రోజూ పేపర్లలో వచ్చే వరకట్న మర ణాలూ, వేధింపులూ చూస్తూంటే నాకూ చాలా బాధగానే ఉంటోంది. అయితే నేను నీలా అన్నీ వ్యక్తపరచలేను. నీలా ఆలోచించే వారూ, మాట్లాడేవారూ ఉంటే ఈ లోకం ఎప్పుడో బాగుపడును. పోనీ ఇదంతా ఏదైనా పత్రికకు పంపకూడదా. చదివిన వాళ్లలో ఏ ఒక్కరు చదివి మారినా చాలు మనకి!" అంది స్వాతి సలహా ఇస్తున్నట్లుగా.

"పిచ్చి స్వాతీ, ఈ జరిగే దారుణాలన్నీ వారికి తెలియకే చేస్తున్నారంటావా? నిజంగా నిద్రపోతున్న వాళ్ళని ఎవరైనా లేపగలరు. మేల్కొని నిద్ర నటించే వాళ్లని ఎవరు లేపగ లరు. అన్నీ అందరికీ తెలుసు. అయినా ఇలా జరిగిపోతూనే ఉంటాయి. ఆదర్శాలనేవి ఇత రులకు చెప్పడానికే కాని ఆచరించడానికి కాదు. ఏదో ఉపన్యాసాలిచ్చినంత మాత్రాన, పత్రికల్లో వ్యాసాలు రాసినంత మాత్రాన మారిపోయే సమాజమే మనదైతే, కట్నం చట్ట విరుద్ధమని చట్టం చేసినా, ఇంకా కొనసాగు తూనే ఉంది చూశావా? చట్టం, న్యాయం అంటూ వేదికలెక్కి ఉపన్యాసాలు ఇచ్చే పెద్ద మనుషులు చాటుగా తమ పుత్ర రత్నాలకి

కట్నాన్ని ఏదో రూపంలో దండిగా పుచ్చుకుంటూనే ఉన్నారు".

"ఏం చేస్తాం మాలతీ... మన సమాజమలా ఉంది. ఆడపిల్లలకు కూడా మగ పిల్లవాడితో పాటు సమాన ఆస్తి హక్కు ఉంటే ఈ కట్నాల బెడద ఉండదేమో!" అంది స్వాతి ఆలోచనగా.

"ఏం హక్కులే స్వాతీ! ఇదివరకు సమాన ఆస్తి హక్కు కల్పిస్తూ చట్టం చేసింది ప్రభుత్వం. ఎంతవరకూ అమలైందా చట్టం? ఆస్తులు ఉన్నవాళ్ల సంగతి పక్కన పెట్టు స్వాతీ! ఇప్పుడు వచ్చిన చిక్కల్లా ఏ ఆస్తీ లేని వాళ్ల గురించే. మా అక్క సంగతే తీసుకో, నాన్నగారి ఉద్యోగమూ, మేముంటున్న ఆ చిన్న పెంకుటిల్లూ తప్ప మాకు వేరే ఆదాయమేమీ లేదు. కానీ ఆ వచ్చిన వాళ్లకు లక్ష రూపాయల కట్నం, అందులో టెన్ పర్సెంట్ అంటే మరో పది వేలు ఆడపడుచు లాంఛనాలట. సూటూ బూటూ, వాచీ, కలర్ టీవీ, మిక్సీలతో పాటు అలక పాన్పు మీద మోటార్ సైకిలట. ఆ పైన పెళ్లి ఖర్చులు. ఎక్కడి నుండి తెస్తారు నాన్నగారు ఇదంతా. అమ్మ ఎలాగైనా ఈ సంబంధం వద్దంటుంది. నాన్నగారు ఆఫీసులో అన్ని రకాల లోన్సూ పెట్టి రెండు లక్షలకు మించి తేలేనంటున్నారు. ఉన్న ఆ చిన్న ఇల్లూ అమ్మేస్తే మా తరువాత ఇద్దరి తమ్ముళ్ళ మాటేమిటి? " అంది మాలతి విసుగ్గా.

"మరి ఇదంతా చూసి అక్క ఏమంటోంది? " అంది స్వాతి.

"ఏమంటుంది? నాలాగే బాధపడుతోంది. కానీ అమ్మా నాన్నలకు ఎదురు చెప్పలేక ఈ పెళ్లికి ఒప్పుకుంటోంది. అదే నేనైతే ఛస్తే ఇటువంటి పెళ్ళి చేసుకోను. ఓ పక్క అమ్మా నాన్నా అప్పులతో సతమతమవుతూంటే నేనలా పల్లకీ ఎక్కి ఊరేగలేను" అంది మాలతి ఆవేశంగా.

"ఊ, ఇవన్నీ ఇప్పటి కబుర్లే. ఆ సమయం వచ్చేసరికి నువ్వే మారతావు" అంది స్వాతి ఆట పట్టిస్తున్నట్లుగా.

"చూస్తుండు, ఏం చేస్తానో? ఈ మాలతి చెప్పేదొకటి, చేసేదొకటీ కాదు. ఏం చెప్తానో అదే చేస్తాను. నా పెళ్లి నా తల్లిదండ్రులకు ఎన్నడూ భారం కానీయను" అంది మాలతి స్థిరంగా.

ఏ పని చేస్తూ ఉన్నా ఆ రోజంతా అదే విషయం ఆలోచిస్తూ ఉండిపోయింది మాలతి. ఇదంతా ఏదైనా పత్రికకు రాసి పంపకూడదా అని స్వాతి అన్నప్పుడు తేలిగ్గా కొట్టిపారేసిన మాలతి ఇంటికి వెళ్లాక స్వాతి చెప్పినట్లు చేస్తే అనుకుంది.

వెంటనే కార్యాచరణలో పెట్టింది. తన భావాలన్నింటినీ క్రోడీకరించి ఒక వ్యాసాన్ని తయారుచేసింది. అందులో ఎన్నో ప్రశ్నలూ సందేహాలూ. అలాగే తనకు తోచిన ఎన్నో పరిష్కార మార్గాలు సూచిస్తూ ఆడదాని జీవితం కేవలం పెళ్లికే పరిమితం కాదని పెళ్ళితోనే ముగిసిపోదని చెప్తూ, పెళ్ళీ సంసారం అనేవి స్త్రీకి ఎంత అవసరమో పురుషుడికీ అంతే అవసరమని, పెళ్ళి అనేది జీవితంలో

**చూస్తుండు, ఏం చేస్తానో? ఈ మాలతి చెప్పేదొకటి, చేసేదొకటీ కాదు. ఏం చెప్తానో అదే చేస్తాను. నా పెళ్లి నా తల్లిదండ్రులకు ఎన్నడూ భారం కానీయను...**



ఒక పార్టే కాని అదే మొత్తం జీవితం కాదంటూ రాసింది. స్వాతికి కూడా చెప్ప కుండా ఆ వ్యాసాన్ని పత్రికకు పంపించింది మాలతి.

ఆ వ్యాసం తమ పత్రికలో ప్రచురించడమే కాక పారితోషికంతో పాటు ఆ పత్రికా ఎడిటర్ స్వయంగా రాసిన ఉత్తరం కూడా అందుకుంది మాలతి.

"మీ వ్యాసం చాలా బాగుంది. ఈనాటి యువతరానికి చాలా స్ఫూర్తిదాయకంగా ఉంది. ఇలాంటివే మరిన్ని మంచి రచనలు మీ కలం నుండి జాలువారాలని ఆకాంక్షిస్తూ, అభినందనలతో... అని ఉంది అందులో.

మాలతి ఆ ఉత్తరాన్ని పదే పదే చదువుకొని మురిసిపోయింది. వెంటనే ఆ ఉత్తరాన్ని, వారు పంపిన డబ్బునీ పట్టుకొని స్వాతి దగ్గరకు పరుగు తీసింది.

వెలిగిపోతున్న ముఖంతో వచ్చిన మాలతిని చూసి "ఏమిటే సంగతి! ముఖం మతాబులా వెలిగిపోతోంది" అంది స్వాతి.

"ఛత్, నీ ఉపమానం తగలెయ్య. ఎన్ని సార్లు చెప్పాలే నీకు. నా ముఖాన్ని రెండు నిముషాలు వెలిగి ఆరిపోయే మతాబుతో పోల్చవద్దని" అంది మాలతి బుంగమూతి పెట్టి.

"సరేలే. సంగతేంటో చెప్పి ఏడు" అంది స్వాతి కవ్వింపుగా.

"రాక్షసీ... నిరంతరం నన్ను ఏడిపించడం తప్ప నీకు వేరే పనేం లేదుకదా. చూడు ఈ పత్రిక. ఈ రోజు నువ్వు చెప్పినట్లే ఒక వ్యాసం రాసి పంపాను. అది వేసుకున్నారు చూశావా ఇందులో. ఇదిగో ఈ డబ్బులు మనిద్దరికీ చెరి సగం" అంటూ తనకి వచ్చిన పారితోషికం నుండి సగం తీసి స్వాతి చేతిలో పెట్టింది మాలతి.

"నిజంగా? వాటే వండర్! నేనేదో యథాలాపంగా అంటే దాన్ని నిజం చేశావే నువ్వు" అంటూ పత్రిక పేజీలు తిప్పి గబగబా వ్యాసం చదివేసింది. "ఎంత బాగా రాశావే మాలతీ! నిజంగా నువ్వు చాలా గ్రేటే బాబూ. సరేగానీ ఈ డబ్బులెందుకే నాకు? " అంటూ తిరిగి స్నేహితురాలికి ఆ డబ్బులు ఇవ్వబోయింది స్వాతి.

"అదేం కుదరదు. మనిద్దరిలో ఎవరికేది దొరికినా, అది ఇద్దరికీ ఫిఫ్టీ ఫిఫ్టీయే కదా!" అంది మాలతి, ఆ డబ్బులు తిరిగి స్వాతి చేతిలో పెట్టేస్తూ.

"అవునే మాలతీ! ఇంత బాగా ఎలా రాయగలిగావే. నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది"

"ఇదంతా మా కమలక్క పుణ్యమేనే! అక్క మూలంగా నాకు రీడింగ్ హేబిట్ అలవడింది. నీకు తెలుసుకదా. నా తీరిక సమయమంతా పుస్తకాలు చదవడానికే వెచ్చిస్తానని. చాలా రోజుల క్రితం వరకట్నం ఇచ్చుకోలేక హైద్రాబాదులో ఒక వ్యక్తి తన ముగ్గురు చెల్లెళ్లతో పాటు చార్మినార్ నుండి దూకి ఆత్మహత్య చేసుకున్నాడని చదివాను పేపరులో. అలాగే ఎప్పటికప్పుడు ఈ వరకట్న చావులు, అత్యాచారాల గూర్చి వింటూంటే, చదువుతూంటే కోపంతో నా ఒళ్ళు దహించుకుపోయేది. కనీసం నా వరకైనా ఈ దురాచారాన్ని సాగనివ్వరాదని పట్టుదల నాకు. అందుకే అంత ఖచ్చితంగా చెప్పానా రోజు. నేను కట్నమిచ్చి పెళ్ళి చేసుకోనని" అంది మాలతి ఎక్కడో ఆకాశంలో చూపులు నిలిపి.

"నిజమేనే. ఎవరికి వారు నా ఒక్కరి వల్లా ఏమవుతుంది నేను మానేసినంత మాత్రాన ఈ సమాజం మారిపోతుందా? అని తనను తాను మభ్యపెట్టుకుని అదే బాటలో నడుస్తారే గాని, నీటి బొట్టూ నీటి బొట్టూ కలిస్తేనే కదా సముద్రమయ్యేది అని ఎవరూ అనుకోరు. అలా ఎవరికి వారు మారి ముందడుగు వేస్తేనే ఏదైనా సాధించ గలిగేది" అంది స్వాతి.

"అమ్మయ్య! ఇన్నాళ్ళకి నా మాట అవున న్నావే నువ్వు" అంది మాలతి అల్లరిగా నవ్వేస్తూ.

"నేను ఏమన్నా చివరికి వినేది నీ మాటే కదా. చేసేది నువ్వు చెప్పినట్లే కదా!" అంది స్వాతి నాటకీయంగా.

"ఫోజులకేం తక్కువ లేదు కానీ, పద. ఏదైనా సినిమాకు పోదాం!" అంది మాలతి లేస్తూ.

"అయితే ఓకేనే!" అంటూ హుషారుగా లేచింది స్వాతి.




మొత్తం మీద కమల పెళ్లి ఎంతో కష్టం మీద చేయగలిగారు, విశ్వనాథం ఇందిరమ్మలు. అక్క పెళ్ళి జరుగుతున్నందుకు ఎంతో ఆనంద మనిపించినా ఆ పెళ్ళి జరిపించడానికి తండ్రి పడిన అవస్థలు చూసిన మాలతి మనస్ఫూర్తిగా పెళ్లిని ఎంజాయ్ చెయ్యలేకపోయింది.

కమల అత్త వారింటికి వెళ్తూ, "మాలతీ! నీకు నా మీద చాలా కోపంగా ఉందని తెలుసు. కానీ నేనేం చేయగలను చెప్పు? నా పెళ్లి కాలేదని బెంగపడే అమ్మా నాన్నలకు ఎలా ఊరట కలిగించాలో తెలియక ఈ పెళ్లికి ఒప్పుకున్నాను. నేను నీ అంత ధైర్యస్థురాలిని కాను. నీలా చదువుకోనూ లేదు. నా కాళ్ల మీద నేను నిలబడేందుకు నేను చేస్తున్నది తప్పని, నా మూలంగా అమ్మా నాన్నా అప్పుల ఊబిలో కూరుకుపోతున్నారనీ తెలుసు. ఇంతకంటే మరో మార్గం లేక ఈ పెళ్ళి చేసుకుంటున్నాను. నువ్వు సరైన మార్గాన్ని ఎన్నుకున్ననాడు నా పూర్తి సహకారం, ఆశీర్వాదం నీకెప్పుడూ ఉంటాయి. నా మీద కోపం తెచ్చుకోకే మాలతీ నేనది భరించలేను!" అంది కమల గాద్గదికంగా.

అంతవరకూ కమల మీద పేరుకొన్న కోపం మంచులా కరిగిపోయిందా మాటలు వినడంతోనే. ఎలాగో గొంతు పెగుల్చుకొని "ఛ, అవేం మాటలక్కా. చిన్నప్పటి నుండి కలిసి పెరిగాం. నీ మనసేమిటో నాకు తెలియదా? అయినా ఇలాంటి సమయంలో నీ మీద కోపం తెచ్చుకుంటానని ఎలా అనుకున్నావు? " అంటూ కమలని కౌగలించుకుంది మాలతి ఆప్యాయంగా. స్వాతి కూడా 'అక్కా!' అంటూ కమలని హత్తుకుపోయింది.

ఇద్దర్నీ చెరో చేత్తో దగ్గరకు తీసుకుంది కమల. స్వాతీ, మాలతీ చెరో బుగ్గ మీదా ముద్దు పెట్టారు. ముగ్గురూ మనసారా హాయిగా నవ్వుకున్నారు.

కమల అత్త వారింటికి వెళ్ళిపోయాక స్వాతీకీ మాలతికీ ఎంతో లోటుగా అనిపించింది. వాళ్ళు ముగ్గురూ చిన్నతనం నుండీ సంతోషంగా గడిపిన ఎన్నో సాయంత్రాలను గుర్తు చేసుకుంటూ. కమలక్క ఇప్పుడేం చేస్తుందో అక్కడ? అంటూ కమల గూర్చే మాట్లాడుకునేవాళ్ళు స్నేహితురాళ్ళిద్దరూ.

మాలతితో కబుర్లాడుతూ యధాలాపంగా ఎదురింటి వైపు చూసిన స్వాతికి తమ ఈడుదే అయిన అమ్మాయి మొక్కలకు నీళ్ళు పోస్తూ కనిపించింది. అదే సమయంలో నీళ్లు పోస్తూ తల ఎత్తిన ఆమె స్నేహ పూర్వకమైన చిరునవ్వుతో ఇద్దరివైపూ చూసింది.

"ఎవరే ఆ అమ్మాయి. ఎంత బాగుందే తన నవ్వు!" అంది స్వాతి మైమరుపుగా చూస్తూ.

"నవ్వేనా, ఆమె గొంతు వింటే మూర్ఛపోతావు నువ్వు. అంత మధురంగా ఉంటుంది ఆ గొంతు. పేరు విమల. ఈమధ్యే వాళ్లాయనకు ట్రాన్స్ఫరయి ఈ ఊరు వచ్చారట" అంది మాలతి.

"మనం వెళ్ళి పరిచయం చేసుకుందామా? " అంది స్వాతి ఉత్సాహంగా.

"నో ఛాన్స్. తను మనతో మాట్లాడ్డం

వాళ్ళత్తగారుకానీ చూశారంటే కొంపలంటుకు పోతాయి. ఆవిడో పెద్ద శాడిస్ట్! చిన్నతనం లోనే భర్త పోయాడట. పిల్లల్ని ఆవిడే కష్ట పడి పెంచిందట. కట్నానికి ఆశపడి కొంత, ఇంకా కొడుకులకు పెళ్లిళ్ళు చేయవా అని లోకులు చేసే ఎగతాళికి జడిసి కొంత పెళ్ళి చేసినట్లుంది ఆవిడ.

కోడలు వచ్చి తననుండి తన కొడుకును ఎక్కడ దూరం చేసేస్తుందోనని అర్థం లేని అనుమానాలతో, అపోహలతో నిత్యం ఆ అమ్మాయిని కాల్చుకుతింటోంది. నించుంటే తప్పు, కూర్చుంటే తప్పు, ఆఫీసు నుండి కొడుకు వచ్చే సమయానికి కోడలి నేరాల చిట్టా తయారుచేసి కొడుకుతో విచారణ జరి పించి చివాట్లో, దెబ్బలో ఇప్పిస్తుంది నిత్యం. అందుకే వాళ్ళిక్కడికి వచ్చి ఇన్ని రోజుల యినా ఎవ్వరం అటు వెళ్లే సాహసం చేయలే కపోయాం.

మేం వెళ్తే ఆ శిక్షల భారం మరింత పెరు గుతుందని తెలిసి అక్కడికి వెళ్ళక పోయినా ఆ ఇంట్లో జరిగేవన్నీ అందరికీ కనిపిస్తూనే ఉంటాయి. వినిపిస్తూనే ఉంటాయి. అందుకే ఇలా దూరం నుండి కళ్లతోనే ఆ పలకరిం పులు" అంది మాలతి సానుభూతిగా విమల వంకే చూస్తూ.

"పాపం ఎలా భరిస్తుందే అవన్నీను. ఆవి డకు బుద్ధి లేదు సరే, అతగాడు చదువుకొని ఉద్యోగం చేస్తున్నాడు. సంఘంలో తిరుగుతు న్నాడు. ఇలా చేయడం తప్పుగా అనిపించడం లేదా? " అంది స్వాతి బాధగా.

"ఆయనే ఉంటే మంగలెందుకని. అతడికి బుద్ధి ఉంటే ఇవన్నీ ఎందుకనుకోవాల్సి వస్తుందే మనం? " అంది మాలతి నిరసనగా.

"ఈ బాధలన్నీ పడే బదులు ఈ నరకం నుండి బయటపడి హాయిగా పుట్టింటికి వెళ్ళి ఏదో ఉద్యోగం చేసుకుంటూ స్వతంత్రంగా తన కాళ్ల మీద తను నిలబడవచ్చు కదా!" అంది స్వాతి.

ఉద్యోగాలు ఎప్పుడంటే అప్పుడు దొరుకు తాయా స్వాతీ! ఈ నరకం నుండి బయట పడి నాలుగు రోజులు తలదాచుకుందా మంటే చోటేదీ? ఆ పుట్టింట్లో కూడా ఆద రణ కరువేనాయె. విమలా వాళ్లమ్మగారు చనిపోయారట. వాళ్ల నాన్నగారే కొడుకుల మీదా, కోడళ్ల మీదా ఆధారపడి వాళ్ల దయా దాక్షిణ్యాల మీద బతుకుతూ ఉంటే, భర్తను వదిలి వచ్చిన కూతురికి ఇంకేమి ఆసరా చూపించగలరు? తల్లి నగలనమ్మిన డబ్బు తో కట్న కానుకలిచ్చి పెళ్లిచేసి చేతులు దులి పేసుకున్నారా అన్నదమ్ములు. విమల దుస్థి తి గమనించిన విమల అత్తగారు మరింత పేట్రేగిపోయి ఇలా కాల్చుకుతింటోందా అమ్మాయిని" అంది మాలతి.

"బాబోయ్ ఇవన్నీ వింటూ ఉంటే నాకు పెళ్లంటేనే భయమేస్తోందే మాలతి. ఇలాంటి వన్నీ చూసే కాబోలు మనవాళ్లు ఆడదానిగా పుట్టేకంటే అడవిలో మ్రానై పుడితే మంచిదని అంటారు" అంది స్వాతి బాధగా విమలా వాళ్లింటివైపు చూస్తూ.

"తనకీ నీకూ పోలికేంటే స్వాతీ. నేనేదో చెప్తే నువ్వెక్కడికో వెళ్లిపోయావు గానీ, చాల్లే పద చదువుకుందాం. ఆ ఎకనమిక్స్ చాప్టర్ కంప్లీట్ చెయ్యాలి ఈ రోజు మనం" అంటూ లేచింది మాలతి.

"అది కాదే. పాపం ఆ అమ్మాయిని చూస్తే చాలా బాధగా ఉందే. దాదాపు మన వయసే ఉంటుంది కదే. పాపం ఎన్ని బాధలో తనకి? " అంది స్వాతి దిగులుగా.

"అమ్మా... తల్లీ నేరకపోయి అదంతా నీకు చెప్పాను కానీ ఇకా టాపిక్ వదిలె య్యవే బాబూ. ఆలోచించినకొద్దీ మన మనసు పాడవడం తప్ప ఏమీ చెయ్యలేం మనం!" అంది మాలతి.

"అంతే నంటావా? " అంటూ జాలిగా అటే చూస్తూ స్నేహితురాలి వెంట నడి చింది స్వాతి.

మాటైతే తేలిగ్గా తీసి పడేసినట్లుగా అంది కానీ స్వాతి వెళ్ళాక కూడా మాలతి మన

# చతుర భాషితాలు

అవివేకులు, చనిపోయినవారు తమ అభిప్రాయాన్ని ఎన్నటికీ మార్చుకోరు.

–జె.ఆర్.లోవెల్

ప్రేమించడం స్వాధీనంలో ఉంచుకోవడానికి కాదు, తన్ను తాను సమర్పించుకోవడానికి.

–థియొడార్

అవివేకమైన చమత్కారం కన్నా చమత్కారంగా మాట్లాడే అవివేకి మేలు.

–షేక్స్పియర్

నీ సమ్మతి లేకుండా ఎవరూ ఎప్పుడూ నిన్ను కించపరచలేరు.

–ఎలియనార్ రూజ్వెల్ట్

దేవతలు కూడ వెళ్లడానికి భయపడే చోటుకు చొచ్చుకుపోవడానికి అవివేకులు పరుగెత్తుతారు.

–అలెగ్జాండర్ పోప్

వివేకవంతుడు తనకు కనిపించే అవకాశాలకంటే ఎక్కువ సృష్టిస్తాడు

–ఫ్రాన్సిస్ బేకన్

ఏ వ్యక్తి గురించి ఘనంగా మాట్లాడుతామో ఆ వ్యక్తిలో ఏదో ఒక ఆకర్షణ ఉంటుంది.

–ఆస్కార్ వైల్డ్

అందరినీ క్షమించడమనేది ఎవరినీ క్షమించకపోవడమంతటి అవివేకమే అవుతుంది

–సవెకా

ఔదార్యపు చేయి అధికారపు చేయికంటే శక్తివంతమైనది.

–సాది

సలహాను ఇవ్వగలం గానీ ప్రవర్తనను ఇవ్వలేం.

–బెంజిమిన్ ఫ్రాంక్లిన్

మన తప్పులు ఇతరుల్లో కనిపించినప్పుడు మనకు చికాకు కలుగుతుంది.

–డచ్ సామెత

కడుపు ఖాళీగా ఉన్నవాడెప్పుడూ దేశాభిమాని కాలేడు.

–విలియం కూపర్

సంతా విమల సమస్య చుట్టూనే తిరుగుతోంది. ఏదైనా చేసి విమల బాధను తీర్చాలి అనుకుంది మాలతి.

సంసారాలను చక్కదిద్దేంత వయసూ, అనుభవమూ లేకపోయినా తమ ఈడుదే అయిన విమల కష్టాలు మాలతిని బాగా కదిలించి వేశాయి. తను తల్లి ద్వారా అక్క ద్వారా విన్న విషయాలు తప్ప విమలతో స్వయంగా మాట్లాడిందేమీ లేదు. అసలా అవకాశమే ఉండదు ఎప్పుడూ. నిత్యం ఆ అత్తగారు కోడలికి పహరా కాస్తున్నట్లే ఉంటుంది.

ఉదయంపూట దైవ ప్రార్థన చేస్తూ విమల పాడే కృతులూ, శ్లోకాలూ, సాయంత్రం పూట అత్త ఆరళ్లకూ, భర్త పెట్టే హింసలకూ పెట్టే శోకాల రూపంలో విమల గొంతు వినడం తప్ప మరో మాట వినిపించదా ఇంట్లో నుండి.

ఎలాగైనా విమలతో మాట్లాడాలనే మాలతి కోరిక విమల అత్తగారి ఆకస్మిక ప్రయాణం వల్ల తీరింది.

"ఒసేయ్ విమలా! నేను లేను కదా అని ఇరుగింటికీ, పొరుగింటికీ పెత్తనాలకు వెళ్లావని తెలిసిందో వచ్చాక చెమ్డాలు ఊడదీయిస్తాను. ఈ నాలుగు రోజులూ ఇష్టారాజ్యం అన్నట్లు అదీ ఇదీ చేసుకుని దిమ్మచెక్కలా కూర్చుని మెక్కి నా కొడుకుని ఎండగట్టావనుకో తాట వలిపించేస్తాను జాగ్రత్త!" అంటూ ఆటో ఎక్కి కదిలేవరకూ వార్నింగ్‌లు ఇస్తూనే ఉంది ఆవిడ.

అదంతా కిటికీలో నుండి చూస్తూనే ఉంది మాలతి. "అమ్మా ఇప్పుడే వస్తాను!" అంటూ తల్లి వెనక నుండి చెప్పేది కూడా వినిపించుకోకుండా గబగబా చెప్పులు తొడుక్కుని విమల ఇంటికి వెళ్లింది.

అత్తగారటు వెళ్లగానే తలుపు వేసుకోబోయిన విమల మాలతిని చూసి ఆగిపోయింది. "మీరా? " అంటూ ఆశ్చర్యంగా చూస్తూ.

"లోపలికి రావచ్చా? " అంది మాలతి.

"ఓ. ష్యూర్, రండి లోపలికి!" అంటూ అడ్డు తొలగింది విమల.

"ఊరెళ్ళినట్లున్నారు మీ అత్తగారు. మళ్లీ ఎప్పుడొస్తారు? " అంది మాలతి చుట్టూ పరిశీలనగా చూస్తూ.

అత్తగారి మాట రావడంతో ఉలిక్కి పడ్డట్టుగా చూస్తూ "ఆ... అవును, వాళ్ళ తమ్ముడుగారి ఊరెళ్ళారు. వాళ్ళమ్మాయి పెళ్ళి పనుల్లో సాయానికని ఇంకా వారం రోజులుంది పెళ్ళి" అంది విమల.

"అయితే ఈ వారం రోజులూ మీకు ఆటవిడుపు అన్నమాట" అంది మాలతి ఆనందంగా చూస్తూ.

"ఏం ఆటవిడుపు. నా కూతురే నామీద పెద్ద సి. ఐ. డి. మా అత్తగారు లేనప్పుడు అదే నా మీద పెత్తనం చేస్తూ ఉంటుంది" అంది విమల పేలవంగా నవ్వుతూ.

"ఛ. అదేమిటి? సహజంగా పిల్లలకి తల్లిదండ్రుల మీద ప్రేముంటుంది కదా!" అంది మాలతి తెల్లపోయి చూస్తూ.

"సహజంగా ఉంటుంది కానీ, మా ఇంట్లో అంతా వ్యతిరేకమే. మొగుడు ముండంటే, ముష్టికొచ్చిన వాడూ ముండన్నాడట. అలా మా అత్తగారూ, మా వారూ అనే మాటలూ చేతలూ చూసి మా అమ్మాయి అలుసు కట్టేసింది. అది అడిగిందేదయినా నేనివ్వకపోతే నాన్నమ్మకు చెప్పనా, నాన్నకి చెప్పనా, రెండు తంతే అప్పుడు బుద్ధి వస్తుంది నీకు అంటూ అది నన్ను బ్లాక్ మెయిల్ చేస్తుంది. ఆవిడెప్పుడైనా ఊరు వెళితే ఫోనుచేసి మీ అమ్మేం చేస్తుందే, ఈ పూట ఏం వండింది ? మధ్యాహ్నం పూట నేను లేను కదా అని పనీ పాటా మానేసి బాగా తిని పడుకుందా? అని ఆరాలు. ఫోనులోనే అక్కడి నుండి ఇక్కడికి ఆర్డర్లు" అంది విమల కన్నీళ్లతో.

"మరి మీ వారు..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయింది మాలతి.

"స్వతహాగా మా ఆయన మంచివారే. కానీ తల్లిమాట ఆయనకు వేదవాక్కు. ఆవిడ

చేసింది రైటూ, చెప్పేది శాసనం. ఎందుకంటే చిన్నప్పటినుండీ తమను కష్టపడి పెంచి పెద్ద చేసిందన్న విశ్వాసం, గౌరవం. మా బావగారికి కూడా తల్లంటే గౌరవం, భక్తీ ఉన్నా, ఈయనలా మూఢ భక్తి కాదు. అందుకే తన భార్యను తీసుకొని ఉద్యోగం నెపంతో వీటన్నిటికీ దూరంగా తీసుకు వెళ్లిపోయారు. ఇక ఆ ఆడపడుచు. అగ్నికి ఆజ్యం తోడన్నట్లుంటుంది. ఆవిడ ఇక్కడకు వస్తే నా పాట్లు..." అంది విమల.

"మరి మీ వారికి మీ బాధ తెలియజెప్పే ప్రయత్నం ఎప్పుడూ చేయలేదా?" అంది మాలతి సలహా ఇస్తున్నట్లుగా.

"ఎక్కడా? అంత అవకాశమేదీ మాకు. రాత్రి పదకొండు గంటలవరకూ తల్లితో పాటు ఆ టి.వీ. చూస్తూ ఆ సీరియల్స్‌లోని అత్తా కోడళ్ళ ఎత్తులూ, చిత్తులూ గుర్చి కూలంకశంగా చర్చిస్తూ, తర్వాత ఏం జరగబోతోందో ముందే ఊహాగానాలు చేసేస్తూ, పనిలో పనిగా అందులో కోడళ్ళ మాదిరి నేనెక్కడ తిరగబడతానోనని ముందు జాగ్రత్తగా నామీద ఎదురుదాడికి దిగుతారు.

ఆ తరువాత నిద్ర కూరుకుపోయే కళ్లతో పడకచేరి నిద్రకు ఉపక్రమిస్తారు. ఇంకెప్పుడు ఎలా చెప్పేది నా సమస్యలు? పోనీ భోజనం వడ్డించేప్పుడు చెప్దామంటే ఎంగిళ్ళు ఎత్తడానికి తప్ప వడ్డించేప్పుడు ఆ ఛాయలకే రానివ్వదావిడ!" అంది విమల నిర్వేదంగా.

"ఇన్ని బాధలు భరిస్తూ ఎలా ఉండగలుగుతున్నారండీ మీరిక్కడ?" అంది మాలతి సానుభూతిగా.

"ఉండక ఏం చేయను. ఎక్కడికి వెళ్ళను. అమ్మ లేని పుట్టింట్లో ఆదరణ ఎంతటిదో నాకు తెలుసు. ఒకోసారి అనిపిస్తుంది. ఇన్ని అవమానాలూ, బాధలూ భరిస్తూ ఈ బతుకు బతక్క పోతేనేం అని. కానీ నాలా నా పిల్లలు తల్లి లేని బతుకు బతకకూడదు. నా పిల్లలకి నామీద ప్రేమ లేకుండా మా అత్తగారు చేయగలదేమో గాని, నా పిల్లల పట్ల



## అయన వేసుకుంటారుగా

రౌండ్ టేబుల్ సమావేశానికి లండన్ వెళ్లిన బాపూజీ తన కొల్లాయిగుడ్డతోనే రాజును దర్శించడానికి సిద్ధమయ్యారు. అదిచూసి ఓ పాత్రికేయుడు-

'రాజును కలవడానికి వెళ్తున్నారు మీరు తగిన దుస్తుల్లో వెళ్తున్నట్లు భావిస్తున్నారా?' అని ప్రశ్నించాడు.

'దాని గురించి మీకు దిగులెందుకు? మా ఇద్దరికీ సరిపడదుస్తులు ఆయన ఒంటిమీద ఎలాగూ ఉంటాయి' అని చమత్కరించారు గాంధీజీ.

నాకున్న మమకారాన్ని చంపలేదు కదా. అందుకే ఇలా మొండిగా బ్రతికేస్తున్నాను. అయ్యో. నుంచునే ఉండిపోయారు, కూర్చోండి. కాఫీ తెస్తాను" అంటూ వంటింటి వేపు వెళ్ళబోతున్న విమలను వారిస్తూ.

"ఇప్పుడలాంటి ఫార్మాలిటీస్ ఏమీ వద్దండీ. పోనీ ఏదైనా ఉద్యోగం చేసి మీ కాళ్లమీద మీరు నిలబడే ప్రయత్నం చేస్తే ఈ బాధ కొంతయినా తగ్గుతుందేమో!" అంది మాలతి కూర్చుంటూ.

"నా ఇంటరు క్వాలిఫికేషనుకి ఏం ఉద్యోగం వస్తుందండీ! ఇంటరు సెకండి

యర్ పరీక్షలు రాస్తూండగా, మా అమ్మ కేన్సరుతో చనిపోయింది. నాకింకా చదువు కోవాలని ఉన్నా, మా అన్నలు నా భారం దింపుకోవాలని ఈ పెళ్ళి చేశారు. మా నాన్నగారు నా స్థితి చూసి కన్నీరు పెట్టుకో వడం తప్ప ఏం చేయలేరు" అంది విమల.

"సారీ అండీ. ఇవన్నీ అడిగి మిమ్మల్ని మరింత బాధకు గురి చేసినట్లున్నాను" అంది మాలతి బాధగా.

"ఇది ఒకనాటితో పోయేదా ఏమిటి? ఇవన్నీ ఎప్పుడూ ఉండేవే. నా సంగతికేం గానీ, మీ సంగతులు చెప్పండి" అంది విమల.

"ప్రత్యేకంగా ఏం లేవండీ. నేను బి.ఏ. ఫైనలియర్ చదువుతున్నాను. ఇద్దరు తమ్ముళ్ళూ, అక్కా, నేనూ - అంతే!" అంది. మాలతి.

"మొన్న వచ్చిన అమ్మాయెవరు మీ ఫ్రెండా? " అంది విమల.

"అవును తన పేరు స్వాతి. ఇక్కడికి దగ్గరే వాళ్ల ఇల్లు" అంది మాలతి.

కాసేపు కూర్చున్నాక "వెళ్లొస్తానండీ!" అంటూ లేచింది మాలతి.

"అప్పుడప్పుడు రండి అని కూడా చెప్పలేను. నా గూర్చి ఆలోచించి మీ మనసు పాడు చేసుకోకండి. కొన్ని జన్మలింతే!" అంది విమల నవ్వడానికి ప్రయత్నిస్తూ. జాలిగా చూస్తూ వెళ్ళిపోయింది మాలతి.

* * *

ఆ రోజు సాయంత్రం విమల గూర్చి తాను తెలుసుకున్నదంతా స్వాతికి చెప్పింది మాలతి.

"సహనంలో భూదేవికి మించిన ఓర్పు స్త్రీకి ఉంటుంది అంటే ఏమిటో అనుకున్నాను. ఆ మాటలు అక్షర సత్యాలనిపిస్తున్నాయే స్వాతి విమలను చూస్తే!" అంది మాలతి.

"అబ్బ ఇక చెప్పకే బాబూ, అవన్నీ వింటూంటే మనసు కలచి వేసినట్లుందే. ఇవన్నీ విన్నాక ఒక్కసారి అత్తన్ని కలిసి ఛడా మడా తిట్టేయాలనిపిస్తోందే" అంది స్వాతి.

"నాకూ అలాగే అనిపించింది స్వాతీ! కానీ మనం వాళ్ల జీవితాల్లోకి ఎంటరయితే ఇది ఇగో ప్రాబ్లమ్‌గా మారిపోయి విమలగారికి ఇంకా నష్టం కలుగుతుందేమోనని ఆలోచి స్తున్నానే. ఇన్నాళ్లూ మీ ఇల్లూ, మా ఇల్లూ, స్కూలూ, కాలేజీ మన అమ్మా నాన్నలే ప్రపంచమన్నట్లుగా తిరిగాం మనం. ఈ రోజు లోకంలో ఇలాంటి మనుషులు కూడా ఉంటారా అని విస్తుపోతున్నాం. ఇదే మాట అమ్మతోనూ అక్కతోనూ అంటే నూటికి తొంభైమంది ఇలాగే ఉంటారు. మనమే తెలివిగా మసలుకోవాలి అంటున్నారు.

విమల అత్తగారికి ఉన్న అభద్రతా భావం ఆ ఇంట్లో ఈ అశాంతికంతటికీ కారణం. పెద్దకోడలు వచ్చి తన పెద్దకొడు కుని ఎగరేసుకుపోయింది. ఇప్పుడీ కోడలికి తన చిన్న కొడుకుతో ఇంటిమసీ పెరిగితే తన ఉనికి ప్రశ్నార్థకంగా మారిపోతుందన్న భయం ఆవిడను రాక్షసిలా మార్చేసిం దంతే!" అంది మాలతి ఆలోచనగా.

"అదేం కాదులేవే. మన దేశంలో అత్తా కోడళ్ల పోరనేది తరతరాలుగా వస్తూ ఉన్నదే. వాళ్లిద్దరూ సఖ్యంగా ఉంటే ఆశ్చర్య పడాలి గానీ కొట్లాడుకోవడంలో వింతే ముంది? " అంది స్వాతి.

"ఇద్దరూ పోట్లాడుకుంటే ఆ దారి వేరే. సమ ఉజ్జీలుగా నిరంతరం పోట్లాడుకుం టారు, గెలుపు ఓటములతో నిమిత్తం లేకుండా కానీ ఇక్కడ విమల విషయంలో పోట్లాట ఏకపక్షంగానే జరుగుతూ ఉంది. దానికి ముగింపనేది ఆ అత్తగారి మరణం తోనే సాధ్యం అనిపిస్తోంది నాకు" అంది మాలతి.

"ఏమోనే! ఆ అత్త చావడం మాట దేము డెరుగు. ఈ బాధలన్నీ పడలేక విమలగారే మైనా అఘాయిత్యం చేస్తారేమోనని భయంగా ఉందే నాకు" అంది స్వాతి.

"ఛ అలా అనకే. పైన తథాస్తు దేవతలుంటారట!" అంది మాలతి భయంగా చూస్తూ.



మాలతి వచ్చి వెళ్లాక అలా ఆలోచిస్తూ ఉండిపోయింది విమల ఎంతోసేపు. చీకూ చింతా లేకుండా ఎంత హాయిగా ఉన్నారో వాళ్లు? ఏ పాపం చేశానని నా జీవితం ఇలా తయారైంది. తల్లి లేనప్పుడు ఎంతో ప్రేమ కనబరిచే సత్యమూర్తి తల్లి ఉంటే అంతలా రాక్షసంగా ప్రవర్తిస్తారేం? ఎంత ఆలోచించినా సమాధానం దొరకని ప్రశ్నలా అయిపోయింది. ఆలోచిస్తూనే పనులన్నీ ముగించుకొని స్నానం చేసి మంచి చీర కట్టుకొని భర్త రాకకోసం ఎదురుచూస్తూ కూర్చుంది విమల.

సత్యమూర్తి ఆఫీసు నుండి వచ్చాక ఎప్పటిలాగే ఎంతో ఆప్యాయంగా ఉన్నాడు. కూతురు మాధవి తల్లి వంకా, తండ్రి వంకా మార్చి మార్చి చూసింది. నాన్నమ్మ ఉంటే ఒకలా, లేకపోతే ఒకలా అమ్మతో మాట్లాడే తండ్రి తీరు దానికేం అర్థం కాలేదు. అందుకే తండ్రి వైపు అనుమానంగా చూసింది. సత్యమూర్తి కూడా బెదురుగా కూతుర్నివైపు చూశాడు.

కూతురి తీరు చూసి మొదటిసారిగా విమలలోని స్త్రీ హృదయం మూలిగింది. ఏడాదికో, ఆర్నెల్లకో దక్కే ఆటవిడుపు లాంటి ఆ సమయానికి కూతురు రాహువులా అడ్డు తగులుతోందే? దీన్ని కూడా అత్తగారు తీసుకువెళ్లి ఉంటే ఎంత బాగుండేది అనుకుంది.

అత్తగారు లేని ఏడు రోజులూ భర్తతో ఏడు క్షణాల్లా గడిపేసింది విమల. సత్యమూర్తి భార్యాపిల్లలను తీసుకుని పెళ్లికి వెళ్లాడు. పెళ్లయ్యాక అటునుండి తిరిగివస్తూ తల్లిని వెంట పెట్టుకొని వచ్చేశాడు.

పెళ్లికెళ్లి వచ్చింతర్వాత మనవరాలిని దగ్గర కూర్చోబెట్టుకొని తాను తెచ్చిన కొత్త బట్టలు వేసి ముస్తాబు చేస్తూ తాను లేనప్పుడు జరిగిన సంగతులన్నీ మనవరాలిని అడిగి తెలుసుకుంది.

వెంటనే నిప్పు తొక్కిన కోతిలా గంతులు వేస్తూ నాలుగు వీధులకూ వినబడేలా అరుస్తూ ఏదో మహాపరాధం జరిగినట్లుగా గందరగోళం సృష్టించింది.

అసలే పరమకోపి అయిన సత్యమూర్తి తల్లి చెప్పే దాంట్లో నిజానిజాలు ఎంత అనేది పరిశీలించకుండానే ఆ వారం రోజులకు సరిపడా ఒకేసారి వడ్డీతోసహా వాతలు తేలేలా విమలను బాదేశాడు.

అంత జరిగితేగాని ఆవిడ కడుపు మంట చల్లారలేదు.

దాంతో దినదిన గండం నూరేళ్లాయుష్షు లాంటి ఈ బతుకు బతక్కపోతేనేం? అని... గన్నేరు పప్పులు నూరుకొని తాగేసింది విమల. చచ్చేం సాధిస్తాను అని అంతవరకూ మాట్లాడినా ఆ క్షణంలో బతికి ఈ నరకాన్ని భరించేకంటే చావే మేలని తెగించేసింది.

భార్యను ఆ స్థితిలో చూసిన సత్యమూర్తి నిలువునా కదిలిపోయాడు. చావు బతుకుల మధ్య కొట్టుకుంటూ కూడా "పిల్లలు... పిల్లలు" అంటూ అల్లాడి పోతున్న భార్యను చూస్తే జాలేసింది. పరుగున వెళ్లి ఆటో తీసుకువచ్చి భార్యను హాస్పిటల్‌కు తీసుకెళ్లిపోయాడు.

తాను చెప్పిన మాటలు విని నాన్నమ్మ నాన్నతో కొట్టించింది. అందుకే అమ్మ చచ్చిపోతుంది. అమ్మ చచ్చిపోతే నాకూ చెల్లికీ లాలెవరు పోస్తారు, బువ్వెవరు తినిపిస్తారు అనుకోగానే మాధవి బెంబేలెత్తి పోయింది. "నానమ్మా నాకు అమ్మ కావాలి!" అంటూ ఏడుస్తూ చుట్టుకుపోయిన మనవరాల్ని విదిలించి కొడుతూ.

"నన్ను వీధిలో పెట్టడానికి కాకపోతే మీ అమ్మ ఎందుకు చేసినట్టే ఈ పని? ముప్పొద్దులా తిని కూర్చుని ఉండలేక ఏం మాయ రోగమొచ్చిందే దానికి? " అని శాపనార్థాలు పెట్టింది.

తనను దగ్గరకు తీసుకుంటుందని ఆశపడిన మాధవి ఈ తిట్లు విని బిక్క చచ్చిపోయింది.

విషయం విని చుట్టూ చేరిన వాళ్ళు "చాల్లేమ్మా చెప్పొచ్చావు. అవతల ఆ తల్లి చావు బతుకుల్లో ఉంటే ఇప్పుడూ సాధింపు లేనా. ఏం మనిషివమ్మా నువ్వు? " అని తలో మాటా అనడంతో తల వంచుకుంది విమల అత్తగారు.

హాస్పిటల్‌కు తీసుకెళ్ళిన విమలని సూసైడ్ కేసు కనుక ఎవరూ ఎడ్మిట్ చేసుకునేందుకు ఒప్పుకోలేదు. పోలీస్ కేసయితే ఎవరు పడతారు. గవర్నమెంటు హాస్పిటల్‌కు తీసుకుపొండి అన్నారు. సత్యమూర్తి కాళ్లా వేళ్లా పడగా చివరికి ఓ హాస్పటల్‌లో ఎడ్మిట్ చేసుకున్నారు. అతి ప్రయత్నం మీద విమలను బతికించగలిగారు డాక్టర్లు.

ఆ తరువాత సత్యమూర్తిని పిలిచి. "మీరసలు మనుష్యులా, రాక్షసులా? అంతలా కొట్టడానికి చేతులెలా వచ్చాయి? ఇప్పుడీ మనిషి ప్రాణం పోతే ఎవరు జవాబుదారీ. రేపు మా అమ్మని నువ్వే చంపావని నీ పిల్లలు నిన్ను నిలదీస్తే ఏం బదులు చెప్తావు? " అని తిట్టడంతో అపరాధిలా తల వంచుకున్నాడు సత్యమూర్తి.

ఇన్నాళ్లూ తల్లీ, తానూ చేసిన అకృత్యాలను మౌనంగా భరించిన విమల, అతని కంటికి దేవతలా కనబడసాగింది. ఎన్ని జన్మలు తపస్సు చేస్తే ఇలాంటి భార్య దొరుకుతుంది నాకు, ఎంత అమానుషంగా ప్రవర్తించాను ఇన్నాళ్లూ. ఏది ఏమైనా ఇక మీదట విమలను పన్నెత్తి మాట అనకూడదు అనుకున్నాడు సత్యమూర్తి ధృఢంగా.

విషయం విన్న మాలతి, స్వాతీ హాస్పటల్‌కు వచ్చారు విమలను చూసేందుకు.

మొదటగా మంచం మీద పడుకున్న విమలవైపు జాలిగా చూస్తూ "సత్యమూర్తిగారూ... ఇలా చెప్తున్నానని తప్పుగా అనుకోకండి. మీకు మీ అమ్మగారి మీద అపారమైన భక్తి గౌరవాలుంటే ఉండవచ్చుగాక, కానీ దాన్ని ప్రకటించుకునేందుకు భార్యను హింసించడం పద్ధతేనంటారా? జీవితాంతం మీతో కలిసి నడిచి మీ కష్టసుఖాల్లో పాలు పంచుకునే భార్యకు మీరిచ్చే బహుమతి ఇదేనా?

నవలల్లో ఇలాంటివి చదివి ఏమోలే కథ కాబట్టి అలా రాశారు అనుకుంటాం. కానీ ఈ రోజు మీ కుటుంబాన్ని కళ్లారా చూశాక అలాంటివి యదార్థమే అనిపిస్తోంది నాకు. ఎవరికి ఇవ్వవలసిన స్థానం వారికి ఇచ్చి ఉంటే ఇప్పుడీ పరిస్థితి వచ్చి ఉండేది కాదు" అంది మాలతి ఆవేశంగా.

"జరిగిందానికి నేను బాలా బాధ పడుతున్నాను. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లయింది నా పరిస్థితి. చచ్చిన పామును ఇంకా చంపకండి. మరోసారి ఇలా జరగనివ్వను. ఇక నుంచి విమలను నా కంటి పాపలా చూసుకుంటాను" అన్నాడు సత్యమూర్తి.

"మీలో ఇంత మంచి మార్పు వస్తే అందరికంటే ఎక్కువ సంతోషించేది విమలగారే. తనకిది పునర్జన్మ లాంటిది. మీరు ఇంటికెళ్లి ఏమైనా పనుంటే చూసుకొని పిల్లల్ని తీసుకు రండి. అందాకా మేమిక్కడ ఉంటాం" అంది మాలతి.

ఇంటికి వచ్చిన కొడుకును చూడడంతోనే కోడలికెలా ఉంది అని అడగడం మాని ఎప్పటిలాగే చేతులు బారలు చాస్తూ విమలని శాపనార్థాలు పెట్టబోతున్న తల్లిని ఒక్క అరుపుతో నోరు మూయించాడు సత్యమూర్తి.

"ఇంత జరిగినా నీ కళ్లు చల్లబడలేదామ్మా. అనుక్షణం మనకి అడుగులకు మడుగులొత్తుతూ అన్ని సేవలు చేసిన ఆ పిచ్చిది చావు బతుకుల మధ్య కొట్టుకులాడుతూ ఉంటే కొంచెమైనా జాలి లేదా నీకు, ఎందుకూ ఏళ్లు వచ్చాయి? నన్ను రెచ్చగొట్టి దాన్ని కొట్టించ

డానికి తప్ప ఇంకెందుకూ పనికి రాలేదు" అంటూ పాలు కలిపి ఫ్లాస్కులో పోసుకొని చంటి పిల్లను భుజం మీద వేసుకొని పెద్దకూ తురు చెయ్యి పట్టుకొని వీధిలోకి వెళ్తున్న కొడుకు వంక అయోమయంగా చూస్తూ ఉండిపోయింది ఆవిడ.

పుట్టి బుద్ధెరిగాక తన్నింతవరకూ ఎదిరించి మాట్లాడని కొడుకు ఈ రోజు ఇలా మాట్టాడ డంతో దిమ్మతిరిగినట్లయిందామెకు.

సత్యమూర్తి హాస్పటల్‌కు వెళ్లేసరికి విమ లకు కాస్త మెలకువ వచ్చింది. భర్తను చూడ డంతోనే వెక్కివెక్కి ఏడుస్తూ పిల్లలవైపు చేతులు చాచింది ఆత్రంగా.

"విమలా! నన్నూ పిల్లల్నీ ఏం చేసి పోవా లని ఇంత పని చేశావు? నేను మూర్ఖుణ్ణే ఒప్పుకుంటాను. అందుకింత శిక్ష వేయడం న్యాయమేనా? " అంటూ చిన్నపిల్లాడిలా భార్య చేతులు పట్టుకొని ఏడుస్తున్న సత్యమూర్తిని చూసేసరికి అందరి కళ్లూ తడిశాయి.

వారిద్దరి మధ్యా తామెందుకన్నట్లుగా మాలతి, స్వాతీ వచ్చేశారక్కడి నుంచి.

విమల హాస్పటల్ నుంచి డిశ్చార్జి అయ్యాక ఆ ఇంటి స్వరూపమే మారిపోయింది. ఇప్పుడా ఇంట్లో నుంచి నవ్వులూ కేరింతలు తప్ప తిట్లూ శాపనార్థాలూ వినబడడం లేదు.

సినిమాల్లోలా విమల అత్తగారిలో సడెన్‌గా పరివర్తన వచ్చి మంచిదానిలా మారకపో యినా,రాక్షసిలా మాత్రం ప్రవర్తించడం లేదు. అసలా అవకాశం సత్యమూర్తే ఇవ్వడం లేదు.

అప్పుడప్పుడా ఇంటికి మాలతి, స్వాతీ వచ్చి విమలతో కమ్మగా పాటలు పాడించుకుని వింటూ సత్యమూర్తిని అన్నయ్యా అంటూ ఆప్యాయంగా పిలుస్తూ ఆ కుటుంబానికి ఆప్తుల్లా మారిపోయారు ఇద్దరూ.

విమల మాత్రం మాలతితో మాట్లాడడం వల్లనే తన ఆలోచనలో మార్పూ, తెగింపూ వచ్చాయి. చివరికి తన జీవితంలో చిక్కులన్నీ తొలగిపోయాయి అని అనుకుంటూంటుంది ఎప్పుడూ. ఆ మాటే మాలతితో అంటే "నాదేం లేదు. ఇన్నాళ్లూ సత్యమూర్తిగారిని మాయతెరలా కప్పేసిన అతి మంచితనం తల్లిమీద ప్రేమ పేరుతో ఉన్న మూఢత్వం తొలగిపోయి అతనిలో మంచితనానికి వెలు తురొచ్చి నీ జీవితం నందనవనమయింది" అంది మాలతి.

15



కమల పెళ్లయ్యాక మొదటి సంక్రాంతి పండక్కి అల్లుడ్నీ కూతుర్నీ పిలిచి ఉన్నంతలో పండగ మర్యాదలూ, లాంఛనాలూ జరిపిం చారు విశ్వనాథం దంపతులు.

మాలతితో మాటలు కలపాలని శశికాంత్ ఎంత ప్రయత్నించినా మాలతి తప్పుకు తిర గడం వింతనిపించిందతనికి.

కట్నం కానుకలు తీసుకున్న తన భర్తంటే చెల్లెలికి సదభిప్రాయం లేదని కమలకు తెలుసు. కనుక మాలతి ప్రవర్తనేమీ ఆమెకు ఆశ్చర్యమనిపించలేదు. కానీ ఏ ఇంట్లోనయినా కొత్తగా తమ ఇంటికి వచ్చిన బావగార్లకు మరదళ్లు చేసే వింత వింత సత్కారాలూ, చమత్కారాలూ తన మరదలి నుండి పొంద కపోయినా కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లు తుంచినట్లు మాట్లాడే మాలతి ధోరణి అంతు పట్టలేదు శశికాంత్‌కి.

ఆ మాటే నొచ్చుకుంటున్నట్లుగా కమలతో అన్నాడు. దానికి జవాబు కమల, "దాని తీరే అంతండీ, మీరేం పట్టించుకోకండి!" అని సర్ది చెప్పింది. కానీ ఉండబట్టలేక బాధపడుతూ తల్లితో అంది.

"చూశావామ్మా మాలతి అసలు మీ అల్లుడి గారి ఉనికే భరించలేనట్లుగా ఎలా ఉంటోం దో? రాకరాక మనింటికి వస్తే మనం చేసే



ఇది ఏ పార్క్‌లోని దృశ్యమో కాదు. ఇవి ఏ ఆధునిక కళాకారుడో చెక్కిన శిల్పాలు కావు. చిత్రంలో కన్పిస్తున్నది ఒక సమాధి. ఆ సమాధి చుట్టూ ఏర్పాటు చేసిన పెద్ద రాతి శిల్పాలపై పొడవాటి చదునైన రాయిని అమర్చారు. ఈ సమాధి ఎవరిదో, ఈ శిల్పాలు ఎవరు చెక్కారో తెలియదు. చరిత్రకందని నాగరికత మిగిల్చిన చిహ్నాలివి. దక్షిణ అమెరికాలోని  మాగ్దలినా నది సమీపంలో 5900 అడుగుల ఎత్తున దట్టమైన



అడవులతో కూడిన కొండప్రాంతాల్లో వీటిని 18వ శతాబ్ది మధ్యభాగంలో ఒక స్పానిష్ సన్యాసి కనుగొన్నాడు. ఒకింత భయం గొలిపే వికృతాకారాలతో మొరటుగా చెక్కిన ఇలాంటి 500 శిల్పాలను అక్కడ ఇరవై ప్రాంతాల్లో కనుగొన్నారు. ఇవి ప్రీ కొలింబియన్ మెసోఅమెరికన్, ఆండియన్ నాగరికతకు చెందినవని ఊహిస్తున్నారు. శిల్పాలలో అధిక భాగం సమాధుల వద్దే ఉండడంతో ఇది ఖనన వాటికల ప్రాంతమై ఉండవచ్చని పురాతత్వవేత్తలు భావిస్తున్నారు.

మర్యాద ఇదా? రేపొద్దున్న ఇది మా అత్తారింట్లో తెలిస్తే నాకెంత చిన్నతనంగా ఉంటుందీ? " అంది కమల నొచ్చుకుంటున్నట్లుగా.

"నేనూ చూస్తూనే ఉన్నానే దాని సంగతి మీ నాన్నగారితో చెబుతానుండు"

"పోన్లేమ్మా వద్దులే. ఇవన్నీ చెప్పి నాన్నగారి మనసు పాడు చెయ్యడమెందుకు? " అంది కమల వారిస్తున్నట్లుగా.

"ఎవరూ చెప్పకపోతే ఎలా తెలుస్తుందే దానికి? అదిగో ఆ ఎదురింటి విమల దగ్గరకు వెళ్లినట్లుంది. రానీ, నేనే అడుగుతాను దాన్ని"

మాటల్లోనే వచ్చింది మాలతి అక్కడికి "ఏమిటమ్మా అడుగుతానంటున్నావు? " అంది వస్తూనే.

"ఏమిటా? నీ పద్ధతేమైనా బాగుందా అసలు? ఇంటికి వచ్చిన వాళ్లకు నువ్వు చేసే మర్యాద ఇదా? " అంది ఇందిరమ్మ కోపంగా చూస్తూ.

"నేనా? నేనేం చేశాను? " మాలతి తెల్లబోయి చూస్తూ అంది.

"ఇంకా ఏం చెయ్యాలి? మీ బావగారితో నువ్వు మాట్లాడే పద్ధతి ఏమైనా బాగుందా? ఆయనేమనుకుంటారు. రేపు అక్కడికి వెళ్లాక మీ చెల్లెలికి ఎంత గ్వరం అని అక్కని సాధిస్తే దానికి జవాబుదారీ ఎవరు? ఆడపిల్ల అన్నాక నమ్రతంగా ఉండాలన్న ఇంగిత జ్ఞానమైనా లేదేం నీకు? " అంది ఇందిరమ్మ మండిపడుతున్నట్లుగా.

"ఏం మాట్లాడాలి ఆయనతో. బావగారూ మార్కెట్‌లో పెళ్లి కొడుకుల ధరలెలా ఉన్నాయని అడగమంటావా? ఎంత ధర పెడితే ఏ రేంజిలో మొగుడు దొరుకుతాడు. ఇంజనీర్‌కి ఎంత, డాక్టర్‌కి ఎంత అని అడగనా? " అంది మాలతి ఎకసెక్కంగా చూస్తూ.

ఎప్పుడూ ఎవర్నీ తూలనాడినట్లుగా మాట్లాడని మాలతి తన భర్తని అలా తీసిపడేసినట్లు మాట్లాడడంతో చిన్నబోయింది కమల ముఖం. తల వంచుకొని మౌనంగా అక్కడి నుండి వెళ్లిపోయింది.

"చూశావా పండగపూట దాన్నెలా కంటతడి పెట్టించావో! చదువు సంస్కారాన్ని నేర్పాలి గానీ అతిశయాన్నీ, అహంకారాన్నీ కాదు. ఏం చూసుకొనే నీకింత తల బిరుసు? " అని ఇందిరమ్మ కేకలు వేయడంతో మాలతిలో తప్పు చేశానన్న భావన తలెత్తింది.

"సారీ అమ్మా!నే వెళ్లి అక్కకు చెప్తానులే!" అంటూ వెళ్లిందక్కడ నుండి మాలతి.

తప్పు దిద్దుకుంటూ వెళుతున్న కూతురివైపు సంతృప్తిగా చూస్తూండిపోయింది ఇందిరమ్మ.

మాలతి వెళ్లి ఏం చెప్పిందో కమల చెల్లెలి వెంట నవ్వుతూ వచ్చింది. ఆ సాయంత్రం అక్కా బావగార్లతో పాటు మాలతి, శ్రీకాంత్, వాసూ సినిమాకి వెళ్లారు.

కమల పెళ్లయి ఏడాది గడిచిపోయింది. మాలతికి సంబంధాలు చూడడం మొదలుపెట్టారు. సంతలో పశువులా నేనడ్డమైన వాళ్ళందరి ముందూ కూచోనని వాదించింది మాలతి.

ఇందిరమ్మ బావిలో దూకుతానని బెదిరించి కూతుర్ని లొంగదీసుకుంది. అయితే మాలతి కోసం వచ్చిన పెళ్లి వారు కమలకెలా కట్న కానుకలు ముట్టజెప్పారో అలాగే మాలతికీ ఇస్తే చేసుకుంటామన్నారు. ఆ మాటలు వినడంతోనే విశ్వనాథం, ఇందిరమ్మా సగం నీరు కారిపోయారు.

"చూశారా... ఇప్పటికైనా అర్థమైందా నా మాటల్లో నిజం? అక్కని చదివించలేదు, నన్ను చదివించారు. ఆ పెళ్లికొడుకు మాత్రం నా కంటే ఎందులో ఎక్కువ? అతనూ గ్రాడ్యుయేటే. నేనూ గ్రాడ్యుయేటే. మరలాంటపుడు ఈ అపరాధ సుంకాన్ని ఎందుకు చెల్లించాలి మనం? అక్క పెళ్లి కోసం అందిన చోటల్లా అప్పు చేశారు. ఇప్పుడు నా పెళ్లి కోసం ఉన్న ఈ చారెడు కొంపనీ అమ్మేసి చెట్టు కింద ఉంటారా? మా తరువాత ఉన్న ఇద్దరి తమ్ముళ్ల మాటేమిటి? అయినా కట్నమిచ్చి కొనుక్కొనే మొగుడు నాకు వద్దే

వద్దు!" అంది మాలతి తెగేసినట్లుగా.

కూతురడిగినదాన్లో న్యాయం కనిపించినా అడిగిందానికి సరైన జవాబు చెప్పలేక అబ్బాయిల ధన దాహం తీర్చలేక కూతుర్ని ఎందుకు చదివించామా అని బాధపడ్డారు.

* * *

స్వాతి, మాలతి బి.ఏ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యారు. డిగ్రీ చదువు తూండగానే ఇద్దరూ కలిసి టైపూ, షార్ట్ హేండ్ నేర్చుకున్నారు తన కుటుంబం ఉన్న పరిస్థితిలో ఇంకా పైచదువు చదివేందుకు అవకాశం లేదన్న అవగాహన ఎప్పటి నుండో ఉన్న మాలతి ఉద్యోగాల కోసం వేకెన్సీ ఉన్న చోటికల్లా అప్లయి చేస్తోంది.

అలాగే ఆ రోజు పేపర్లో పడిన ప్రకటన చూసి అప్లికేషన్ రాస్తోంది మాలతి. ఇంతలో స్వాతి వచ్చింది అక్కడికి.

"రావే స్వాతీ! ఈ నాలుగు రోజులూ కనిపించలేదేం? నాకైతే అమ్మకు జ్వరం కనుక ఇల్లు కదిలేందుకు కుదరలేదు. నీకేమైందే సూర్య మావయ్య వచ్చారా ఏమిటి? " అంది మాలతి చిలిపిగా.

"అబ్బ! ఎంత కరెక్టుగా గెస్ చేస్తావే నువ్వు? " అంది స్వాతి మెచ్చుకుంటున్నట్లుగా.

"ఊ, ఐతే పెళ్ళెప్పుడట? " అనడిగింది మాలతి.

"ఏమోనే మాలతి! నాకిప్పుడప్పుడే పెళ్లి చేసుకోవాలని లేదు, ఈ లోగా ఎం.ఏ అయిందనిపిస్తే" అంటున్న స్వాతి వైపు అల్లరిగా చూస్తూ,

"అప్పుడు ఎంచక్కా ఇద్దరూ రెండు చేతులా సంపాదిస్తూ ఝుమ్మని ఎంజాయ్ చేయొచ్చు" అంది మాలతి.

"ఆలోచనలకేం? ఎన్నయినా ఉంటాయి. కానీ నెరవేరే మార్గమే కనిపించడం లేదు. ఐదేళ్ల క్రితం కావలసిన పెళ్లిని ఇప్పటివరకూ ఆపుకు రావడమే కష్టమైంది. మరో రెండేళ్లు వాయిదా అంటే మాటాలా? మా సూర్య మావయ్యకైతే ఎలాగో నచ్చ జెప్పవచ్చు ఎటొచ్చీ చిక్కంతా మా అమ్మా వాళ్ళతోనే!"అంది స్వాతి దిగులుగా.

"ఇంకా ఎందుకే బాబూ ఈ వాయిదాలు? హాయిగా పెళ్లి చేసుకోక అంతకూ కాకపోతే పెళ్లయ్యాక పి.జి. చేద్దువుగానిలే!" అంది మాలతి సలహా ఇస్తున్నట్లుగా.

"పెళ్లయ్యాక ఇంకేం చదువే మాలతి. వివాహం విద్య నాశాయ అనే సామెత మర్చిపోయావా? "

"పోవే. నీవన్నీ అమ్మమ్మ కబుర్లు మనిషికి పట్టుదల అనేది ఉంటే సాధించలేనిది ఏమీ లేదు"

"ఎంత పట్టుదల ఉన్నా పరిస్థితులు అనుకూలించాలి కదా. ఎప్పుడో చేద్దామని కలలు కనే బదులు మనకు అవకాశం ఉన్నపుడే అనుకున్నది సాధించాలి"

"అరే, నిన్నేం చదవొద్దన లేదే. పెళ్లి అయితే మాత్రం చదువెం

ఆలోచనలకేం? ఎన్నయినా ఉంటాయి. కానీ నెరవేరే మార్గమే కనిపించడం లేదు. ఐదేళ్ల క్రితం కావలసిన పెళ్లిని ఇప్పటివరకూ ఆపుకు రావడమే కష్టమైంది. మరో రెండేళ్లు వాయిదా అంటే మాటాలా? మా సూర్య మావయ్యకైతే ఎలాగో నచ్చ జెప్పవచ్చు. ఎటొచ్చీ చిక్కంతా మా అమ్మా వాళ్ళతోనే!



దుకు మానాలీ అంటున్నాను"

"సరే! నువ్వు వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకోకుండా కథలో పాత్రలా మాట్లాడుతున్నావు. రాసేవారు కథలో ప్రాతలను ఎలా కావాలంటే అలా మలుచుకుంటారు. అదే నిజజీవితంలో అయితే, మనమే కాక మన చుట్టూ ఎంతో మంది మనుషులుంటారు. ఎంత కాదనుకున్నా వారి ప్రభావం, పరిస్థితుల ప్రభావం మన మీద పడుతుంది. అప్పుడు మనమనుకున్నట్లు ఏదీ జరగదు. సరే, ఇవన్నీ ఎందుకు గానీ నీ చదువు సంగతేమైంది? "

"నా చదువు సంగతి నేనెప్పుడో డిసైడ్ చేసుకున్నాను. ప్రస్తుతానికి చదువుకు చుక్క పెట్టేసి ఉద్యోగాల వేటలో పడ్డాను"

"అదేంటే, నువ్వు చదువుతావని కదా నేను చదువు కంటిన్యూ చేద్దామనుకుంటున్నది. నువ్వు మానేస్తే నేనూ మానేయవలసివస్తుంది. ఇంతకూ చదువు మానేసి ఏం చేస్తావు? ఇంట్లో కూర్చుని గోళ్లు గిల్లుకుంటావా? "

"బాగుందే, ఇంటర్లో మన ఇంగ్లీషు లెక్చరర్ గారన్నట్లుగానే నువ్వూ అంటున్నావు. ఆడపిల్లల చదువు కేవలం ఊసుపోకకు, పెళ్లి కోసమేనా? మరైతే నీకు పెళ్లి కుదిరింది కదా. నువ్వెందుకే ఇంకా చదువుతానంటున్నావు? ఏ వ్యక్తికైనా విద్య అనేది విజ్ఞానం కోసమేగాని కాలక్షేపం కోసం, అలంకారం కోసం కాదు"

"ఒక మాటకు పది మాటలు చెప్తావు. ఇది నీకు చిన్నప్పటి నుండీ ఉన్న జబ్బే కదా. సరే నువ్వన్నట్లు విద్య విజ్ఞానం కోసమే ఒప్పుకుంటాను! మరి నీకు ఈ బి.ఏతోనే సంపూర్ణ విజ్ఞానం వచ్చేసిందా? నువ్వంటున్న ఆ విజ్ఞానం కోసమైనా చదవవే మాలతీ! నీ పేరు చెప్పుకొని హాయిగా నేనూ చదువుకుంటాను" అంది స్వాతి బతిమాలుతున్నట్లుగా.

"ఓహో అదన్న మాట అసలు సంగతి. అందుకే ఇన్ని మెలికలు పెట్టి మాట్లాడుతున్నావు. సారీ డియర్! నీ మాట కాదన్నంటున్నందుకు. ఈసారికి ఏమీ అనుకోకు. నేను డిగ్రీ చదవడానికే చాలా ఇబ్బంది పడవలసి వచ్చింది. ఇప్పుడు ఎం.ఏ. చదవడం అంటే మాటలా? అదీగాక మా ఇద్దరు తమ్ముళ్లూ కాలేజీ చదువులకు వచ్చారు. వాళ్ల సంగతి కూడా నాన్నగారూ చూడాలి కదా అయినా చదువుకు అంతేముంది చెప్పు. ఇప్పటికే నాన్నగారు అప్పుల భారంతో కుంగిపోతున్నారు. ఇకమీదట వీలైతే ఆయనకి సాయం చేయాలి గాని ఇంకా నా భారం ఆయన మీద మోపడం న్యాయం కాదు!"

"సారీ! నేనా ఉద్దేశ్యంతో అనలేదు. నువ్వు చదవకపోతే నాకూ చదవాలని లేదు. కానీ నేను చదువాపేస్తే మా వాళ్లు నాకు వెంటనే పెళ్లి జరిపించేస్తారు. నాకు మనిద్దరి పెళ్లిళ్లూ ఒకేసారి జరగాలని కోరిక. అందుకే నీ పెళ్లి కాకుండా నేను చేసుకోలేకే పెళ్లినిలా వాయిదా వేస్తూ వచ్చాను. పోనీ ఓ పని చేద్దామా, నీ చదువుకు అయ్యే ఖర్చంతా నేను పెడతాను. చదువుకోవే మాలతీ!" అదే బతిమిలాడుతున్న స్వరంతో అంది స్వాతి.

"ఏమిటే స్వాతీ! నీ పిచ్చి! నన్ను స్నేహితురాలిగా ఉంచుకోవడం నీకిష్టం లేదా? నన్ను యాచకురాలిలా చేద్దామనుకుంటున్నావా? " అంది మాలతి బాధగా.

"ఛ, అదేం మాట మాలతీ! నీ కంటికి నేనలా కనిపిస్తున్నానా? " అంది దెబ్బతిన్నట్లుగా.

"లేకపోతే ఏమిటే నీ మాటలు? కేవలం నా స్నేహం కోసమని నువ్విలా చేయడం ఏమీ బాగా లేదు. స్నేహం రెండు హృదయాల మధ్య సున్నితమైన బంధం. దాన్ని ఎంత అపురూపంగా కాపాడుకోగలిగితే అంత ఎక్కువ కాలం నిలుస్తుంది. అలాంటి బంధాన్ని ఓ బంధనంగా మార్చేసుకొని, అందులో బందీగా ఉంటానంటున్నావు నువ్వు. దీని వలన నీకు ఒరిగేదేమిటి చెప్పు? "

"ఏమో మాలతీ! నువ్వు చాలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నావు. నీలా మాట్లాడడం రాదు నాకు. నాకు కావలసిందల్లా నీ

స్నేహం. దాని కోసం ఏమైనా చేయాలనిపి స్తుంది. ఏ మహత్తర క్షణాన మనిద్దరం కలి శామో కానీ మన స్నేహబంధం ఇలా ముడి పడిపోయింది. ఆ ముడిని ఈరోజు విప్పా లని ప్రయత్నించినా సాధ్యం కానంతలా తయారైంది. ఇన్నాళ్లు మనిద్దరం నీ నా ప్రసక్తి లేకుండా నాకున్న దంతా నీది, నీకున్న దంతా నాది అన్నట్లుగా ప్రవర్తించాం. ఈ రోజు మనిద్దరం వేరు వేరన్నట్లు మాట్లాడుతు న్నావు. నాకు ఇప్పుడే కాదు. ఇక ముందు కూడా నీకు లేని ఏ ఆనందమూ నాకు వద్దు అనిపిస్తోంది. బహుశా నీ దృష్టిలో ఇది పిచ్చిగా, అర్థరహితంగా అనిపించవచ్చు కాని నాకు మాత్రం అలా అనుకోవడం సాధ్యం కాదు!" అంది స్వాతి ఆవేశంగా.

"అది కాదు స్వాతీ! నిన్ను కష్టపెట్టాలని నేనలా అనలేదు. మనిద్దరం స్నేహితులమే కావచ్చు అయినా మన గమ్యాలూ, పరిస్థి తులూ వేరు. నువ్వు ఎం.ఏ. చదవడానికి ఆర్థిక సాయం చేస్తావు. బాగానే ఉంది, కానీ ఆ డబ్బు ఎక్కడి నుండి తెస్తావు? మీ నాన్న గారినడిగేకదా ఓ పక్క నీ పెళ్లి వాయిదా వేస్తూ నిన్నే కాకుండా, నన్నూ చదివించా లంటే వాళ్లకెంత కష్టంగా ఉంటుందో ఆలో చించావా? అలాంటి సహాయం పొందడం నాకూ అభిమానంగానే ఉంటుంది. అదే నువ్వు సంపాదిస్తూ ఈ మాట అంటే నేను నిస్సంకోచంగా శిరసావహిస్తాను. అప్పుడు నువ్వన్నట్లు నీకున్న దంతా నాది గానే భావి స్తాను. అదీకాక మీ నుండి ఇలా సహాయం తీసుకునేందుకు మా నాన్నగారంగీకరిస్తారను కుంటున్నావా? పోనీ నీవన్నట్లు ఈ ఎం.ఏ చదివేస్తాం. ఆ తరువాతయినా నువ్వు పెళ్లి చేసుకోవలసిందేగా. నా పెళ్లితో నీ పెళ్లి లంకె పెడితే ఎలా చెప్పు? నా పెళ్ళి కావడానికి నెలలే పట్టవచ్చు సంవత్సరాలే కావచ్చు ఎందుకంటే నా ఆదర్శాలకు మెచ్చి నన్ను నన్నుగా స్వీకరించే వాడు తటస్థపడితే తప్ప నేను పెళ్లి చేసుకోను. అప్పటివరకూ నాతో పాటు నువ్వూ ఇలాగే ఉండిపోతాననడం ఏం భావ్యంగా ఉంటుంది? సూర్య మావయ్య లాంటి మంచి వ్యక్తిని ఇబ్బంది పెట్టడం సమంజసమేనా? నీ అభిరుచులను గౌర వించి నీ కోసం ఇన్ని సంవత్సరాలుగా వేచి



## ఆ తొమ్మిదిలో నేనొకణ్ణి!

గాంధీటోపీ అందరికీ సుపరిచితమే కదా? గాంధీజీ తప్ప గాంధేయ వాదు లంతా దాన్ని విధిగా ధరించేవారు. అది గమనించిన ఓ మార్వాడీ సేఠ్ ఆ విష యమే బాపూజీని అడిగాడు.

'నా సంగతి వదిలేయండి.. మీరు పెట్టుకునే తలపాగాకు ఎంతబట్ట అవసర పడుతుందో చెప్పండి?' అని గాంధీ ఎదురు ప్రశ్నించారు.

'పది గజాలుండచ్చు' అన్నాడాయన.

'మీరొక్కరే పదిమందికి సరిపడ బట్టను వాడుతున్నారు. అంటే తొమ్మిది మంది కనీసం టోపీ అయినా పెట్టుకునే వీల్లే కుండా చేస్తున్నారు. ఆ తొమ్మిది మందిలో నేనొకడ్ని' అన్నారు బాపూ.

సుతిమెత్తగానే చెప్పినా సేఠ్‌జీకి కళ్లువి చ్చుకునేలా జవాబిచ్చారు కదూ బాపూజీ. అందుకే ఆయన మహానుభావుడు.

ఉన్నాడు. నా కోసమని మావయ్యను ఇబ్బంది పెట్టడం గాని, జారవిడుచుకోవడం గాని చేస్తే తరువాత జీవితాంతం చింతించ వలసివస్తుంది. అలాంటి అనర్థానికి నన్ను కారణభూతురాల్ని చేస్తావా స్వాతీ! నా మీద ప్రేమ ఉంటే దాన్ని మనసులో దాచుకో. అంతే గాని దాన్నిలా ప్రదర్శించకు. దీనివలన నాకు బాధ తప్ప సంతోషం కలగదు. ప్లీజ్ స్వాతీ! నామాట విని పెళ్లి చేసుకోవే!" అంది మాలతి.

ఆ మాటలతో దెబ్బతిన్నట్లుగా చూస్తూ "అయితే మాలతీ! చివరకి నా ప్రేమ ఓ ప్రదర్శనలా అర్థం చేసుకున్నావా? నా మన సేమిటో విప్పి చెప్పినా ఇంతేనా నన్నర్థం చేసుకున్నది? " అంటూ లేచింది స్వాతి. అక్కడ ఉండలేనట్లుగా.

"స్వాతీ! నామీద కోపమా? " స్నేహితు రాలి చెయ్యి పట్టుకుంటూ అడిగింది మాలతి.

"కోపమా, అది తెచ్చుకోవడం సాధ్యమ యితే ఎంత బాగుండును? నీ అభిప్రాయం నువ్వు చెప్పావు. ఇక మీదట నాకు తోచింది నేను చేస్తాను!" అని సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్లిపోయింది స్వాతి.

నేను స్వాతిని బాధ పెట్టానా? అను కుంటూ స్వాతి వెళ్లిన వైపే చూస్తూ ని లుచుంది మాలతి. ఈ రోజు నా మాటలు దాన్ని నొప్పించినా రేపు అదే అర్థం చేసుకుం టుంది. నా కోసం దాని జీవితాన్నే పణంగా పెడతానంటోంది, పిచ్చిది. ఇది నేనెలా భరిం చగలను? అనుకుంది మాలతి.

వాడిపోయిన ముఖంతో ఇంటికి వచ్చిన స్వాతిని చూసి "ఏమ్మా, అలా ఉన్నావు? " అనడిగింది జానకమ్మ ఆదుర్దాగా.

"ఎలా ఉన్నాను, బాగానే ఉన్నాను!" అంటూ విసురుగా లోపలికి వెళ్లిపోయింది స్వాతి.

స్నేహితురాళ్లిద్దరూ పోట్లాడుకున్నారు కాబోలు అనుకుంది జానకమ్మ.




స్వాతి అనుకుంటున్నట్లుగానే ఆ రాత్రి రంగారావు పెళ్లి విషయం కదిపాడు "స్వాతీ! అమ్మమ్మా తాతయ్యా ముహూర్తాలు పెట్టు కుందామని ఉత్తరం రాశారు. ఓ మాట నీ చెవిని వేసి మిగతా ప్రయత్నాలు చేద్దామను కుంటున్నాను. నీకేం అభ్యంతరం లేదుగా? " అన్నాడు సూటిగా విషయానికి వస్తూ.

"లేదు నాన్నగారూ! నాకు ఎం.ఏ చేయా లని ఉంది. అదయ్యాక మీరన్నట్లే చేసుకుం టాను పెళ్లి" అంది స్వాతి నిదానంగా తండ్రి వైపు చూస్తూ.

"అదేమిటమ్మా! నీకు చదువుకోవాలని ఉంటే పెళ్లయ్యాక చదువుకోవచ్చు కదమ్మా. ఈ మాత్రం దానికి పెళ్లి వాయిదా వెయ్యాలా? "అన్నాడు రంగారావు ఆశ్చర్యంగా.

"అనుకుంటాం కానీ నాన్నగారూ పెళ్లంటూ జరిగితే కొన్ని కాకపోయినా కొన్నయినా బాధ్యతలు మీద పడతాయి. అప్పుడు అటు బాధ్యతలను తప్పించుకోలేం ఇటు చదవలేం" అంది స్వాతి ఏదో గొప్ప విషయం కనిపెట్టి నట్లు.

స్వాతి పెళ్లి వాయిదా వెయ్యడానికి చెప్పిన కారణం కుంటిసాకులా అనిపించింది రంగారా వుకి. దానితోపాటు అసలు సూర్యాన్ని చేసు కోవడం ఇష్టం లేదేమోనన్న అనుమానం కూడా వచ్చింది. ఆ మాటే అడిగేశాడు కూతుర్ని.

"నీకు చదువుకోవాలని ఉందంటే ఐదు సంవత్సరాలు ఆగాడు సూర్య నీ కోసం. ఇప్పుడు చిన్నపిల్లలా మారాం చేస్తే ఎలా? అసలు సూర్యని చేసుకోవడం నీకు ఇష్టమా కాదా తేల్చి చెప్పు ముందు" అన్నాడు.

"అబ్బే అటువంటిదేం లేదు నాన్నగారూ! మావయ్యంటే నాకు ఇష్టమే! కేవలం పి.జి చేద్దామన్న ఆశతోనే ప్రస్తుతం వద్దంటున్నాను పెళ్లి" అంది స్వాతి అమాయకంగా ముఖం పెట్టి.

"అది కాదమ్మా ఇన్నాళ్లు సంగతి వేరు. సూర్య అన్నివిధాలా జీవితంలో స్థిరపడ్డాడు. అమ్మమ్మా తాతయ్యా ఎప్పటి నుండో తొందర పెడుతున్న విషయం నీకు తెలిసిందే. నువ్వూ ప్రాజ్ఞురాలి వయ్యావు. పరిస్థితులేమిటో అర్థం చేసుకోవాలిగాని విడమర్చి చెప్పవలసిన అవసరం లేదు. ఇన్నాళ్లూ మావయ్యా, నేనూ వాళ్లకి ఎలాగో నచ్చజెప్పి ఒప్పించాం. ఇక మీదట అది సాధ్యం కాదు, అందరి మాటకేం? అసలు సూర్య ఒప్పుకుంటాడనే అనుకుంటున్నావా? " అన్నాడు రంగారావు నచ్చజెప్తున్నట్లుగా.

"వాళ్ల సంగతేమో గాని సూర్య మావయ్యను ఒప్పించగలననే ధైర్యం నాకుంది" అంది స్వాతి.

"సరే, నీ ఇష్టం స్వాతీ! ఇన్నాళ్లూ వాళ్లకి నేను సమాధానం చెప్తూవచ్చాను. ఇక మీదట ఆ బాధ్యతంతా నీదే. వాళ్లకి ఎలా చెప్పి ఒప్పిస్తావో ఆలోచించు!" అంటూ భోజనం ముగించి వెళ్లిపోయాడు రంగారావు, ఆ పై మాటలు పొడిగించడం ఇష్టం లేనట్లు.

జానకమ్మకయితే మతి పోయినట్లయింది కూతురి మాటలు విన్నాక. రేపో, ఎల్లుండో పిన్నీ సూర్య వస్తామని కబురు పంపారు. వాళ్లకేం సమాధానం చెప్పాలీ అనే ఆలోచనలో పడిపోయింది కూతురికి ఎలా నచ్చజెప్పాలో తెలియక.

అనుకున్నట్లుగానే శాంతమ్మా, సూర్య వచ్చారు. వచ్చిన వాళ్లకు మర్యాదలు యాంత్రికంగా జరుపుతున్నదే గాని మనసులో మాత్రం చాలా బెంగగానే ఉంది. పెళ్లి విషయం అడిగితే ఏం జవాబు చెప్పాలా? అని.

ఏదో తన మాట కాదనలేక బాబాయీ, పిన్నీ, సూర్యకి స్వాతిని చేసుకోవడానికి ఒప్పుకోవడమే గాక ఇంతకాలం ఆగారు, ఇంకా రెండేళ్లు ఆగమని ఎలా చెప్పాలి? అసలీ పిల్లకు ఏం మాయరోగం? ఇంకా చదువు తాను అంటోంది? అని మనసులోనే విసుక్కుంది.

చివరికి శాంతమ్మ అడగనే అడిగింది. "అమ్మా జానకీ నీ కూతురు కోరుకున్నట్టే, ఏదో ఇంతవరకూ ఆగాం. దాని ముచ్చట కాదనలేక ఇకపై ఆ మూడు మూళ్లూ వేయించేస్తే, మా ముచ్చటా మీ బాధ్యతా రెండూ తీరిపోతాయి. ఏమంటావు? " అంది.

"నేనూ అలాగే అనుకున్నానమ్మా. కానీ మీ మనవరాలు నా మాట వినడం లేదు. అది ఎం.ఏ. చదువుతానంటోంది" అంది జానకమ్మ నసుగుతున్నట్లుగా. ఆపై సంభాషణ పొడిగించే ధైర్యం లేక పనున్నట్లు వెళ్లిపోయిందక్కడ నుంచి.

జానకమ్మ మాటలు విని శాంతమ్మ ఆశ్చర్యపోయింది మొదట. అంతలోనే మరో అనుమానం తలెత్తింది ఆమెలో. అసలీ పెళ్లి ఇష్టముందా వీళ్లకి? లేక మా కంటే మంచి సంబంధం వస్తే ఆ మాట సూటిగా చెప్పలేక ఇలా కప్పదాట్లు వేస్తున్నారా? అనుకుంది. అక్కడే కూర్చుని టిఫిన్ తింటున్న స్వాతిని అడిగేసిందావిడ.ఆగలేనట్లుగా "ఏమిటే స్వాతి మీ అమ్మ చెప్పింది నిజమేనా? " అంటూ.

"నిజమే అమ్మమ్మా! నాకు ఎం.ఏ చదవాలని ఉంది" అంది స్వాతి.

"ఇదేం విడ్డూరమే? చదివినంతమటుకు చాలదేమిటే, నువ్వేమైనా ఉద్యోగాలు చేయాలా, ఊళ్లేలాలా? " అంది ఆశ్చర్యంగా చూస్తూ.

"ఏమో, అమ్మమ్మా! ఎవరు చూడొచ్చారు? నేను ఉద్యోగాలే చేస్తానో? ఊళ్లే ఏలతానో? " అంది స్వాతి.

"పోనీ చదివితే చదివావుగానీ, ఆ చదువేదో పెళ్లయ్యాక చదువుకోరాదా? అప్పుడు మాత్రం నీకడ్డేముంది? " అంది శాంతమ్మ నచ్చజెప్తున్నట్లు.

"భలే దానివి అమ్మమ్మా. మీరంతా పెళ్ల

య్యాక చదువుకోమంటున్నారే కానీ పెళ్ల య్యాక చదువెలా సాగుతుంది అని ఒక్కరూ ఆలోచించరేం? " అంది స్వాతి ఎంతో ఆలోచ నాపరురాలిలా.

"సరే, నీతో నేనెక్కడ మాట్లాడగలను? సూర్య బయటకు వెళ్లినట్లున్నాడు. వచ్చాక వాడే తేల్చుకుంటాడు, సంగతేమిటో? " అంది శాంతమ్మ విసుగ్గా.

అసలావిడకు మొదటి నుండీ ఈ పెళ్లి ఇష్టం లేదు. తన భర్తా, కొడుకూ స్వాతే కావా లని పట్టు పట్టడంతో కాదనలేక ఊరుకుంది గానీ ఆవిడకు స్వాతిని చేసుకోవడం అస్స లిష్టం లేదు. సూర్యకి తన అన్న కూతురు నీలవేణిని చేయాలని ఎంతో ఆశ ఆవిడకు. కానీ సూర్య స్వాతిని కోరుకోవడంతో కిమ్మన లేదు ఆవిడ! ఇప్పుడు స్వాతి ఇలా మాట్లాడ టం ఇంకా నచ్చలేదావిడకు.

సూర్య వచ్చాక శాంతమ్మ తను విన్నదంతా చెప్పింది కొడుక్కి. ఇది సూర్య ఏమాత్రం ఊహించనిది. ఐతే అక్కయ్యా కూడా కూతురి ఇష్టాన్ని వ్యతిరేకించక పోవడం మరింత ఆశ్చ ర్యాన్ని కలిగించింది. చివరికి ఒంటరిగా స్వాతిని పిలిచి అడిగాడు సూర్య.

"ఏం స్వాతీ... అమ్మ చెప్పింది నిజ మేనా? " అంటూ.

"అవును మావయ్యా నాకింకా చదవాలని ఉంది" అంది స్వాతి.

"స్వాతీ, అందరూ అన్నమాటే నేనూ అంటున్నాననుకోకు. నువ్వు చదవాలనుకు న్నంత కాలం చదువుకో, నేను కాదనను. కానీ దానికీ పెళ్లికీ లంకె పెట్టకు. ఇంత కాలం నీ మాట నేను విన్నాను. ఇప్పుడు నా మాట నువ్వు కాదనకూడదు!" అన్నాడు సూర్య నచ్చ జెప్తున్నట్లుగా.

"అందరూ అన్నమాటే అంటూ నా ముందరి కాళ్లకు బంధం వేస్తున్నావా మావయ్యా. కానీ ప్రస్తుతానికి నీ మాట కాదంటున్నందుకు నన్ను మన్నించు... నా కోసం ఇంత కాలం ఆగినవాడివి, మరో రెండేళ్లు ఆగలేవా? ఈ రెండేళ్లూ పోతే నేను కూడా ఎం.ఏ పాసై నీలా లెక్చరర్‌ని కావా లని నా ఆశ. అసలు నాకు మొదటి నుండీ టీచింగ్ ప్రొఫెషన్ అంటే ఇష్టం. లెక్చరర్‌గా



నీ అనుభవాలు విన్నాక అది మరింత బల పడింది. మనిద్దరం ఉద్యోగస్తులమైతే లైఫ్ ఎంత బాగుంటుందో ఎప్పుడైనా ఆలోచిం చావా? ఒకసారి ఊహించి చూడు. నేను చెప్పిందాంట్లో వాస్తవం కనిపిస్తుంది" అంది స్వాతి ఊరిస్తున్నట్లుగా.

"పిచ్చి స్వాతీ! లైఫ్ ఎంజాయ్ చేయడానికి సంపాదన ఒకటే ముఖ్యమంటావా? దాని కోసం ఎంత విలువైన సమయాన్ని మనం కోల్పోతామో నీకు అర్థం కావడం లేదా? మా అమ్మా నాన్నలు మనవడిని ఎత్తుకోవాలని తహతహ లాడిపోతున్నారు. నువ్వేమో ఇలా

అంటున్నావు. ఎలా స్వాతీ నీతో? " అన్నాడు సూర్య నిష్ఠూరంగా.

"చూశావా, అమ్మమ్మా తాతయ్యల ఆశలు ఏమిటో నువ్వే చెప్తున్నావు. అందుకే పెళ్ల యితే చదువెలా సాగుతుంది. వద్దు అంటున్నాను నేను!" అంది లా పాయింట్ తీసిన ట్లుగా నవ్వేస్తూ.

"నీ ఇష్టం స్వాతీ. ఎందుకనో గానీ నువ్వే మడిగినా కాదనాలనిపిం



చదు, కానీ ఈ సారి మన పేరెంట్స్‌ని దృష్టిలో ఉంచుకొని మరో మారు ఆలోచించమని చెప్తున్నానంతే!" అంటూ సమాధానానికి ఆశించకుండా అక్కడి నుండి వెళ్లిపోయాడు సూర్య.

సూర్య అలా బాధగా అని వెళ్లిపోవడంతో స్వాతి ఆలోచనలో పడిపోయింది నేను తప్పు చేస్తున్నానా అని. కాని మాలతితో తనకి గల గాఢమైన స్నేహబంధం వీటినన్నింటినీ తేలికగా తీసుకునేలా చేస్తున్నది స్వాతిని.

ఒకనాడు కాలేజీలో చేరి చదువుకునే అవకాశం వచ్చినా నేను చదువు మానేస్తున్నాని తెలిసి స్వాతికి లేని చదువు నాకు కూడా వద్ద నేసింది మాలతిని చాలా తేలికగా. అలాంటి మాలను వదిలి ఈ రోజు నేను పెళ్లి చేసుకోవాలా? అది జరగని పని అనుకుంది. అందుకే ఎవరెన్ని విధాలుగా చెప్పినా స్వాతి తన నిర్ణయం మార్చుకోలేకపోయింది.

"ఏరా, ఏమంటోంది స్వాతి? " అనడిగింది శాంతమ్మ. కళ్లకి చేతులడ్డం పెట్టుకొని పడుకున్న కొడుకు దగ్గరకు వచ్చి

"ఏముంది. మామూలే, ఇంకా చదువుతానంటోంది" అన్నాడు సూర్య ముక్తసరిగా.

"సూర్యా, నేనో మాట చెప్తాను, తప్పుగా అనుకోవుకదా. ఎందుకురా వద్దు పొమ్మన్నా దీని వెంటపడతావు. ఎన్నాళ్లిలా బ్రహ్మచారిగా ఉండిపోతావు. హాయిగా మన నీలవేణిని..." అంటున్న శాంతమ్మ మాటలను మధ్యలోనే కట్ చేస్తూ

"అమ్మా! నీకు చాలా సార్లు చెప్పాను. నీలవేణి సంగతి నా దగ్గర ఎత్తొద్దని. అమ్మా ప్లీజ్, నన్ను కాసేపు ఒంటరిగా ఉండనీ" అన్నాడు సూర్య విసుగ్గా.

"బాగుందిరా వరస! ఇంత చేసినా దాన్నేమీ అనలేవు గానీ నీ విసుగంతా నా మీదా చూపించేది? " అంది విసురుగా శాంతమ్మ.

ఈసారి సూర్య ఎన్నో ఊహించుకొని వచ్చాడిక్కడికి. కానీ స్వాతి వైఖరి సూర్యాన్ని ఎంతో నిరాశకు గురి చేసింది. స్వాతి అంటే నాకు పంచప్రాణాలు. మరి స్వాతికి నేనంటే అభిమానం లేదా అసలు? అసలే మాత్రం నా ఫీలింగ్స్‌ని పట్టించుకోదేం? ఉత్తరాల్లో అంత ప్రేమని కుమ్మరించే స్వాతి దగ్గరకొచ్చాక ఎందుకిలా ప్రవర్తిస్తుంది. ఈ ఐదు సంవత్సరాలుగా తన కోసం ఎంత ఓపిక పట్టాను నేను? అదే మాత్రం గుర్తించకుండా తన ధోరణి తనదే అన్నట్లు. ఎన్నాళ్లిలా? అసలు అక్కా, బావగారూ ఎలా ఊరకున్నారు ఇది విని?

హఠాత్తుగా సూర్యకి చాలా కాలం క్రితం చూసిన హిందీ సినిమా "ఉపహార్" గుర్తుకొచ్చింది. అందులో జయబాధురి ఇలాగే వయసు వచ్చినా పసితనం వీడనట్లుగా చాలా ఇన్నోసెంట్‌గా ఉంటుంది. పెళ్లయినా అదే తీరు. భర్త, సంసారం, ప్రేమా, అనురాగం లాంటి ఆలోచనలే కలగవు. భర్త దూరదేశం వెళ్లిపోతూ కనీసం ఓ ముద్దన్నా ఇమ్మంటే ప్రయత్నిస్తుంది. కాని, ఇవ్వలేక పకపకా నవ్వుతుంది. భర్త బాధపడతాడని ఏ మాత్రం ఆలోచించదు. అసలు చివరికి భర్త వెళ్లిపోయాక జయబాధురిలో కదలిక మొదలవుతుంది. చిరుగాలిలా మొదలైన ఆ ప్రేమ చివరికి ప్రభంజనంలా ముంచెత్తుతుంది ఆమెను.

స్వాతి మాటలు వింటూంటే ఆ సినిమాలోని జయబాధురే గుర్తుకు వస్తుంటుంది సూర్యకెప్పుడూ. పసిపిల్లలా అమాయకంగా చూసే స్వాతిని అందుకే ఏ మాత్రం నొప్పించలేడు సూర్య.

అయితే స్వాతి మాటలతో దెబ్బతిన్నట్లయిన సూర్య మాట్లాడకుండా మౌనంగా ఉంటే ఏమైనా మార్పు వస్తుందేమోనని ఎదురు చూశాడు ఒక రోజంతా. కానీ ఫలితం ఏమీ లేకపోవడంతో తాను ఊరికి వెళ్తున్నానని స్వాతికి చెప్పకుండానే వెళ్లిపోయాడు.

దాంతో సూర్యకి బాగా కోపం వచ్చిందని గ్రహించిన రంగారావు కూతుర్ని ఒప్పించలేకపోవడం తన అసమర్థతగా భావించి బాధపడ్డాడు.

* * *

ఎవరి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేనట్లుగా స్వాతి ఎం.ఏ.లో జాయిన్ అయిపోయింది. ఆ రోజు మాలతి ఇంటి నుండి కోపంగా వచ్చేసిన స్వాతి బింకంగా వారం రోజుల పాటు మాలతి ఇంటివైపు వెళ్లకుండా ఉండిపోయింది అతి కష్టం మీద.

తల్లి అనారోగ్యం మూలంగా మాలతి వచ్చి స్వాతిని కలవలేకపోయింది.

ఆ రోజు ఏదో ప్రైవేటు కంపెనీలో ఉద్యోగానికి అపాయింట్‌మెంట్ ఆర్డరు రావడంతో

## గ్యాస్ట్రిక్ బ్యాండ్

"స్థూలకాయమా? " అయితే ఫలానా ఒబెసిటీ క్లినిక్కులో ఇన్నిరోజుల ట్రీట్‌మెంట్ తీసుకోండి... ఎందుకూ... రెగ్యులర్‌గా వాకింగ్, యోగా, డైటింగ్ చేస్తే పీపాలా వుండే దేహం... పుల్లలా తయారవదూ... ఫలానా ఆయిల్ అప్లయ్ చెయ్యండి, ఫలానా ఎలక్ట్రికల్ బ్యాండ్ బాడీకి కట్టుకోండి... ఇలా రకరకాల ప్రకటనలు టి.వి. ఆన్ చేస్తే విదేశీ వనితలు తెలుగు డబ్బింగ్‌తో మాట్లాడటం కుప్పతెప్పలుగా కనిపిస్తుంటాయి, వినిపిస్తుంటాయి. ఇవన్నీ విని విని ఏంచేయాలో, ఏం వాడాలో తెలియక అయోమయంలోపడి జుట్టు పీక్కొనే వాళ్లెందరో. అవన్నీ పక్కనపెట్టి మా మాట వినండి అంటున్నారు అమెరికాలోని 'ఇలినాయిస్ యూనివర్సిటీ' వాళ్లు. వాళ్లు కొత్తగా గ్యాస్ట్రిక్ బ్యాండు అనే దాని కనుగొన్నారు. ఇది క్లాంప్‌లాగా ఉంటుంది. దీనిని నడుము భాగంలో పెరిగిపోయిన భాగాలకి బిగిస్తే, క్రమంగా అధిక బరువు తగ్గటమేకాక, అధికంగా తినే ఆహారాన్ని కూడా క్రమబద్ధీకరిస్తుందట.

ఆమెరికాలో దాదాపు 1000 మంది ఈ గ్యాస్ట్రిక్ బ్యాండు ధరించి, 50% అధిక బరువుని అతితక్కువ కాలంలో... కరిగించుకోగలిగామని చెప్తున్నారు.

ఎలా? అంటే... ఎలా... మనమూ ట్రై చేద్దాం.



ఆపుకోలేని ఆనందంతో స్వాతి దగ్గరకు పరుగున వచ్చింది మాలతి తన సంతోషాన్ని స్నేహితురాలితో పంచుకొనేందుకు. స్నేహితురాలిని చూడడంతోనే వెలుగొచ్చేసింది స్వాతి ముఖంలోకి.

అదేం పైకి కనిపించకుండా జాగ్రత్త పడుతూ, "ఓహో మాలతిదేవిగారు దారి తప్పి వచ్చినట్లున్నారే ఇటూ!" అంది వెటకారంగా.

"నేనెప్పుడూ దారి తప్పను. నా దారెప్పుడూ రహదారే, చూడు నాకు అపాయింట్ మెంట్ ఆర్డరు వచ్చింది!" అంటూ కవర్ తీసి స్వాతి చేతిలో పెట్టింది. దాంతో పాత కోపాలన్నీ పక్కకు నెట్టేసిన స్వాతి "నిజంగానా? కంగ్రాట్యులేషన్స్" అంది స్వాతి షేక్ హేండిస్తూ.

విషయం విన్న జానకమ్మ కూడా తన ఆనందాన్ని వ్యక్తం చేసింది.

ఇద్దరూ స్థిమితపడ్డాక "ఊ, ఏమిటే విశేషాలూ? మావయ్య వెళ్లిపోయారా? " అంది మాలతి తమ మధ్య ఏమీ జరగనట్లుగా.

"నా దగ్గరేముంటాయి విశేషాలు? నేను ఎం.ఏ. లో జాయినయ్యాను. మావయ్య మాత్రం చాలా కోపంగానే వెళ్లినట్లున్నాడే మాలతీ! వెళ్ళేముందు నాతో చెప్పకుండానే వెళ్లిపోయాడు" అంది స్వాతి చిన్నపిల్ల కంప్లయింటు చేస్తున్నట్లు.

"రాదా మరి? ఎంత ఏడిపిస్తున్నావే మావయ్యని నువ్వు? " అంది మాలతి విసుగ్గా స్నేహితురాలి నెత్తిన మొట్టికాయవేస్తూ.

"ఏం చేయనే మాలతీ! మావయ్య బలహీనత నేనైతే, నా బలహీనత నువ్వు. నీ స్నేహమూనూ మీ అందరికీ నా మాట పిచ్చిగా అనిపించవచ్చు. కానీ ఎంత ప్రయత్నించినా నా వల్ల కాలేదే మాలతి నిన్ను విడిచి వెళ్లడం!" అంది కళ్ళలో నీళ్లు తిరుగుతుండగా స్వాతి.

"మొద్దూ... అదే వద్దన్నది, ఇప్పుడిలా అంటున్నావు. ఒకవేళ నేనే నిన్ను విడిచి ఎక్కడికన్నా వెళ్లిపోతే, లేక ప్రమాదవశాత్తూ చచ్చిపోతే" అంటున్న మాలతి నోరు మూసేసింది స్వాతి.

"ఒద్దే మాలతీ! సరదాకి కూడా అలా అనకు, నేను భరించలేను. నువ్వు లేని మరుక్షణం స్వాతి కూడా ఈ భూమి మీద ఉండదు, గుర్తుంచుకో!" అంది స్వాతి మాలతిని హత్తుకుపోతూ.

"ఎందుకే స్వాతీ, ఇంత ప్రేమ నీకు నేనంటే. సారీనే, అందరిలాగే నీ మాటలు కొట్టిపారేస్తూ నిన్ను చాలా బాధించాను. నా కోసం నీ భవిష్యత్తు పాడు చేసుకోకూడదనే ఆరాటంతో అలా మాట్లాడాను!" అంది మాలతి సంజాయిషీ ఇస్తున్నట్లుగా.

"పోన్లేవే, ఇప్పటికైనా అర్థం చేసుకున్నావు. అదే చాలు!" అంది స్వాతి ఆనందపడిపోతూ.

మాలతి వెళ్లిపోయాక సూర్యకి ఫోన్ చేసింది స్వాతి. "హలో మావయ్యా... ఎలా ఉన్నావు? " అంటూ.

"నీ దయ వలన బాగానే ఉన్నాను" అన్నాడు సూర్య ముక్తసరిగా.

"ఏమిటి మావయ్యా, నా మీద కోసం పోలేదా సరేగానీ నీకో శుభవార్త!" అంది స్వాతి ఊరిస్తున్నట్లుగా.

"ఏమిటి, మన పెళ్లికి ముహూర్తం పెట్టిస్తున్నావా? " అన్నాడు సూర్యం.

"పెళ్లి తప్ప మరేం శుభవార్తలుండకూడదా? " అంది స్వాతి చిరాగ్గా.

"నాకు శుభవార్తంటే, పెళ్లేనేమో అనుకున్నాను. సరే చెప్పు, అంత గొప్ప శుభవార్త ఏమిటో? " సూర్య గొంతులోని ఎగతాళిని ఏ మాత్రం పట్టించుకోకుండా. "మాలతికి జాబ్ వచ్చింది మావయ్యా. జీతం మూడు వేలు!" అంది.

"సంతోషం, అయితే నా తరపున నువ్వు కంగ్రాట్సు చెప్పు మాలతికి" అన్నాడు సూర్య కాస్త మెత్తబడినట్లుగా.

అప్పుడంది స్వాతి "ఎందుకు మావయ్యా, నాతో చెప్పకుండానే వెళ్లిపోయావు? " నిష్ఠూరంగా అడిగింది.

"ఆ సంగతి నేనిక్కడికి వచ్చిన వారం తరు

వాత గుర్తించావా, థేంక్స్, ఇప్పటికైనా గుర్తించినందుకు!" సూర్య ఎగతాళిగా అన్నాడు.

"సారీ మావయ్యా, ఈ సారికి క్షమించెయ్యవా, అసలు నీకు ఈ వారం రోజులుగా ఫోన్ ఎందుకు చెయ్యలేదో తెలుసా? నీతో మాట్లాడ్డానికి ధైర్యం చాలక. ఇప్పుడు మాలతి ఉద్యోగం వంక పెట్టుకొని ఫోన్ చేశానంతే!" అంది స్వాతి చిన్నగా నవ్వుతూ. ఆ మాటలు చల్లని పిల్లతెమ్మెరలా తాకాయి సూర్యకి. దాంతో ఐస్ అయిపోయాడు.

"నేను కూడా చేద్దామనే అనుకున్నాను. కానీ మరీ వెంటబడినట్లుంటుందని చెయ్యలేదంతే!" అన్నాడు సూర్య నవ్వేస్తూ. ఇద్దరి మనసులూ తేటపడినట్లయ్యాయి.

"పోన్లే కోపం పోయిందంతే చాలు నాకు. నేను యూనివర్సిటీలో జాయినయ్యాను మావయ్యా. కాలేజీ ఎట్మాస్ఫియర్‌కీ, యూనివర్సిటీ ఎట్మాస్ఫియర్‌కీ చాలా తేడా ఉంది!" అంటూ తన అనుభవాలన్నిటినీ ఏకరువు పెట్టింది స్వాతి చిన్నపిల్లలా ఉత్సాహంగా. అవన్నీ ఓపిగ్గా వింటూ ఉండిపోయాడు సూర్య.




మాలతి స్టెనోగా ఉద్యోగంలో జాయిన్ అయింది. స్వాతి యూనివర్సిటీకి వెళ్లివస్తోంది. ఇద్దరి దార్లూ వేరైనా రోజుకు ఒకసారైనా ఏదో సమయంలో కలుసుకోవడం గానీ, కనీసం ఫోను చేసుకొని మాట్లాడుకోవడం గాని చేస్తూంటారిద్దరూ.

సూర్య నుండి మునుపటిలా తరచూ ఉత్తరాలు రావడం లేదు. అతని మనసు కష్టపెట్టినందుకు పరిహారంగా స్వాతే తరచూ ఉత్తరాలు రాస్తోంది సూర్యకి.

రోజులు, వారాలుగా, వారాలు, నెలలుగా గిర్రున సంవత్సర కాలం తిరిగిపోయింది.

తండ్రి కమల పెళ్లి కోసం చేసిన అప్పుల్లో కొంత భాగం మాలతి తనకు వచ్చిన జీతంతో తీర్చింది.

కమల ఆడపడుచు పెళ్లికి విజయవాడ రమ్మని, మాలతికి, స్వాతికి ఇన్విటేషన్స్ పంపింది కమల.

స్వాతి పరీక్షల మూలంగా పెళ్లికి వెళ్లలేకపోయింది. మాలతితో పాటు స్వాతి లేకుండా తానొక్కతీ పెళ్లికి వెళ్లడం ఇష్టం లేకపోయినా విశ్వనాథం, ఇందిరమ్మలకు కూడా కుదరకపోవడంతో తప్పనిసరై ఒంటరిగానే బయలుదేరింది మాలతి, పెళ్లి మరునాడు జరుగుతుందనగా. మాలతిని చూడడంతోనే ఆప్యాయంగా ఎదురు వచ్చి కౌగలించుకుంది కమల.

"ఏమ్మా.. బాగున్నావా? అమ్మా, నాన్నా రాలేదా? " అంటూ కమల అత్తగారు యశోద కుశల ప్రశ్నలు వేసింది ఆప్యాయంగా.

పెళ్లిళ్ల సీజన్ కావడంతో కళ్యాణ మంటపాలెక్కడా దొరకలేదు. ఇంట్లోనే చేయవలసి వచ్చింది పెళ్లి. దాంతో చాలా హడావిడిగా ఉంది ఇల్లంతా. మాలతి చాలా పెళ్లిళ్లకు వెళ్లింది, కానీ అవన్నీ కళ్యాణ మంటపాల్లో జరిగినవే. ఇక్కడ అందుకు భిన్నంగా ఇంటి ముందే పందిరి వేసి శ్రావ్య పెళ్లి చేస్తున్నారు.

ఎక్కడ ఏ చిన్న పొరపాటు జరిగినా మగ పెళ్లివారి దగ్గర మాట వస్తుందని అంతా ఎలర్ట్‌గా ఉన్నారు. వంట వాళ్లతో దగ్గరుండి వండిస్తున్నారు. నాగభూషణంగారు పప్పు దప్పళాలు, పులిహోర తాలింపులతో గుమ్మెత్తిపోయింది ఇల్లంతా. మరోపక్క వేడివేడి బూరెలు, ఇంట్లో చేసిన వడియాలు, అప్పడాలూ వేయించి పోస్తున్నారు దస్తాగిన్నెల నిండా.

ఇంకోపక్క వేడివేడి బూందీకి జీడిపప్పు అద్ది లడ్డూలు చుడుతున్నారు. ఇంతలో మగ

పెళ్లివారు వచ్చేశారంటూ పానకాల బిందెలతో పేరంటాళ్లు కదిలారు ఎదుర్కోలు సన్నాహాలకు. మాలతి కూడా వాళ్లతో పాటు వెళ్లి శ్రావ్యకు కాబోయే భర్తను చూసి వచ్చింది. ఆ తరువాత ఏం చేయాలో తోచలేదు మాలతికి. అంతా ఎవరి హడావిడిలో వాళ్లున్నారు. కమల ఊపిరాడని పనితో సతమతమైపోతోంది. అన్నీ ఇంట్లోనే కనుక కావలసిన వస్తువులన్నీ అందరికీ అందించడం, నగలూ, బట్టలూ జాగ్రత్త చేసే పని కమల మీద పడింది. దాంతో మాలతి గూర్చి పట్టించుకునే అవకాశమే లేకపోయింది.

ఇల్లంతా అమ్మలక్కల హడావిడితో వరసైన వారి హాస్యాలతోనూ, నవ్వులతోనూ మారుమోగిపోతోంది. అత్తరు పరిమళాలతో, గులాబీలు, మల్లెల గుబాళింపులతో పట్టు చీరల రెపరెపలతో, ధగధగ మెరిసిపోతున్న నగలతో అటూ ఇటూ హుషారుగా తిరుగుతూ ఒకరినొకరు ఆప్యాయంగా పలకరించుకుంటూ గుంపులు గుంపులుగా పందిట్లో చేరి కబుర్లు చెప్పుకోసాగారంతా.

ఇవన్నీ కాసేపు సరదాగా చూసిన మాలతి తర్వాత ఏం చేయాలో తోచక కాలక్షేపం కోసం తాను తెచ్చుకున్న పుస్తకం తీసి చదువుకోసాగింది.

శశికాంత్ చిన్నాన్న కొడుకు చిరంజీవి పనుల మీద అటూ ఇటూ తిరుగుతూ, ఒంటరిగా కూర్చున్న మాలతిని చూశాడు యధాలాపంగా. అందరూ హడావిడిగా తిరుగుతూంటే మాలతి ఒక్కతీ ఏదో పరీక్షకు చదువుతున్నట్లుగా అలా పుస్తకం పట్టుకొని ఉండడం కాస్త వింతనిపించింది. అలాగే పరిసరాలు గమనించకుండా ఏదో లోకంలో ఉన్నట్లున్న మాలతిని చిన్న ఆట పట్టించాలనిపించింది.

అటుగా వెళ్తున్న ఓ చిన్నపాపని పిల్చి మాలతి ఒడిలోంచి కిందపడ్డ పర్సుని మెల్లగా సంగ్రహించాడు. చాక్లెట్ లంచంగా పెట్టి. చిరంజీవికి కమల దగ్గర కాస్త చనువు ఎక్కువే కావడంతో ఆ సాహసం చేయగలిగాడు. మాలతి పర్సుకోసం చూసుకొని కంగారుపడితే కాసేపు ఏడిపించి పర్సు తిరిగి ఇచ్చేద్దామనుకున్నాడు. అందుకే మరో గంట అక్కడే తారట్లాడాడు. కానీ మాలతి మాత్రం పుస్తక పఠనంలో పడి మిగతా ప్రపంచాన్నసలు పట్టించుకోనే లేదు.

ఇంతలో చిరంజీవి తల్లి వచ్చి "బాబూ, చెల్లాయికి పూల జడ వెయ్యాలి, కాస్త బజారుకు వెళ్లి మల్లె మొగ్గలు పట్టుకురా నాయనా!" అంది.

"అబ్బా, ఇంత ఎండలో ఎవరు వెళ్తారమ్మా! ఇంకెవర్నైనా పంపించకూడదూ?" అన్నాడు విసుగ్గా.

"బావుందిరా నీ వరస. ఇంకెవర్ని పంపనూ? మీ అన్నయ్యను గానీ, పెదనాన్నగార్ని కానీ పంపించాలి. ఇదేనేమిట్రా పెళ్లిపనుల్లో నీ సాయం. వెళ్లరా బాబూ! అసలే పెళ్లిళ్ల సీజన్. ఇంకో గంట పోతే మంచి మొగ్గ దొరకదు!" అందావిడ.

తల్లి చదివే అష్టోత్తరం వినడం కంటే బజారుకు వెళ్లి రావడమే ఉత్తమం అనుకున్న చిరంజీవి. "సరే వెళ్తానులే!" అంటూ తల్లి దగ్గర నుండి బ్యాగ్ తీసుకున్నాడు.

వెళ్తూ మాలతి వైపు ఒకసారి చూశాడు. నేరుగా వెళ్లి పర్సు మాలతి దగ్గర పెట్టే ధైర్యం లేక బయటకు వెళ్లిపోయాడు చిరంజీవి. తను బజారుకు వెళ్లాక మాలతి పర్సు కోసం చూసుకుంటే ఎంత గొడవవుతుందోనని తను చేసిన పనికి నొచ్చుకున్నాడు.

చిరంజీవి అటు వెళ్లిన కాసేపటికి మాలతి పుస్తకం చదవడం ముగించింది. చదవడం పూర్తి చేసిన చాలా సేపటివరకూ ఆ పుస్తకంలోని సంఘటనల గూర్చే ఆలోచిస్తూ ఉండిపోయింది. కొద్దిసేపు పోయాక స్నానం చేద్దామని లేచిన మాలతికి తన ఒళ్లో పెట్టుకున్న పర్సు గుర్తు వచ్చింది. "ఏమైంది పర్సు? ఒళ్లోనే పెట్టుకున్నానే" అనుకుంటూ చుట్టూ చూసింది. సూట్ కేసులో పెట్టి మర్చిపోయానేమోనని సూట్‌కేసంతా వెదికి "అక్కా, నా

పర్సు చూశావా? " అనడిగింది.

"లేదే, నేనసలు ఇక్కడ నుండి కదలనే లేదు ఈ పూట!" అంది కమల.

"మరైతే ఏమయినట్లు? " అంది మాలతి ఆలోచనగా.

"కంగారు పడకుండా ఎక్కడ పెట్టావో గుర్తు చేసుకోవే!" అంది కమల.

"లేదక్కా, నాకు బాగా గుర్తు. మధ్యాహ్నం భోజనమయ్యాక పుస్తకం చదువుతూ అక్కడే కూర్చున్నాను, పర్సు నా ఒళ్లో పెట్టుకొని" అంది మాలతి కంగారుగా.

"పోనీ నీ దగ్గరకెవరైనా వచ్చి కూర్చున్నారా? బాగా గుర్తు చేసుకో!" అంది కమల.

"అబ్బే, ఎవరూ రాలేదు. ఆ, ఒక చిన్న పాప వచ్చింది. నీ గాజులు చాలా బాగున్నాయక్కా అంటూ గాజులు సవరిస్తూ కూర్చుంది. నా గాజులు సవరిస్తూ మరి ఎప్పుడు వెళ్లిపోయిందో పుస్తకం ధ్యాసలో పడి గమనించలేదు. అయినా అంత చిన్న పిల్లకు పర్సుతో ఏం పని? " అంది మాలతి ఆశ్చర్యంగా.

"బాగుందే, ఒంటి మీద తెలివి లేకుండా కూచున్నదే కాక పర్సుతో చిన్న పిల్లకేం పని అంటున్నావు. ఎవరైనా తీయించి ఉండవచ్చు. లేక నీ గాజుల్లాగే పర్సు కూడా నచ్చి, ఆడుకునేందుకు పట్టుకెళ్లి ఎక్కడో పడేసి ఉండవచ్చు. ఇంతకీ ఎంతుందేమిటి అందులో? " అంది కమల.

"మీ ఆడపడుచుకు చదివించమని నాన్నగారిచ్చిన వెయ్యి రూపాయలూ, నా ఖర్చులకని ఉంచిన ఐదు వందలూ, మొత్తం పదిహేను వందలుండాలి అందులో" అంది మాలతి నీరసంగా.

"అసలంత డబ్బు పర్సులో పెట్టమని ఎవరు చెప్పారే? సరే, అయిందేదో అయింది. ఇంకేం గొడవ చెయ్యకు, మా అత్తగారు వింటే బాధపడతారు. నేను, మీ బావగారితో మెల్లగా చెప్తానులే. ఎలాగో సర్దుబాటు చేస్తారంతా. నువ్వు పర్సు పోయిందని ఎవరితోనూ అనకు. అదో అప్రతిష్ట!"అంది కమల.

అటుగా వచ్చిన చుట్టాలామె కమల మాటలు విన్నది. "ఎవరి పర్సు పోయింది కమలా? " అంటూ అడగనే అడిగింది.

ఇష్టం లేకపోయినా పర్సు సంగతి చెప్పక తప్పలేదు కమలకి. ఆ వార్త క్షణంలో పందిరంతా పాకిపోయింది. ఎవరికి వారే తమని అవతలివారు ఎక్కడ అనుమానిస్తారోనని భుజాలు తడుముకుంటూ కమల దగ్గరకొచ్చి ఎలా పోయిందీ తెలుసుకొని తమ సానుభూతి వ్యక్తం చేస్తున్నారు.

అసలే పని వత్తిడిలో ఉన్న కమలకు ఇది మరింత చికాకు కలిగించింది. ఎలాగో వాళ్ల నుండి తప్పించుకొని మాలతిని అక్కడ వదిలేసి వెళ్లిపోయింది.

ఆ వచ్చే వాళ్లెవరో ఏమిటో తెలియకపోయినా తప్పనిసరిగా మాలతి జవాబు చెప్పక తప్పడంలేదు. పర్సుపోయి విచారంగా ఉన్న మాలతికి అంతకు మించిన బాధను కలిగించింది అమ్మలక్కల పరామర్శలు. అదీగాక ఆ పర్సు మాలతి పుట్టినరోజు కానుకగా స్వాతి ఇచ్చింది. అందులో డబ్బుతోపాటు అదేరోజు స్వాతితో తీయించుకున్న ఫొటో కూడా ఉంది.

పందిట్లో ఈ గొడవంతా జరుగుతుండగానే చిరంజీవి బజారు నుండి వచ్చాడు. కానీ అంత గోలలో ఆ పర్సు తన దగ్గరే ఉందంటూ ఇవ్వలేకపోయాడు. ఇలాంటప్పుడు ఆ పర్సు ఇస్తే "ఇది నీ దగ్గరకెలా వచ్చింది? " అని అందరూ యక్ష ప్రశ్నలతో తనమీద దాడి చేస్తారని భయపడ్డాడు. తను చేసిన చిలిపి పని మూలంగా ఆ అమ్మాయి ఎలాంటి ఇబ్బందికి గురైందీ? అని వాపోయాడు. ముక్కూమొహం తెలియని పరాయి అమ్మాయి పట్ల అంత చొరవ తీసుకున్నందుకు తనని తనే తిట్టుకున్నాడు.

రాత్రి భోజనాల వేళ పందిరంతా కోలాహలంగా ఉంది. ఆ హడావిడికి కాస్త ఎడంగా నుంచుంది మాలతి. ఎవరో వచ్చి మాలతిని భోజనానికి రమ్మని పిలిచారు. కానీ మాలతి

తనకి ఆకలి లేదంటూ వచ్చిన వాళ్లను పంపించేసింది. ఆ వచ్చినావిడకు మాలతి పర్సు పోయిన సంగతి తెలుసు. అందుకే భోజనం మానేస్తోందని గ్రహించి పెళ్లికూతు రికి పూలజడ వేస్తున్న కమల దగ్గర కెళ్లి చెప్పింది ఆ సంగతి.

కమల ఆ పని మరొకరికి అప్పగించి మాల తిని వెదుక్కుంటూ వచ్చింది. "మాలతీ! భోంచేద్దాం రావే!" అంటూ.

"నాకు ఆకలిగా లేదక్కా, నువ్వు తినెయ్!" అంది మాలతి.

"ఆకలి లేకపోవడానికి ఏం తిన్నావని? లే, నా కవతల చాలా పని ఉంది" అంది కమల తొందరపెడుతున్నట్లుగా.

"అబ్బ, పనుంటే నువ్వెళ్లి తిను. నాకాకలిగా లేదంటూంటే వినవేం?" అంది మాలతి విసుగ్గా.

"నీకు ఆకలి ఎందుకు లేదో నాకు తెలు సులే. నీ పర్సు పోయిందనేగా ఈ బెంగం తా. మరేం పర్వాలేదులే? మీ బావగారితో జరిగిందంతా చెప్పాను. ఆయనంతా చూసు కుంటానన్నారు. నువ్వింకే దిగులూ పెట్టుకో కుండా భోజనానికి రా!" అంటూ చెయ్యి పట్టి లాగింది కమల.

"అబ్బ, ఇప్పుడు డబ్బు గురించి ఎవరేడ్చారే తల్లీ, నిజంగానే నాకాకలి లేదు!" అంటూ గబ గబా డాబా మెట్లెక్కి మీదకు వెళ్లిపోయింది మాలతి. చేసేదేం లేక వెనుదిరిగింది కమల.

కమల వచ్చి బతిమిలాడ్డం, మాలతి కోపంగా వెళ్లిపోవడం, అంతా చూస్తూనే ఉన్నాడు చిరంజీవి. మాలతి ఒంటరిగా ఉన్న సమయం చూసి జరిగిందంతా చెప్పి పర్సు తిరిగి ఇచ్చేయ్యాలని చాలా సేపటినుండీ ప్రయత్నం చేస్తున్నాడు. కానీ సాధ్యం కాలేదు. ఇప్పుడు మాలతి డాబా మీదకు వెళ్ల డంతో మెల్లగా తానూ వెళ్లాడు.

అక్కడ పిల్లలంతా చేరి గోలగా ఆడుకుంటు న్నారు. పిట్టగోడ నానుకొని తోరణాలు కట్టిన ట్లుగా ఉన్న స్ట్రీట్‌లైట్ల వంక చూస్తూ ఆలోచ



**ఆరు రాట్నాలు.. అరడజను గోచీలు!**

రెండో రౌండ్ టేబుల్ సమావేశానికి ఓడలో వెళ్తున్న గాంధీని మార్సెల్స్‌లో ఫ్రెంచి కస్టమ్స్ అధికారులు సోదాచేశారు. అప్పుడాయన వారితో సరదాగా-

'నేనో పేద భారతీయుడిని. నాదగ్గరున్న దల్లా ఆరు రాట్నాలు, జైలుకూడు తినే చిప్పలు, మేకపాలకు ఓ క్యాను, స్వయంగా మగ్గంపై నేసిన ఆరు గోచీలు, రెండు అంగవస్త్రాలు.. ఇవికాక దేశ ప్రజలిచ్చే కొద్దిపాటి గౌరవ మర్యాదలు.. వీటిని ఇంకేం తనిఖీచేస్తారు?' అన్నారు.

నలో మునిగిపోయింది మాలతి.

పరధ్యానంగా ఉన్న మాలతి తన పక్కన చిరంజీవి వచ్చి నిలుచున్న సంగతి గమనించ లేదు. కాసేపు, ఆమె తల తిప్పి చూస్తుందేమో నని చూశాడు చిరంజీవి. కాని అసలు మాలతి అదేం పట్టించుకోలేదు.

అది చూసి చిన్నగా నవ్వుతూ, "మీరేదైనా ధ్యాసలో పడితే ఇక పరిసరాలనే గమనించర నుకుంటా" అన్నాడు చిరంజీవి.

హఠాత్తుగా పక్కనుండి మాటలు వినిపిం చడంతో ఉలిక్కిపడి చూసింది మాలతి. చుట్టూ పిల్లలు తప్ప ఎవరూ లేకపోవ

డంతో ఆ మాటలు తనని ఉద్దేశించే అన్నట్లుగా గ్రహించి ప్రశ్నార్థకంగా చూసింది అతని వైపు.

"క్షమించండి, నేనెవరో తెలియదు కదా. మీ బావగారు శశికాంత్ చిన్నాన్న గారబ్బాయిని. నా పేరు చిరంజీవి, నేను గుంటూరు హిందూ కాలేజీలో హిందీ లెక్చరర్‌గా పని చేస్తున్నాను" అన్నాడు తనని తను పరిచయం చేసుకుంటూ.

"ఇప్పుడు మీతోనూ, మీ వివరాలతోనూ నాకేమిటి సంబంధం?" అన్నట్లు విసుగ్గా చూసింది మాలతి.

"అలా కోపంగా చూడకండి. మీరలా విజయవాడ నగర సౌందర్యం వీక్షిస్తుండగా నేనిక్కడికి వచ్చాను. నేను వచ్చి మీ పక్కన నుంచుని పది నిమిషాలయింది. అయి నా మీరు గమనించలేదు. బహుశా మీరిలా పరధ్యానంగా ఉన్నప్పుడు ఎవరో మీ పర్సు కొట్టేసి ఉంటారు" అన్నాడు చిరంజీవి.

పర్సు మాట చిరంజీవి కూడా ఎత్తడంతో అసలే విసిగి ఉన్న మాలతి "కొట్టేస్తే కొట్టేశారు. నేనేం మిమ్మల్ని వెదికి పెట్టమనలేదే! దయచేసి ఈ ప్రసంగం ఇంతటితో కట్టిపెట్టి మీరు వెళ్తే నాకెంతో ఉపకారం చేసినట్లు భావించి సంతోషిస్తాను" అంది విసుగ్గా.

"వెళ్లిపోతాను గానీ కోప్పడకండి, మీ పర్సు నాకు దొరికింది. అది చెప్దామనే వచ్చాను. వద్దంటే వెళ్లిపోతాను" అన్నాడు చిరంజీవి పెదాల మధ్య నవ్వు బిగబట్టి, తను నవ్వితే మాలతికి మరింత కోపం వస్తుందని.

"నిజంగా..." అని ఆగిపోయి అంతలోనే అనుమానం వచ్చి



"అవునూ నా పర్సు మీకెలా దొరికింది? నేనె క్కడా పారేసుకోలేదే. దాన్నెవరో కొట్టేశారు. అది మీకెలా దొరికింది? " అంది ప్రాసిక్యూషన్ లాయరులా మాలతి.

"మీరు కోపగించుకోనంటే నిజం చెప్తాను. లేకపోతే అబద్ధం చెప్తాను" అన్నాడు చిరంజీవి తోటరాముడి ఫోజులో.

పోయిందనుకున్న పర్సు దొరికిందని వినడంతో సగం చికాకు మర్చిపోయింది మాలతి. కాని అతనితో అట్టే మాటలు పొడిగించడం ఇష్టం లేక "అదేదో త్వరగా చెప్పి నా పర్సు నాకివ్వండి, నాకసలే చాలా ఆకలిగా ఉంది" అంది మాలతి.

"బాగుందండీ, ఇప్పటి దాకా ఆకలి లేదంటూ పిలవడానికి వచ్చిన వాళ్లందరినీ తిప్పి పంపారు, ఇప్పుడు పర్సు దొరికిందనగానే ఆకలేసిందా? " అన్నాడు చిరంజీవి పరిహాసంగా.

"అయితే ఇది అక్క పనన్నమాట, పర్సు దొరికిందని నన్ను మాటల్లో పెట్టి భోజనానికి లాక్కు రమ్మని మిమ్మల్ని పంపిందా? " అంది మాలతి ఉక్రోషంగా చూస్తూ.

"అబ్బెబ్బే కోపగించకండి. ఇందులో ఆమె ప్రమేయం ఏమీ లేదు. సరే ఇప్పటికే మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టాను. దయచేసి నన్ను క్షమించండి. నిజంగానే మీ పర్సు నా దగ్గరుంది" అంటూ జేబులోంచి పర్సు తీసి ఇస్తూ జరిగిందంతా చెప్పి "అనవసరంగా మిమ్మల్ని అల్లరి పాలు చేశాను. ఇంత జరుగుతుందని తెలిస్తే ఇలా చేసేవాడిని కాదు!" అంటూ మరోమారు క్షమాపణ చెప్పాడు చిరంజీవి.

అంత అల్లరి పని చేసినా అతను పర్సు తిరిగి తనకిచ్చేందుకు పడిన తాపత్రయాన్ని, అతని కంఠంలో ధ్వనిస్తున్న నిజాయితీని శంకించలేకపోయింది మాలతి.

"పోనీలెండి, జరిగిందేదో జరిగింది. నా పర్సు నాకు తిరిగి చేర్చినందుకు థాంక్స్!" అంది మాలతి మనస్ఫూర్తిగా.

"థాంక్సు నేనే చెప్పాలి మీకు. ఎందుకంటే ఇంత గొడవకూ, మనస్తాపానికీ గురి చేసినా మీరు నన్నేమీ అననందుకు" అన్నాడు చిరంజీవి. ఆ మాటలు విని నవ్వేస్తూ "మీరు భలే ఫన్నీగా మాట్లాడుతారే!" అంది మాలతి.

"ఆ మాత్రం మాటకారితనం లేకపోతే మీలాంటి స్టూడెంట్స్ మమ్మల్ని బతకనిస్తారా? " అన్నాడు చిరంజీవి.

"స్టూడెంట్సుంటున్నారు. మీరు లెక్చరరా? ఓ ఇందాక చెప్పారు కదూ. నేనే మర్చిపోయాను. అయినా నేనేం స్టూడెంటును కాను లెండి. ఏదో పొట్టకూటి కోసం చిన్న జాబ్ చేస్తున్నాను" అంది మాలతి.

"నిజం? అప్పుడే ఉద్యోగం చేస్తున్నారా? నేనింకా ఏ ఇంటరో చదువుతున్నారనుకున్నాను" అన్నాడు చిరంజీవి ఆశ్చర్యంగా.

"ఇంకా నయం! ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నానన్నారు కాదు. పోదాం పదండి. మా అక్క నా కోసం చూస్తూ ఉంటుందక్కడ" అంటూ కిందికి దిగింది మాలతి.

పెళ్లి వేడుకలన్నీ సంతోషంగా ముగిసిపోయాయి. పెళ్లికి వచ్చిన చుట్టాలు పక్కాలూ ఎవరింటికి వారు తరలిపోయే సన్నాహాల్లో ఉన్నారు. మాలతి కూడా తన బట్టలు సర్దుకోసాగింది.

ఇంతలో రెండు చీరలు తీసుకువచ్చింది కమల అక్కడకు, అందులో ఏది బాగుందో చెప్పమంటూ. ఈ సంపెంగ రంగు చీర చాలా బాగుందక్కా!" అంది మాలతి.

"అయితే ఇది నీకే!" అంటూ పళ్లెంలో పళ్లూ, మిఠాయీ, పసుపు కుంకుమలతో పాటు చీరా, జాకెట్టు పెట్టి మాలతికి అందించింది కమల.

"నాకెందుకక్కా ఇప్పుడివన్నీ? " అంది మాలతి ఇబ్బందిగా చూస్తూ.

"తీసుకోమ్మా. రాక రాక మా ఇంటికొచ్చావు, ఏదో మా ముచ్చట. కాదనకమ్మా!"

అంది కమల అత్తగారు ఎంతో ప్రేమగా. ఆ చీర అందుకొని యశోదమ్మకీ, కమలకీ నమస్కరించింది మాలతి.

"అబ్బాయి ఏదో పనిమీద వెళ్లినట్లున్నాడు. మాలతిని స్టేషన్‌లో ఎవరు దిగబెడతారు?" అంది యశోదమ్మ చుట్టూ చూస్తూ.

"ఎవరూ అవసరం లేదండీ, నేను వెళ్లగలను" అంది మాలతి నవ్వుతూ.

"నువ్వెళ్లలేవని కాదు. ఏదో మీ ఇంటివరకూ వచ్చి దిగబెట్టక పోయినా కనీసం బండయినా ఎక్కించి వస్తే కాస్త తృప్తిగా ఉంటుంది" యశోదమ్మ ఆపేక్షగా మాలతి వంక చూస్తూ అంది.

మాలతితో స్టేషన్‌కు వెళ్లే పని చిరంజీవికి అప్పగించారు. అది విని సంతోషంగా అంగీకరించాడు చిరంజీవి.

"ఏమండీ మాలతీదేవిగారూ ఎలా ఉంది మీకీ ట్రిప్? సరదాగా అనిపించిందా? బోరు కొట్టిందా?" అనడిగాడు చిరంజీవి.

"చూడండి చిరంజీవిగారూ... నా పేరు వట్టి మాలతి మాత్రమే. మీరిలా దేవి... గారూ... అంటూ తోకలేం తగిలించక్కర లేదు. ఇక ట్రిప్పు అంటారా? సరదాగానే గడిచింది"

"మీ ఊరు వెళ్తే మమ్మల్నందర్నీ మర్చిపోతారనుకుంటాను"

"ఎలా మర్చిపోతాననుకున్నారు? ఈ పర్సు నా చేతిలో ఉన్నంత కాలం మీరు నాకు గుర్తుంటారు. ఎందుకంటే ఇది నా ప్రాణస్నేహితురాలు స్వాతి ప్రెజెంటేషన్ కనుక ఇదెప్పుడూ భద్రంగా నా దగ్గరే ఉంటుంది. కనుక మిమ్మల్ని మర్చిపోయే ప్రశ్నే లేదు"

"అయితే మీరు జీవితాంతం నన్ను మీ పర్సు దొంగగానే గుర్తుంచుకుంటారన్న మాట!"అన్నాడు చిరంజీవి జాలిగా చూస్తూ.

"ఛ, అలా ఎందుకనుకోవాలి? ఆ రోజయితే కొద్దిగా కోపం వచ్చిన మాట వాస్తవమే గానీ అది నేనో జోక్‌గా తీసుకున్నానే తప్ప సీరియస్‌గా పట్టించుకోలేదు"

"పోనీలెండి, బతికించారు. అయినా మీది చాలా మంచి మనసండీ. మిమ్మల్ని ఎవరు చేసుకుంటారో గానీ, ఆయన చాలా అదృష్టవంతుడండీ. ఆహా, అలా కోపంగా చూడకండి నా వైపు. మీకు ముక్కు మీద కోపమని నాకు తెలుసు. ఆ, నా మాట పూర్తి చెయ్యనివ్వండి. ఏమంటున్నాను? మిమ్మల్ని చేసుకునేవాడు అదృష్టవంతుడని కదా. ఆయన ఎంత ఘోర అపరాధం చేసినా మీరు ఇట్టే క్షమించేస్తారు"

"ఆహా, అలాగా, అయ్యా చిరంజీవిగారూ! ఇంతకూ మీరు చేస్తున్న ఉద్యోగం లెక్చరరా? లేక భట్రాజు ఉద్యోగమా? మనమిలాగే వెళ్తే ఈ రోజు ట్రైనందుకున్నట్లే. కాస్త బండి స్పీడు పెంచండి"

"పోతే పోనీండి. కాసేపిలా సరదాగా మాట్లాడుకోవచ్చు"

"మీరు ఇంటికి వెళ్తే మాట్లాడేందుకు బోలెడుమంది దొరుకుతారు. ఈ ట్రైన్ తప్పిపోతే అర్ధరాత్రి వరకూ స్టేషన్‌లో జాగరణే నాకు! ఇలా అయితే రేపు ఆఫీసులో పనిచేసినట్లే నేను!"

"ఓ సారీ, సారీ! మిమ్మల్నెప్పుడూ చికాకు పెట్టడంతోనే సరిపోతుంది నాకు" అన్నాడు చిరంజీవి నొచ్చుకున్నట్లుగా.

"ఇట్స్ ఓ. కే!" అంటూ నవ్వేసింది మాలతి.

* * *

మాలతిని ట్రైను ఎక్కించి వచ్చి ఆరుబైట వాల్చి ఉన్న మంచం మీద వాలిపోయి ఆలోచనల్లో మునిగిపోయాడు చిరంజీవి.

కమల వచ్చి భోజనానికి రమ్మని ఎన్నిసార్లు పిలిచినా వినిపించుకోకపోవడంతో "మరిదిగారూ, కళ్లు తెరుచుకునే కలల్లో తేలిపోతున్నారా? కొంపదీసి ప్రేమలో గాని పడ్డారా ఏమిటి? ఇంతకీ ఎవరా సుందరి? మిమ్మ ల్ని కలల్లోనే కట్టిపడేసింది" అంది కమల నవ్వుతూ.

కమల పిలుపుతో ఈ లోకంలోకి వచ్చిన చిరంజీవి "మీరన్నది నిజమే వదినా...

అమ్మాయి నిజంగా నన్ను కట్టేసుకుంది తొలి చూపులోనే" అన్నాడు ఏదో లోకంలో ఉన్న ట్లుగా.

"తొలిచూపులోనే నిన్ను ఆకట్టుకుందంటే చాలా గడుసుపిల్లన్న మాట!" అంది కమల.

"అన్నమాట కాదు వదినా ఉన్న మాటే. మీ చెల్లాయి మాలతి ఎంత గడుసుది కాక పోతే నన్నిలా కట్టిపడేస్తుంది? "అన్నాడు చిరంజీవి.

అంతవరకూ నవ్వుతూ మాట్లాడిన కమల మాలతి పేరు వినడంతోనే సైలెంట్ అయిపో యింది. కమల ముఖం చూసిన చిరంజీవి ఆశ్చర్యపోతూ, "అదేమిటి వదినా, ఒక్కసారే అలా అయిపోయారు? నేనేమైనా తప్పుగా మాట్లాడానా? " అనడిగాడు.

"లేదు కానీ ఇది జరిగే పనేనా అని ఆలో చిస్తున్నానంతే. మా చెల్లాయికి కట్నం తీసు కొనే వాళ్లన్నా, తీసుకోకపోవడం అనేది ఏదో ఘనకార్యంగా భావించి గొప్పలు చెప్పుకునే వాళ్లన్నా సరిపడదు. మీ అమ్మా నాన్నలకు నీ వొక్కడివే సంతానానివి. వాళ్ల ఆశలన్నీ చాలా పెద్ద ఎత్తులో ఉన్నాయని విన్నాను. అలాంటప్పుడు ఈ పెళ్లెలా సాధ్యపడుతుంది అని ఆలోచిస్తున్నానంతే!" అంది కమల.

ఇంతలో యశోదమ్మ అటుగా వచ్చి "అక్కడ భోజనాలు వడ్డించి ఇక్కడ కబుర్లే సుకు కూర్చున్నావా మీ మరిదితో. ఏరా ఇంతకంటే సమయం దొరకలేదా నీకు? రండి, రండి, అవతల మీ పెదనాన్నగారు మీ కోసం చూస్తున్నారు" అంటూ చిరంజీవి నెత్తిన చిన్నదెబ్బ వేసి వెళ్లిపోయింది.

అక్కడితో ఆ ప్రసంగం ఆగిపోయింది. అయితే కమల మాటలు విన్న తరువాత కాస్త ఆలోచనలో పడ్డాడు చిరంజీవి. అమ్మా నాన్న ఈ పెళ్లికి ఒప్పుకుంటారా? అని. కానీ కమల ఒద్దిక చూశాక తల్లి అన్న మాటలు కాస్త ధైర్యాన్నిచ్చాయి చిరంజీవికి. "కమల లాంటి కోడలు దొరికితే చాలు నాకు. అదే పది లక్షల పెట్టు!" అని తరుచు అనేది. అదీ కాక మాలతి మాటల్లో, చూపుల్లో ఏదో తెలి యని ఆకర్షణ చిరంజీవిని ఆకట్టుకుంది. అందచందాల కంటే స్వంత వ్యక్తిత్వం, చెద రని ఆత్మవిశ్వాసంతో కూడిన చిరునవ్వు చిరం జీవిని బందీగా మార్చేశాయి. చేసుకుంటే మాలతినే చేసుకోవాలి ఎన్ని అడ్డంకులెదు రైనా!" అనుకున్నాడు స్థిరంగా.

18



ఆఫీసయ్యాక అటునుంచటే స్వాతి ఇంటికి వెళ్లింది మాలతి.

"హాయ్ మాలతి, పెళ్లి బాగా జరిగిందా? కమలక్క బాగుందా? నేను రాలేదని తిట్టిందా నన్ను? " అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది స్వాతి.

"అబ్బబ్బా. ఆపవే బాబూ నీ జోరు. కాస్త నన్ను ఊపిరి తీసుకోనీ. అంతదూరం నుండి కాళ్లీడ్చుకుంటూ వచ్చింది పాపం, దీని మొహాన కాసిని మంచినీళ్లు పోద్దామన్న ధ్యాసే లేదేమిటి నీకు? సరే, అంతా బాగానే జరిగింది. కమలక్క నువ్వు రాలేదని బాధప డింది సరేనా? " అంది మాలతి.

"పోవే బడాయీ పెద్ద, నేనేకదా పెళ్లికెళ్లి వచ్చానని ఫోజు" అంటూ మంచినీళ్లు తెచ్చి "ఇంతకీ ఏం చేయను వీటిని? మొహం మీద పోయనా? నోట్లో పోయనా? " అంది స్వాతి గ్లాస్ ఎత్తిపట్టుకుని.

గ్లాసు అందుకుని నీళ్లు తాగి కింద పెడ్తూ "రాక్షసి! మొహాన పొయ్యమంటే పోసే స్తావా? " అంది మాలతి నవ్వేస్తూ.

"నువ్వే కదే పొయ్యమన్నావు? ఇంతకీ పెళ్లి కబుర్లేమిటి? " అంది స్వాతి స్నేహితు

రాలి పక్కకు వచ్చి కూర్చుంటూ.

"ఏముంటాయే అంతా మామూలే. కానీ అక్కడ ఓ గమ్మత్తు జరిగింది స్వాతీ. నువ్వు కొనిచ్చావు చూడూ, ఆ పర్సు పోయిందే" అంటూ అక్కడ జరిగిన సంఘటనంతా కళ్లకు కట్టినట్లుగా చెప్పింది మాలతి.

"అదన్నమాట సంగతి. అందుకేనా నీ మొహం అలా మతాబులా వెలిగిపోతోంది" అంది స్వాతి.

"ఛ, నీ ఉపమానం పాడుగానూ మతాబు ఒకటీ, రెండు నిముషాలే అలా వెలిగేది. మరి నా మొహం కూడా రెండు నిమిషాలేనా వెలిగేది. ఏదీ నా మొహం సరిగ్గా చూసి చెప్పు? " అంది మాలతి అల్లరిగా నవ్వుతూ.

"సరేలే నీతో మాటల్లో గెల్చింది ఎప్పుడు నేను? అసలు విషయం చెప్పు ఎనీ రొమాన్స్" అంది స్వాతి కళ్లు చికిలించి నవ్వుతూ.

"లాభం లేదే స్వాతీ, నీకీ మధ్య బుర్ర బాగా చెడిపోయిందే. ప్రేమ సినిమాలన్నీ చూసి చూసి నువ్వూ అలాగే తయారయినట్లున్నావే. లేకపోతే ఎవరో ముక్కూ మొహం తెలియనివాడితో ఓ రెండు మూడు గంటల పాటు గడిపినంత మాత్రాన ప్రేమించేయడం తప్ప మరేం కార్యక్రమం లేదా నాకు? " అంది మాలతి కోపంగా.

"సారీనే, ఏదో సరదాగా అలా అన్నాను, కోపగించుకోకే బాబూ!"

"లేకపోతే ఏమిటే నీ మాటలు? ఏదో జరిగింది చెప్తే అలా కలరింగ్ ఇచ్చావు"

"సరే, సరే ఒప్పుకున్నాను తప్పయిందని. అమ్మ ఏదో టిఫిన్ చేస్తోంది పద తిందాం!" అంటూ మాలతిని లాక్కుపోయింది స్వాతి, టాపిక్ డైవర్టు చేస్తూ.

నాలుగు రోజులు పోయిన తర్వాత చిరంజీవి దగ్గర నుండి మాలతికి ఉత్తరం వచ్చింది. ఓ రెండు రోజుల పరిచయ భాగ్యానికే ఇలా ఉత్తరాలదాకా వచ్చాడే మానవుడు? అనుకుంటూ కవరు విప్పింది.

డియర్ మాలతి!

నా ఉత్తరం చూసిన వెంటనే మీ కనుబొమలు ముడిపడతాయని తెలుసు. అయినా రాయకుండా ఉండలేకపోతున్నాను. నా సాహసాన్ని మన్నించి ఉత్తరం చివరివరకూ చదవండి ప్లీజ్!

మీరు ఉన్న ఆ నాలుగు రోజులూ మీతో ఎక్కువ సమయం గడపకపోయినా మీరంటే ఇదీ అని వివరించి చెప్పలేని ఆత్మీయతా భావం చోటు చేసుకుంది నా మనసులో. ఆ సంగతి మిమ్మల్ని ట్రైన్ ఎక్కించాక గాని అర్థం కాలేదు. ఏదో ముఖ్యమైన భాగం నా నుండి దూరమైన ఫీలింగ్ కలిగింది ఇంటికి వస్తూంటే.

ఆ రోజు ఏదో చిలిపితనంగా మిమ్మల్ని ఆట పట్టించాలని మీ పర్సు తీశాను. కానీ ఇలా నా మనసునే పోగొట్టుకుంటానని అనుకోలేదు. మీ పర్సు తీసి మీకు కాస్త ఇబ్బంది కలిగించినా కూడా మీరు మంచి మనసుతో నా తప్పిదాన్ని మన్నించారు.

మాలతీ! నేను అతిగా చనువు తీసుకుంటున్నానని అనుకోకండి. మీరంటే నాకిష్టం! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఇంతకంటే ఎలా చెప్పాలో, ఏమని రాయలో అర్థం కావడం లేదు నాకు. మీరు అంగీకరిస్తే పెద్దలతో సంప్రదింపులు జరుపుదాం. మీ జవాబు గుంటూరు అడ్రసుకు రాయండి.

మీ వాడు కావాలని ఆశపడే

చిరంజీవి.

ఉత్తరం చదివిన మాలతి అతని తెగువకి ఆశ్చర్యపోయింది. ఇంకా ఏదో స్నేహం కోరుతూ ఉత్తరం రాసి ఉంటాడనుకుంది తను. కానీ ఏకంగా ప్రేమించానంటూ పెళ్లిలోకే దిగిపోయాడే, సరే, ఓ ఊపు ఊపి చూద్దాం! అనుకొని కాగితం, కలం తీసుకొని అప్పటికప్పుడు జవాబు రాసి పోస్టు చేసింది మాలతి.

ఈ సంగతి స్వాతితో చెప్పాలా వద్దా? అని కాసేపు ఆలోచించింది. సరే, అతని

నుండి జవాబు వచ్చాక చూద్దాంలే అని చిరంజీవి రాసిన ఉత్తరాన్ని టేబిల్ సొరుగులో పడేసింది.

* * *

తాను ఊహించిన దానికంటే వేగంగా మాలతి దగ్గర నుండి ఉత్తరం రావడంతో ఆశ్చర్యపోయాడు చిరంజీవి. అందులో ఏమని రాసిందో మాలతి? అని ఒక్క క్షణం భయంగా అనిపించినా ఉత్తరం తెరవకుండా ఉండలేకపోయాడు.

చిరంజీవిగారూ!

నమస్తే, మీ ఉత్తరం అందింది. చదివి చాలా ఆశ్చర్యపోయాను. మన పరిచయం అతి స్వల్పం. ఇంతలోనే మీరిలాంటి కంక్లూషన్‌కి రావడం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. సినిమాల్లో యువతీ యువకులు చూసుకున్న మరుక్షణంలోనే విచిత్రంగా ప్రేమలో పడిపోతుంటారు. కానీ ఇది సినిమా కాదు, జీవితం! ఎవరి జీవితమైనా ప్రశాంతంగా సాగాలీ అంటే పరస్పర అవగాహన ముఖ్యం. అంటే ఒకరి గుర్చి ఒకరు పరిపూర్ణంగా తెలుసుకోవాలని విడమర్చి చెప్పనక్కర లేదనుకుంటాను.

అలా అంటే పెద్దలు కుదిర్చిన పెళ్లిళ్ల సక్సెస్ అవడం లేదా, ఏ అవగాహనతో వాళ్ల పెళ్లిళ్ల చేసుకుంటున్నారు అంటారేమో మీరు. నా ఉద్దేశంలో ప్రేమ వివాహమైనా పెద్దలు కుదిర్చిందయినా, ఒకరి అభిరుచులను మరొకరు గుర్తించి గౌరవించే అన్యోన్య దాంపత్యాలను వేళ్లమీద లెక్కపెట్టవచ్చు ఎక్కువమంది సంసారంలో గుట్టురట్టు కాకూడదని జీవితాంతం కాంప్రమైజ్ అయిపోయి నెట్టుకొచ్చేస్తూ ఉంటారు జీవితాలను. కానీ పెళ్లి ఎలా జరిగినా ఇద్దరి మధ్యా అండర్‌స్టాండింగ్ ఉండాలనేది నా ఉద్దేశం. అందుకే ఇదంతా రాస్తున్నాను.

మన మధ్య పట్టుమని పదిరోజుల పరిచయమైనా లేదు. ఒకరి గుర్చి ఒకరికి ఏమీ తెలియదు. కానీ మీరు చాలా త్వరగా ఒక నిర్ణయానికి వచ్చేశారు. వయసు ఉద్రేకం వలన ఈ పెళ్లికి ఒప్పుకుని ఏదో తొలిమోజులో కొన్ని రోజులు సరదాగా గడిపి, ఆ తరువాత ఒకరి అభిరుచులొకరికి సరిపడక కీచులాడుకోవడం నాకు ఇష్టం ఉండదు. అందుకే నా అభిప్రాయాలు స్పష్టంగా ముందే చెప్తున్నాను.

కట్నం కోసం అమ్ముడుపోయే వ్యక్తిని నేను భర్తగా అంగీకరించలేను. మనం ఇచ్చేటప్పుడు పుచ్చుకుంటే తప్పేమిటి అంటారేమో, తప్పనే చెప్తాను నేను. నా దృష్టిలో కట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం రెండూ నేరమే!

ఈ విషయం ఇప్పుడు తేలికగా అనిపించినా, కొన్ని రోజులు పోయాక, ఇదే కొండంతగా మారి జీవితాలను కల్లోలభరితం చేయకూడదని నా ఉద్దేశం! ఇంకో విషయం, కట్నం తీసుకోకపోవడం

**వాళ్లంతా సంసారంలో గుట్టురట్టు కాకూడదని జీవితాంతం కాంప్రమైజ్ అయిపోయి నెట్టుకొచ్చేస్తూ ఉంటారు జీవితాలను. కానీ పెళ్లి ఎలా జరిగినా ఇద్దరి మధ్యా అండర్‌స్టాండింగ్ ఉండాలనేది నా ఉద్దేశం**



ఏదో గొప్ప ఘనకార్యంలా మాటిమాటికీ గొప్ప ప్రదర్శించుకోవడం అనేది నా దృష్టిలో కట్నం తీసుకున్నదానికంటే నీచం. ఇదే నేను చెప్పగలిగేది.

> ఇదేమిటి వీడు ఏక వచనంలోకి దిగిపోయాడు అని ఆశ్చర్యపోతు న్నావా? ఆత్మీయుల మధ్య మన్నింపు లుండరాదని నా ఉద్దేశం. నీవు నాకు ఉత్త ఆత్మీయు రాలివే కాదు నా ప్రాణం కంటే ఎక్కువ

భార్యకు భర్త ఎంత అవసరమో, భర్తకు భార్య అంతే అవసరం. అటువంటప్పుడు వారి మధ్య ఇచ్చిపుచ్చుకోవల సినది ప్రేమానురా గాలే కానీ కట్నకానుకలు, నగలూ, నాణ్యాలూ కాదు! డబ్బుతో ఒకర్ని మరొకరు కొనుక్కో వాలనుకోవడం ఎంత హేయమైన పని?

నేను ఏ విషయమైనా సూటిగానే చెప్తాను. ఇదంతా చదివాక కూడా మీ నిర్ణయంలో ఏ మార్పూ లేక పోతే యూ ఆర్ మోస్ట్ వెల్‌కమ్ ఇన్‌టూ మై లైఫ్!

మీరు ఒక నిర్ణ యం తీసుకున్నాక, దాని గుర్చి పునరాలోచన చేసి, బాధపడే క్షణం రాకూడదనే నా ఆకాంక్ష!

సెలవు...

మాలతి ఉత్తరం చదివి అంతులేని సంతోషానికి లోనయ్యాడు చిరంజీవి. ఆ ఉత్తరంలో మాలతి అభిప్రాయాలను చదివి పెద్దగా ఆశ్చర్యపోలేదతను. ఆమె భావాలన్నిటినీ లోగడ కమల ద్వారా విని ఉండడం వలన సంతోషం కూడా కలిగింది. ఇంత త్వరగా మాలతి నుండి గ్రీన్‌సిగ్నల్ అందుతుందని ఊహించని చిరంజీవి ఎంతో ఆనందపడిపోతూ వెంటనే జవాబు రాశాడు.

మై డియర్ మాలతి!

నీ ఉత్తరం అందింది, ఇదేమిటి వీడు ఏక వచనంలోకి దిగిపోయాడు అని ఆశ్చర్యపోతున్నావా? ఆత్మీయుల మధ్య మన్నింపులుండరాదని నా ఉద్దేశం. నీవు నాకు ఉత్త ఆత్మీయురాలివే కాదు నా ప్రాణం కంటే ఎక్కువ. చెప్పాను కదా, ఆ రోజు నిన్ను ట్రైన్ ఎక్కించాక నా శరీరంలో ఒక భాగం దూరమైనట్లు బాధ పడ్డానని.

మాలతీ! నీ ఉత్తరం చదివి నేనెంత హ్యాపీగా ఫీలయ్యానో వివరించలేను. ఎందుకంటే, నీ సంగతులన్నీ మీ అక్కద్వారా తెలుసుకున్నాను. కనుక ఇక నేను ఆలోచించుకునేందుకు ఏమీ మిగలలేదు, ఒక్క నీ అంగీకారం తప్ప. అది ఈ రోజు లభించింది. ఇంకేం కావాలి నాకు?

ఈ విషయంలో మా అమ్మా నాన్నలను ఒప్పించడం పెద్ద సమస్య కాదు. కాకపోతే ఆ రోజు మీ అక్కతో మాట్లాడుతున్నప్పుడు అనిపించింది ఒక్కటే. ఆదర్శంగా నడుస్తూ కూడా, కట్నం తీసుకోలేదని చెప్పుకోవడం కూడా తప్పేనని నీవన్న మాట గుర్చే! అయితే నీ ఉత్తరం చదివాక ఆ సందేహం కూడా నివృత్తి అయిపోయింది. బాగా ఆలోచించాక, నీ వాదనలో ఉన్న నిజం అర్థమైంది. నిజమే! ఇందులో గొప్పదనం ఏముంది? కట్నానికి అమ్ముడుపోకుండా నన్ను నేను రక్షించుకుంటున్నాను అనిపించింది.

అందుకే మాలతీ! నాకన్నివిధాలా నువ్వూ, నీ భావాలూ చాలా నచ్చాయి. కనుకే మన స్ఫూర్తిగా నిన్ను నా జీవితంలోకి ఆహ్వానిస్తున్నాను. ఈ విషయం వెంటనే ముందుగా కమల వదినకే చెప్పాలని ఉంది నాకు. త్వరలో మీ ఇంటికి వచ్చి, నిన్ను నా స్వంతం చేసుకుంటాను.

ఉండనా మరి!

చిరంజీవి

ఆ ఉత్తరం చదివిన మాలతి ఆనందంతో

ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. ఇంతకాలం అందరూ తనని ఓ పిచ్చిదానిలా చూస్తూ "నీవన్నీ పిచ్చి ఊహలు, పనికిమాలిన ఆదర్శాలు, కట్నం లేకుండా ఎవరే నిన్ను చేసుకుంటారు? " అంటూ హేళన చేశారు. కానీ నేనే గెల్చాను, అనుకుంటూ చిరంజీవి రాసిన రెండు ఉత్తరాలూ పట్టుకొని స్వాతి ఇంటికి పరుగు తీసింది మాలతి.

"స్వాతీ... స్వాతీ!" అని ఎక్సయిటింగ్‌గా అరుచుకుంటూ లోపలికి వెళ్లింది మాలతి.

"ఏమిటే మాలతీ ఆ గావుకేకలు? హార్ట్ ఎటాక్ ఉన్న వాళ్లెవరైనా నీ కేకలు వింటే ఢామ్మని చచ్చి ఊరుకుంటారు. ఆ కేకలేమిటి? ఈ చెమట లేమిటి? రా కూర్చో" అంటూ పక్కనున్న కుర్చీలో కూర్చోబెట్టి మంచినీళ్లు తెచ్చి అందించింది స్వాతి.

గటగటా ఆ నీళ్లన్నీ ఒక్క గుక్కలో తాగేసి గ్లాసు కింద పెడుతూ "స్వాతీ, ఇలారా ముందు!" అంటూ చేయి పట్టిలాగి పక్కన కూర్చోబెట్టింది మాలతి.

"ఏమిటే మాలతి. ఏమైంది నీకివ్వాళ? " అంది స్వాతి ఆశ్చర్యంగా చూస్తూ.

"నాకేం కాలేదే స్వాతీ. నువ్వు అర్జంటుగా చదువుకి చుక్క పెట్టు. హైదరాబాద్ ఫోన్ చేయించి పెళ్లికి ముహూర్తాలు పెట్టమని చెప్పు" అంది మాలతి ఉద్వేగంగా చూస్తూ.

"అబ్బా...ఇదా నువ్వు చెప్పే సోది. చాల్లే!" అంటూ లేచిన స్వాతిని తిరిగి కూర్చోబెడుతూ "అసలు నేను చెప్పేది పూర్తిగా వినవేం? నా పెళ్లి కుదిరితేగాని నువ్వు చేసుకోనన్నావు కదా. నా పెళ్లి కుదిరింది, ఇక నీదే ఆలస్యం!" అంది మాలతి చిన్నగా నవ్వుతూ.

"హాయ్... చెప్పావు కాదేం ఇంత సేపూ? ఇంతకీ వరుడెవరు? ఏం చేస్తుంటాడు. దక్షిణ తాంబూలాలేమాత్రం? " అంది స్వాతి ఉత్సాహంగా.

"మొద్దు... దక్షిణ తాంబూలాల ప్రసక్తి ఉంటే దగ్గరకే రానివ్వనని నీకు తెలుసుకదా. ఆ రోజు విజయవాడ నుండి వచ్చాక నా పర్సు దొంగ చిరంజీవి గురించి చెప్పాను కదా. ఆయనే!" అంటూ చిరంజీవి రాసిన రెండు ఉత్తరాలూ స్వాతి చేతిలో పెట్టింది మాలతి.

ఆ ఉత్తరాలు చదివి ఇచ్చేస్తూ, "నువ్వు నిజంగా చాలా గడుసుదానివే మాలతీ. ఇంత జరిగినా ఒక్క ముక్కయినా నాకు చెప్పావు కాదు" అంది స్వాతి నిష్ఠూరంగా.

"ఇదిగో, అలాంటి మాటలే అనవద్దంటాను. అసలు నేనింత దూరం వస్తుందనుకోలేదు. అతని మాటలన్నీ ఉపన్యాసాల వరకే పరిమితం అనుకున్నాను. ఇలా చేతల వరకూ వస్తుందనుకోలేదు" అంది మాలతి.

"ఏయ్, మాలతి గమ్మత్తు చూశావటే? సూర్య మావయ్య ఇంగ్లీషు లెక్చరర్, మీ చిరంజీవిగారు హిందీ లెక్చరర్. బాగుంది కదూ? అలా కలిసిరావాలే ఏదయినా!" అంది స్వాతి సంతోషంగా.

"అవును సుమీ... నేను గమనించనే లేదు. అదీకాక హైద్రాబాదుకు విశాఖపట్నం కంటే గుంటూరు చాలా దగ్గర. మనం తరుచూ కలుసుకోవచ్చు"

"ఎంత మంచిరోజే మాలతి ఇవ్వాళ? నిజంగా నాకెంత సంతోషంగా ఉందో, మాటల్లో చెప్పలేనే !"

"నాక్కూడా!" అంటూ స్నేహితురాలి భుజం మీద తల వాల్చింది మాలతి.

మాలతి ఈ రోజు ఇక్కడే ఉండిపోతుంది అంటూ తన తమ్ముడు రవితో ఇందిరమ్మకు కబురుపెట్టింది స్వాతి. ఆ రాత్రంతా ఎడతెగని కబుర్లతో నిద్ర లేకుండా గడిపారు ఇద్దరూ.

ఆ మరునాడు మాలతి వెళ్లిపోయాక సూర్యకి ఫోను చేసింది స్వాతి.

కాలేజీకి వెళ్లేందుకు హడావుడిగా తయారవుతున్న సూర్య విసుక్కుంటూ ఫోనందుకున్నాడు. ఫోనులో స్వాతి గొంతు వినడంతోనే, అతని విసుగంతా మాయం అయిపోయింది.




# వాహ్

నేర్వగా నేర్వగరాని విద్య కలదే మాకున్ అని ఆ పశుపక్ష్యాదులు ఢంకా బజాయించి మరీ గొప్పలు పోతున్నాయి. అవి అలా గొప్పలు పోవడమూ సహేతుకమేలెండి. ఎందుకంటారా... నాట్యమాడి, గానం చేసి, వాయిద్యాలపై సరిగమలొలికించే అవి బడాయిపోవడం తగదని ఎవరైనా ఎలా అనగలరు! ఒక కోడిగారు క్సైలోఫోన్, ఓ పిల్లిగారు పియానో వాయించడం, ఓ కుక్కగారు నృత్యం చేయడం ఎన్నడైనా కనీవినీ ఎరుగుదుమా! జర్మనీలో మాత్రం కేటీ అనే కోడిపెట్ట, పుక్ అనే మార్జాలం, బెల్లోస్ అనే శునకం అవలీలగా అవన్నీ చేసేస్తూ తన్మయతంలో మునిగిపోతున్నాయి. కేటీ తోటి విద్యార్థికెలైన్ ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్ రైమ్‌లోని కొన్ని పాదాలను ఇప్పటికే నేర్చుకుంది. వాటన్నిటినీ చూపిస్తూ 'చూశారా, మా విద్యార్థులెంత గానవంతులో' అని మురిసిపోతోంది వాటి శిక్షకురాలు వివియేన్ థెబీ (39). ఇతర జంతు శిక్షకులు అనుసరించిన సిద్ధాంతాల్నే నేనూ అనుసరిస్తున్నాను. ఒక స్వరాన్ని సరిగ్గా వాయిస్తే ఒక్కో బహుమతి ఇస్తూ వాటికి గాన విద్య నేర్పుతున్నానని చెబుతోందావిడ. అంటే కోడి తన ముక్కుతో స్వరాన్ని సరిగ్గా



## మాకున్ నేర్వగ రాని విద్య కలదే!

వాయిస్తే దానికి చక్కటి మేత బహుమతిగా లభిస్తుంది. పుక్ అనే మార్జాలం కచేరీలు కూడ చేస్తోందని ఆ కచేరీల సిడిలు కూడా కొన్ని అమ్ముడుపోయాయని అప్పుడప్పుడు తను పుక్‌తో కలిసి యుగళగీతాన్ని వాయిస్తాననీ అంటోందామె. తన పెంపుడు శునకం బెల్లోస్ నృత్యం చేయడానికి ఆరు నెలలు శిక్షణ ఇచ్చానని, ఇప్పుడు తామిద్దరం కలిసి డాగ్-డ్యాన్స్ బహుచక్కగా చేయగలమనీ గర్వంగా చాటుకుంటోంది. పెంపుడు జంతువుకీ, యజమానికీ మధ్య ఉండే కమ్యూనికేషన్‌కు ఇదంతా మరో రూపం మాత్రమేననేది థెబీ భాష్యం. ఆమె విట్‌రిచ్ ఫేమ్ అకాడెమీలో పని చేస్తోంది. ఆ అకాడెమీని పెంపుడు జంతువులకు గాత్రం, వాయిద్యం, నృత్యాలలో శిక్షణ ఇచ్చి నైపుణ్యవంతమైనవిగా వాటిని తీర్చిదిద్దడం కోసమే ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. ష్యూర్‌హోప్ యానిమల్ అకాడెమీలో కూడ పెంపుడు జంతువులకు నృత్యంలో శిక్షణ ఇస్తున్న థెబీ విజయగాథల్లో ఇలాంటివి చాలానే ఉన్నాయట.






సాధనముతో సమకూరు సమస్త కిటుకులు అనే సంగతి పాపం ఆ దొంగ బాబులకు తెలిసినట్టు లేదు. పోనీ, ఏ గురు ముఖతా కూడా జాగ్రత్తలు నేర్చుకున్నట్లు లేదు. అందుకే అనుభవమంతగా లేని ఓ ఇద్దరు కుర్ర దొంగలు తెలివిమాలిన పనికి ఊచలు లెక్కపెట్టాల్సిన దుస్థితి కొని తెచ్చుకున్నారు. మలేసియాలోని జోహోర్ రాష్ట్రంలో 20 ఏళ్ల వయసున్న ఇద్దరు చోరులు ఓ ఇంట్లోకి సునాయాసంగా చొరబడ్డారు. ఇంట్లో ఉన్న నగా నట్రా, ఖరీదైన వస్తువులు అన్నీ ఎంచక్కానో సర్దేసుకున్నారు. వచ్చిన కార్యాన్ని ముగించుకున్నాక ఆ ఇద్దరికీ కడుపులో ఎలుకలు పరిగెత్తుతున్న సంగతి గుర్తొచ్చింది. వెంటనే వంటగదిలోకి దూరేసి ఫ్రిడ్జ్ తీసి అందులో ఉన్నవాటిలో తమకు కావలసినవన్నీ తీసుకుని సుష్టుగా ఆరగించారు. కడుపు నిండగానే ఆవులింతలు మొదలయ్యాయి. ఓ కునుకు తీస్తే పోలా అనుకున్నారు. హాలులో అనువైనచోటు చూసుకుని నడుం వాల్చారు. ఎంతసేపు నిద్రపోయారో వాళ్లకైతే తెలియదుగానీ ఇంటి యాజమానురాలికి మెలకువ రావడంతో హాల్లోకి వచ్చింది. గుర్రుపెట్టి నిద్రపోతున్న దొంగబాబుల్ని చూసి నోరెళ్ల బెట్టింది. వీళ్ల భరతం పట్టక తప్పదనుకుంటూ వెంటనే పోలీసులకు కబురు చేసింది. ఖాకీ బాబులు వచ్చి కలల్లో తేలిపోతున్న దొంగ బాబుల్ని లేపి తమ ఆతిథ్యం కూడా స్వీకరించడానికి రమ్మని కటకటాల వెనక పడేశారట!

పుణ్యానికి పోతే పాపం ఎదురయిందంటారు చూడండి; అలాంటి లెవల్లోనే పాపం అతగాడికి చేదు అనుభవం ఎదురయింది. జాలిపడి అపూర్వ దానం చేశానని మురిసిపోయిన ఆ స్వీడిష్ ఆసామి ఆ దానం భారంగా మారటంతో లబోదిబోమంటున్నాడు. స్వలింగ సంపర్కురాలైన (లెస్బియన్) ఒక మహిళకు తల్లిని కావాలని కోరిక కలిగి దాతల కోసం అన్వేషణలో పడితే ఇతగాడు కనిపించాడు. పోనీలే అమ్మడి ముచ్చట తీరుద్దామనుకుని తన వీర్యాన్ని దానం చేశాడు. కృత్రిమ గర్భధారణతో ఆ అమ్మణ్ణి తల్లి అయింది. ఇది 1990 దశకం తొలినాళ్ల ముచ్చట. ఇదే రీతిలో ఆమె ఆ తర్వాత మరో ఇద్దరు సంతానాన్నీ కన్నది. ముగ్గురి బిడ్డల్లో మొదటి బిడ్డ వయసు ఇప్పుడు 13 ఏళ్ళు. పిల్లలకు తాను శాస్త్రరీత్యా తండ్రి అయినప్పటికీ వారి పోషణభారంతో తనకేం సంబంధం లేదనే ఒప్పంద పత్రంపై అతడు వీర్యదానం సందర్భంగా సంతకం చేశాడు. ఇప్పుడా లెస్బియన్ దంపతులు విడిపోయారు. పిల్లలకు తల్లి అయిన మహిళ పిల్లల పోషణ, పెంపకానికి అయ్యే ఖర్చుల్ని వారి తండ్రే భరించాలంటూ డిమాండ్ చేయడం మొదలుపెట్టింది. దాంతో అతగాడు కోర్టుకెక్కాడు. తమ ఒప్పందం సంగతి కూడ కోర్టుకు చెప్పాడు. అయినా కోర్టు కనికరించకుండా తల్లి పక్షమే వహించడంతో కేసు వీగిపోయాడు. సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. ఆ కోర్టు కూడ కింది కోర్టు రూలింగ్‌నే సమర్థించింది. పరోక్షంగా తండ్రి అయినప్పటికీ పిల్లల భారం మోయడంలో ఆ తల్లికి మద్దతు ఇచ్చితీరాల్సిందేనని బల్లగుద్ది మరీ తీర్పిచ్చేసింది. దాంతో అతగాడు తల పట్టుకుని కూర్చున్నాడట!

## భారంగా మారిన దానం!



"హలో స్వాతీ నువ్వా... ఏమిటీ ఈ వేళప్పుడు ఫోను చేశావు? " అన్నాడు సూర్య ఆశ్చర్యంగా.

"ఏం చెయ్యకూడదా? నా మొగుడికి ఫోను చేసుకొనే హక్కు కూడా నాకు లేదా? నేనివ్వాళ క్లాసుకు వెళ్లడం లేదు. నువ్వూ కాలేజీ మానెయ్! ఎంచక్కా ఇద్దరం ఫోనులో కబుర్లు చెప్పుకుందాం" అంది స్వాతి నవ్వేస్తూ.

"బావుంది. తీరిగ్గా కూర్చుని పనులన్నీ మానేసి ఎస్. టి. డి. లో మాట్లాడుతూ కూర్చుంటే మీ నాన్నకి బిల్లు పేలిపోతుంది. ఏమిటి సంగతి, మాంచి హుషారుగా ఉన్నట్లున్నావు? " అన్నాడు సూర్య.

"చెప్తే నాకేం ఇస్తావో చెప్పు ముందు? " అంది స్వాతి పంతంగా.

"నువ్వు చెప్పేదాన్ని బట్టి ఉంటుందది. ఓ పిప్పర్‌మెంట్ బిళ్లో, చాక్లెట్టో ఇస్తానులే!" అన్నాడు సూర్య తానేమీ తీసిపోనట్లుగా.

"ఛీ, పిసినారీ... రేపు పెళ్లయ్యాక సినిమాకు తీసుకెళ్లరా మగడా అంటే, ఎందుకూ డబ్బులు దండగ. టీ.వీలో రోజూ ఏదో చెత్త సినిమా వేస్తూంటారు కదా చూడు, అనేట్టున్నావే? " అంది స్వాతి టీజింగ్‌గా.

"ఇదిగో... నాకు టైమయిపోతోంది, వేధించకుండా అసలు సంగతి చెప్పు ముందు. మీ ఇంట్లో కుక్కపిల్ల నీళ్లాడిందా, మీ ఎదురింటి పప్పీ బాగా అల్లరి చేస్తోందా? లేక నీ స్నేహితురాలికి ప్రమోషన్ వచ్చిందా? " అన్నాడు సూర్య, గతంలో స్వాతి చెప్పిన కబుర్లు గుర్తు చేసి వెక్కిరిస్తూ.

"ఇలా అయితే అసలు నేను చెప్పను. ఫోను పెట్టేయనా మరి? " అంది స్వాతి అలిగినట్లుగా.

"ఆ... వద్దులే, చెప్పు మరి. నా బంగారు జాబిల్లివి కదా. నా వెన్నెల వానవి కదా, చెప్పు మరి" అన్నాడు సూర్య బతిమిలాడుతూ.

"అలా రా దారికి. ఇదిగో చెప్పేస్తున్నా. మన పెళ్లికి ముహూర్తం పెట్టించు మావయ్యా!" అంటూ ఫోన్ పెట్టేసింది స్వాతి, ఆ పైన మాట్లాడలేనట్లుగా. అప్పటికే స్వాతి చెంపల్లో కెంపులు పూచాయి. రాత్రి నుండీ ఈ మాట సూర్యతో ఎప్పుడెప్పుడు చెప్తానా అని ఎదురు చూసింది స్వాతి. కాని మాలతి ఉండగా సూర్యకి ఫోన్ చేస్తే తాటాకులు కడుతుందని ఆగిపోయింది.

స్వాతి మాటలు వినడంతోనే ఆనందంతో నోట మాట రాలేదు సూర్యకి. "స్వాతీ... స్వాతీ!" అంటూ పిలిచినా సమాధానం రాకపోవడంతో తానే డయల్ చేశాడు.

"హలో స్వాతీ... థాంక్యూ సో మచ్, స్వాతీ థాంక్యూ. ఇన్నాళ్లకి నా నిరీక్షణ ఫలించిందన్న మాట. అయితే మీ మాలతిక్కూడా పెళ్లి కుదిరి ఉండాలే? " అన్నాడు సూర్య.

"అవును, నీకెలా తెలుసు? " అంది స్వాతి ఆశ్చర్యంగా.

"ఎందుకంటే తన పెళ్లి కోసమనే నువ్వు ఇన్నాళ్లూ ఆగావని నాకు తెలుసు కనుక. ఇన్నాళ్లకు నా కష్టాలు గట్టెక్కించింది మీ ఫ్రెండు. సరే సాయంత్రం మాట్లాడుకుందాం. ముందు అర్జంటుగా ఈ సంగతి అమ్మా నాన్నలకు చెప్పాలి. బై!" అంటూ ఫోను పెట్టేశాడు.

పెళ్లి ముహూర్తాలు పెట్టించమని సూర్యతో కూతురు చెప్తూండగా విన్న రంగారావు స్వాతి దగ్గరకు వచ్చి "నిజమా? " అంటూ కూతురి నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాడు. ఈ కబురు విన్న జానకమ్మ ఆనందానికి అంతే లేదు. స్వాతి సిగ్గుగా నవ్వేస్తూ అక్కడి నుండి వెళ్లిపోయింది.

* * *

ఇటు స్వాతి ఇంట్లో అటు మాలతి ఇంట్లో పెళ్లి పనులు చురుకుగా సాగిపోతున్నాయి. ఇప్పటివరకూ చదువుకుంటానని మొండిపట్టు పట్టిన స్వాతి హఠాత్తుగా తన నిర్ణయం ఎందుకు మార్చుకుందో సూర్యకి తప్ప ఎవరికీ అర్థం కాలేదు ముందు. ఆ తరువాత మాలతి ఇంట్లో పెళ్లి సన్నాహాల గూర్చి విన్నాక

విషయం పూర్తిగా అర్థమయింది రంగారావుకి జానకమ్మకీను.

ఇద్దరి పెళ్లిళ్లకూ ఒక్క రోజు తేడాలో ముహూర్తాలు కుదిరాయి. రంగారావు ఇంట్లో అదే మొదటి శుభకార్యం కనుక పెళ్లి ఏర్పాట్లన్నీ భారీ ఎత్తున జరుగుతున్నాయి.

రంగారావు ఉద్యోగం మంచిదే అయినా ఆదాయానికి మించిన ఖర్చులు, ఆ పైన ఎవరైనా కష్టంలో ఉంటే ఆదుకునే మంచితనం వలన పెద్దగా వెనకేసిందేమీ లేకపోయింది. కూతురి పెళ్లి కోసం పి.యఫ్ నుండి నాన్ రిఫండబుల్ లోను తీసుకున్నాడు రంగారావు. కళ్యాణ మంటపం బుకింగ్‌కి, భోజనాల కేటరింగులకూ, డెకరేషన్స్‌కూ అడ్వాన్సులిచ్చేశాడు.

కూతురికీ అల్లుడికీ వియ్యాల వారికీ బట్టలు తీసుకున్నారు. ఆ చేత్తోనే దగ్గర వాళ్లందరికీ పెళ్లిలో పెట్టేందుకు బట్టలు కొన్నారు.

సూర్య స్వాతి కోసం పచ్చలూ, కెంపులూ పొదిగిన హారం, గాజులూ, చెవి కమ్మలూ తీసుకున్నాడు. స్వాతి తన పాకెట్ మనీ కోసం తండ్రి ఇచ్చిన డబ్బులోంచి కొంత దాచి ఉంచింది. అందులో నుండే అప్పుడప్పుడూ రవికి చిన్న చిన్న బహుమతులు కొని ఇస్తూ ఉండేది. సూర్య కోసం పెళ్లికి అందమైన డైమండ్ రింగ్ కొంది. అలాగే మాలతి కోసం చిరంజీవి మాలతిల పేర్లలో మొదటి అక్షరాలను హార్ట్ షేప్‌లో ఒకదానిలో ఒకటి ఒదిగిపోయి ఉన్నట్లుగా ఎనామిల్ కోటింగ్‌తో ఉంగరం చేయించింది. తన తమ్ముడి కోసం మంచి సూట్ కుట్టించింది.

"ఇంత డబ్బు నీకెక్కడిదే స్వాతీ? " అంటూ జానకమ్మ ఆశ్చర్యపోతే,

"ఇదంతా ఇన్నాళ్లూ మీరు నా ఖర్చులకిచ్చిందే కదమ్మా, నాకు ప్రత్యేకంగా ఖర్చులేముంటాయి. అదంతా ఇప్పుడిలా పనికి వచ్చింది" అంది స్వాతి నవ్వేస్తూ.

* * *

జ్ఞాపకాలలో కూరుకుపోయిన మాలతి



## అలసిన సింహం ఏం చేస్తుంది?

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా చట్టోల్లంఘన ఉద్యమం తీవ్రతరంగా నిర్వహిస్తున్న రోజులు.

ఓ విదేశీ పాత్రికేయుడు గాంధీజీ ఇంటర్వ్యూ కోసం వచ్చి 'గాంధీజీ.. మీరు బ్రిటిష్ సింహం నోట్లో తల పెడుతున్నట్లున్నారు.. ప్రమాదం కాదా? 'అని అడిగాడు.

'అలసిపోయి పడున్న సింహం నన్నేం చేస్తుంది మిత్రమా? ' అని దీటుగా జవాబిచ్చారు బాపూ.

కిందనుండి అత్తగారి పిలుపు వినిపించడంతో ఈ లోకంలోకి వచ్చింది. "అమ్మాయ్ మాల తీ! అబ్బాయి వచ్చే వేళయింది. నువ్వింకా ఇలాగే కూర్చుంటే ఎలా? ఈ రోజు మీ అక్క దగ్గరకు విజయవాడ వెళ్దామనుకున్నారు కదా!" అందావిడ గుర్తు చేస్తున్నట్లుగా.

"అయ్యో నేనా సంగతే మర్చిపోయానత్తయ్యా!" అంటూ గబగబా కిందకు దిగి వచ్చింది మేడ మీదనుండి.

"సరేలే. ఇప్పుడు మాత్రం ఏం మునిగిపోయింది? త్వరగా తయారవ్వు, మళ్లీ వాడు వచ్చాడంటే చిందులు వేస్తాడు" అందావిడ.

సరిగ్గా మాలతి స్నానం చేసి రెడీ అయ్యే

సమయానికి చిరంజీవి కాలేజీ నుండి వచ్చాడు. మాలతిని చూసి సంతృప్తిగా తల పంకిస్తూ "గుడ్ అలా ఉండాలి మాలతంటే!" అంటూ తయారయ్యేందుకు హుషారుగా మేడ మీదకు వెళ్లిపోయాడు.

టిఫిన్ చేసి ఇద్దరూ బైక్‌మీద విజయవాడ బయలుదేరారు. చిరంజీవి హుషారుగా దారి పొడుగునా కబుర్లు చెప్తూంటే మాలతి అన్య మనస్కంగా అవన్నీ వింటూ "ఆc, ఊc" అని పొడి పొడిగా అనడం తప్ప తనంతట తానుగా ఒక్కమాట కూడా మాట్లాడలేదు. చూసి చూసి విసిగిపోయిన చిరంజీవి, బండి ఆపి మాలతిని దిగమని, తానూ దిగి బండి స్టాండు వేశాడు.

"ఇదేమిటి ఇక్కడ ఆపేశారు?" అంది మాలతి ఆశ్చర్యంగా చూస్తూ.

"మాలతీ ఉదయం చెప్పాను. నువ్విలా ఉండడం నాకేమీ బాగుండలేదని. కానీ నీ ధోరణి ఏం మారలేదు. మీ స్వాతి చాలా మంచిది, ఒప్పుకుంటాను. మీ స్నేహబంధం ఇంకా గొప్పది. అందులో ఎటువంటి సందేహమూ లేదు. కానీ నువ్విలా పొద్దస్తమానం అదే ధోరణిలో ఉంటే నాకెలా ఉంటుందో ఒకసారి ఆలోచించు. నేనెంతో ఉత్సాహంగా ఇంటికి వస్తాను నీ కోసం. కానీ నేను కోరుకొనే నవ్వే నీ ముఖంలో కరువైపోయి నిర్లిప్తంగా, నిస్తేజంగా నా వంక చూస్తూ ఉంటే నా ఉత్సాహమంతా నీరు కారిపోతోంది. మాలతీ! ప్లీజ్ అండర్ స్టాండ్ మీ. ఇలాగే మరి కొద్దిరోజులు గడిస్తే మనం కొత్తగా పెళ్లయిన వాళ్లమనే సంగతి కూడా మరిచిపోతానేమో అనిపిస్తోంది" అన్నాడు చిరంజీవి బాధగా చూస్తూ.

"అది కాదండీ, కళ్లు మూసినా, తెరిచినా స్వాతే గుర్తుకొస్తోంది. మీకు తెలుసుకదా! స్వాతి కొనిచ్చిన పర్సు పోతేనే నేనెంతో గిల గిల లాడిపోయాను. అలాంటిది మోడులా మిగిలిపోయిన స్వాతిని" అంటూ మాటలా పేసింది మాలతి, ఏడుపుతో గొంతు పూడుకుపోగా.

"బాగా తెలుసు. ఆ పర్సే కదా మనిద్దర్నీ కలిపింది. కానీ బాధ పడుతూంటే సమస్య పరిష్కారం అయిపోతుందా? ఏడుపు సమస్యకు పరిష్కారం కాదు. దీనికేదో పరిష్కారం మనమే ఆలోచించి తన బతుకు గమ్యాన్ని ఏర్పరిచే ప్రయత్నం చేద్దాం" అన్నాడు చిరంజీవి.

"ఏం ఏర్పరుస్తామండీ, అది ఉత్త మొండిది! దాని మాట దానిదే గానీ ఎవరి మాటా వినదు. పాపం సూర్య మావయ్య ఎంత బాధపడుతూ వెళ్లిపోయాడో?" అంది మాలతి బాధగా.

"మాలతీ! నిజంగా మీ సూర్య మావయ్యకు స్వాతి అంటే ఇష్టం ఉంటే ఇన్నాళ్లూ ఆగినవాడు మరికొన్నాళ్లు ఆగలేడా తన కోసం?" అన్నాడు చిరంజీవి.

"ఇష్టం కాదండీ, అదంటే ప్రాణం మామయ్యకు! కానీ స్వాతే బాధ్యతల బంధనాలను తగిలించుకొని తనని మర్చిపోయి వేరే పెళ్లి చేసుకొమ్మని సూర్య మామయ్యని శాసించింది. అసలు దీనికంతటికీ కారణం సూర్య మామయ్య తల్లిదండ్రులే. వాళ్లంత నిర్దాక్షిణ్యం గా మాట్లాడి ఉండకపోతే, స్వాతి ఇలాంటి నిర్ణయం తీసుకునేదే కాదు" అంది మాలతి.

"సరే, జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మనం జరగవలసిందేదో చూద్దాం. సూర్యగారితో మనం వెళ్లి మాట్లాడుదాం. మనం ముగ్గురం కలసి ఆలోచించి దీనికో పరిష్కారమార్గం చూద్దాం. అందాకా నేను చెప్పినట్లు నీ స్నేహితురాలి గూర్చి దిగులు మాని మామూలుగా నవ్వుతూ ఉండాలి సరేనా?" అన్నాడు చిరంజీవి మాలతి చెయ్యి నొక్కుతూ.

"సరే, మీ మాటలు విన్నాక నాకూ ఎంతో ఊరటగా అనిపిస్తోంది. ఇక మీదట మీరు బాధపడే పరిస్థితి రానీయనులెండి!"

అంది మాలతి.

19



"సూర్యా! నాన్నగారు పిలుస్తున్నారు!" అంది శాంతమ్మ వచ్చి.

మరునాడు చెప్పబోయే లెసన్ కోసం ప్రిపేర్ అవుతున్న సూర్య పుస్తకం పక్కన పెట్టి హాల్లోకి వచ్చాడు.

"సూర్యా, నువ్వింకా చిన్న పిల్లాడివి కాదు. ఇరవై ఏడు సంవత్సరాలు వచ్చాయి. అలాగే ఏ విషయమూ పదే పదే నాకు చెప్పే అలవాటు లేదు. రేపు మీ మావయ్యగారింటికి వెళ్తున్నాం. సిద్ధంగా ఉండు. నీలవేణితో నీ పెళ్లి నిశ్చయం చేయాలనుకుంటున్నాం!" అన్నాడు రాజయ్య ఏ ఉపోద్ఘాతమూ లేకుండా.

"నాన్నా! మీరు నిశ్చయం చేస్తే సరిపోతుందా? ఇందులో నా ఇష్టాయిష్టాల ప్రమేయం ఏమీ లేదా...? మీకెన్నోసార్లు చెప్పాను, నీలవేణంటే నాకిష్టం లేదనీ, స్వాతిని తప్ప ఇంకెవరినీ చేసుకోననీ, బావగారు పోయిన కారణంగా మీరీ పెళ్లి రద్దు చేసుకుంటున్నారని అక్కకి తెలిస్తే తట్టుకోగలదా తను? ఆలోచించండి నాన్నా, అసలు మీకెందుకింత మొండి పట్టుదల? " అన్నాడు సూర్య బాధ, కోపం మిళితమైన స్వరంతో.

"ఏమిట్రా? స్వాతి స్వాతి అని ఓ తెగ ఇదయిపోతున్నావు. నా మేనకోడలు నీలవేణిలో లేనిదేమిటి, దానిలో ఉన్నదేమిటి? " అంది శాంతమ్మ మండిపడుతున్నట్లుగా.

"అవన్నీ మీకు చెప్పినా అర్థం కావు లేమ్మా... చివరిసారిగా చెప్తున్నాను. స్వాతిని తప్ప ఇంకెవరినీ నేను చేసుకోను. మరో మారు ఈ విషయాన్ని చర్చకు పెట్టకండి, దయచేసి" అంటూ అక్కడి నుండి వెళ్లిపోయాడు సూర్య సమాధానం కోసం ఎదురుచూడకుండా.

"ఏమిటి శాంతా, వీడి పట్టుదల? మనమిటు చెప్తూంటే వాడటు పోతున్నాడు? " అన్నాడు రాజయ్య.

"సరేలెండి. ఇల్లలకగానే పండుగ కాదు. ఈ పెళ్లి ఎలా చేసుకోడో నేనూ చూస్తాను" అంది శాంతమ్మ పౌరుషంగా.

గదిలోకి వచ్చి మంచం మీద వాలిపోయాడు సూర్య. ఏం మనుషులు వీళ్లు? డబ్బు చుట్టూనే తప్ప, ప్రేమాభిమానాలకు గడ్డిపోచంత విలువ కూడా ఇవ్వరు. అక్కడ పాపం స్వాతి ఎలా ఉందో, వేళకి తింటూందో లేదో? వెంటనే ఒకసారి స్వాతితో మాట్లాడాలనిపించింది సూర్యకు. ఫోన్ అందుకుని నెంబర్ డయల్ చేసి "హలో!" అన్నాడు.

ఆ ఫోన్ జానకమ్మ రిసీవ్ చేసుకుంది. "హలో సూర్య! ఏమిటీ ఈవేళప్పుడు ఫోన్ చేశావు? " అంది ఆశ్చర్యంగా.

"ఏం లేదక్కా ఊరికే చేశాను, ఎలా ఉన్నావు? " అన్నాడు సూర్య ఆప్యాయంగా.

"ఎలా ఉంటానురా... చావు రాక, బతకలేక ఇదిగో ఇలా ఉన్నాను. నిత్యం నవ్వులతో, కేరింతలతో మోగిపోయే ఇల్లు శ్మశానంగా మారిపోయిందిరా? బావగారు పోతూ పోతూ, మాలో జీవకళని తీసుకుపోయార్రా!" అంది జానకమ్మ ఏడ్చేస్తూ.

"ఊరుకో అక్కా, ఏం చేస్తాం? మనకంతే ప్రాప్తం. స్వాతి లేదా? " అనడిగాడు సూర్య ఆత్రంగా.

"ఉందిరా, చదువుకుంటోంది, ఉండు. పిలుస్తాను!" అంటూ ఫోన్ పక్కన పెట్టి స్వాతిని పిలుచుకువచ్చింది.

"హలో మావయ్యా బాగున్నావా? " అంది స్వాతి అభిమానంగా.

"నాకేం, బాగానే ఉన్నాను, నువ్వే ఎలా ఉన్నావోననే నా దిగులంతా!"

"దిగులెందుకు మావయ్యా! నేను బాగానే ఉన్నాను. నాన్నగారు సర్వీసులో ఉండగా చనిపోయారు కనుక ఆ ఉద్యోగం నాకు వస్తుందట మావయ్యా. ఇక మీదట ఆర్థిక సమస్యలుండవు" అంది స్వాతి.

"నిజమా? కంగ్రాట్స్ స్వాతీ, మరింకేం నీకు ఉద్యోగం ఉంటుంది కనుక మన పెళ్లికి ఇక ఎటువంటి ఆటంకమూ ఉండదు" అన్నాడు సూర్య ఉత్సాహంగా.

"పిచ్చి మావయ్యా. ఎంత అల్పసంతోషివి నువ్వు! మన పెళ్లికి ఆటంకం ఉండదు సరే. అమ్మనీ, తమ్ముడినీ చూడవలసింది నేను కదా. అది విస్మరిస్తున్నావు నువ్వు" నిర్లిప్తంగా అంది స్వాతి.

"అది కాదు స్వాతీ! నీకొచ్చే జీతంతో వాళ్లని పోషించవచ్చు మీ నాన్నగారు అనుకున్నట్లే రవిని డాక్టర్ని చేయవచ్చు ఇక అమ్మా వాళ్లకి అభ్యంతరం ఏముంటుంది?" అన్నాడు సూర్య నచ్చజెప్తున్నట్లు.

**మా నాన్నగారు ఏదో సంపాదించి రాశులు పోసి ఉంటారనే పిచ్చి ఆశతో నన్ను చేసుకుంటానన్నారు. అంతవరకూ లక్ష్మీదేవిలా కనిపించిన నేను నాన్నగారు పోయాక వాళ్ల కళ్లకు జ్యేష్టాదేవిలా కనిపించాను**

"అక్కడే పొరపడుతున్నావు మావయ్యా. అమ్మమ్మా తాతయ్యలకు అంత పెద్ద మనసు ఉంటే మన పెళ్లి ఎందుకిలా ఆగిపోతుంది? మా నాన్నగారు ఏదో సంపాదించి, రాశులు పోసి ఉంటారనే పిచ్చి ఆశతో నన్ను చేసుకుంటానన్నారు. అంతవరకూ లక్ష్మీదేవిలా కనిపించిన నేను నాన్నగారు పోయాక వాళ్ల కళ్లకు జ్యేష్టాదేవిలా కనిపించాను. అందుకే వదిలించుకోవాలనుకున్నారు. వాళ్ల మనస్తత్వం అర్థం అయ్యాక కూడా ఎంత ఉద్యోగం చేస్తే మాత్రం ఏ ధైర్యంతో ఆ ఇంటి కోడలిగా రాగలను? పెళ్లయ్యాక రవిని చదివించనిస్తారనే నమ్మకం నాకు లేదు" అంది స్వాతి అదే నిర్లిప్తతతో.

"అంతేనా స్వాతీ! వాళ్ల సంగతి సరే, నా మీద నమ్మకం లేదా నీకు? రవిని నా స్వంత తమ్ముడిలా చూసుకుంటాను" హామీగా అన్నాడు.

"నీ మీద నమ్మకం లేక కాదు మావయ్యా. ఇంత జరిగాక భవిష్యత్తు ఎలా ఉంటుందో చెప్పానంతే. నువ్వే కాదు మావయ్యా, నేను కూడా నువ్వు లేకుండా..." ముంచుకొచ్చిన దుఃఖంతో ఆ పైన మాట్లాడలేక ఫోన్ పెట్టేసింది స్వాతి.

ఫోన్ వంకే చూస్తూ చాలాసేపు అలా ఉండిపోయాడు సూర్య. నాలాగా స్వాతి ఫీలవడం లేదు. నిజంగా స్వాతి నా కోసం ఆరాటపడుతూ ఉంటే ఇలాంటి నిర్ణయం తీసుకునేదా? అనుకున్నాడు సూర్య ఇన్నాళ్లూ. కానీ ఈరోజు స్వాతి మాటలు వింటూంటే, ఎంత బాధని పళ్ల మధ్య బిగబట్టి ఈ నిర్ణయం తీసుకుందో అర్థమైంది. ఎవరేమనుకున్నా నీ కండగా నేనున్నాను అని ఎలా నమ్మించాలి? ఎలా తన నిర్ణయాన్ని మార్చాలి? అని ఆలోచిస్తూనే ఆ రాత్రంతా గడిపేశాడు సూర్య.

* * *

"మిష్టర్ సూర్యా. జస్ట్ మినిట్!" అంటూ పిలుపు వినబడడంతో అప్పుడే క్లాసు ముగించుకొని వచ్చి స్టాఫ్ రూమ్‌లోకి వెళ్లబోతున్న సూర్య ఆశ్చర్యంగా వెనుదిరిగాడు "ఎస్!" అంటూ.

"అయాం చిరంజీవి"

"చిరం...జీవి..." అని గుర్తుకొచ్చినట్లుగా "ఓహ్, మీరు మా మాలతి హజ్బెండ్ కదూ. గ్లాడ్‌టు మీట్యూ!" అన్నాడు సూర్య షేక్ హేండ్ ఇస్తూ.

"ప్లీజ్ టు మీట్యూ. మీకేం అభ్యంతరం

లేకపోతే అలా కాసేపు కూర్చుందామా? " అన డిగాడు చిరంజీవి, దూరంగా ఉన్న చెట్ల వైపు చూపిస్తూ.

"విత్ ప్లెజర్... మాలతి రాలేదా మీతో? రండి. అలా కేంటీన్‌కి వెళ్లి మాట్లాడు కుందాం!" అన్నాడు సూర్య.

"మాలతిని నా ఫ్రెండ్ ఇంట్లో దించి వచ్చాను. సాయంత్రం వస్తుంది తను" అన్నాడు చిరంజీవి.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ కేంటీన్ వైపు నడిచారు. సూర్య ఇద్దరికీ రెండు ప్లేట్ల సమో సాలు, టీ పట్టుకు వచ్చాడు. "తీసుకోండి" అంటూ చిరంజీవి ముందుంచాడు. అవి తింటూ "ఇప్పుడు చెప్పండి" అన్నాడు సూర్య ఆసక్తిగా చిరంజీవి వంకే చూస్తూ.

"చెప్పడానికేం లేదండీ! నేను పనుండి హైద్రాబాదు వస్తూంటే మాలతి కూడా నాతో వచ్చింది. మిమ్మల్ని చూడాలంటూ మీ ఫోన్ నంబరు తెలియదు కనుక, నేను కాలేజీకి వచ్చాను" అన్నాడు చిరంజీవి.

"పోన్లెండి, ఇలాగైనా మిమ్మల్ని కలుసుకో గలిగాను. అసలే మీ పెళ్లికి రాలేదని మాలతి నా మీద అలిగిందట" అంటూ నవ్వాడు సూర్య.

అరమరికలు లేకుండా కొత్త వ్యక్తినైనా నాతోనే ఇంత ఆప్యాయంగా మాట్లాడుతు న్నాడు సూర్య. ఇక స్వాతీ, మాలతిలతో ఎలా ఉంటాడో వేరే చెప్పాలా. అందుకే స్వాతి అంతలా బాధ పడుతోంది సూర్యని వదులు కోలేక అనుకున్నాడు చిరంజీవి.

"మాలతి ఎప్పుడూ మీ ఇద్దరి గురించే చెప్తూ ఉంటుంది. వాళ్లిద్దరూ కలిసి చిన్న ప్పుడు మిమ్మల్ని చాలా ఏడిపించేవారట కదా!" అన్నాడు చిరంజీవి చనువుగా.

"మరి అడక్కండి, వాళ్లిద్దరి సంగతీను, అదే మిటో వాళ్లిద్దరూ కలిసి నన్ను ఆట పట్టించ డానికి రోజుకో కొత్తరకం ఐడియాలు వచ్చేవి కాబోలు, తెలియకుండానే నన్ను ట్రాప్ చేసి తెగ సంబరపడే వారిద్దరూ. వీళ్లిద్దరికీ తోడు ఆ రవిగాడు. ముగ్గురూ కలిసి నా దుంప తెంపేవారు" అన్నాడు సూర్య గలగలా నవ్వుతూ. ఆ నవ్వును మైమరిచినట్లుగా చూస్తుండిపోయాడు చిరంజీవి కాసేపు.

"సాయంత్రం ఎక్కడ కలుసుకుందాం? మీరు మా ఫ్రెండ్ ఇంటికి వస్తారా, లేక ఇంకె క్కడైనా..." అన్నాడు చిరంజీవి.

తమ ఇంటికి ఆ నవదంపతులను ఆహ్వా నించే సాహసం చేయలేకపోయాడు సూర్య. అలా అని వాళ్ల ఫ్రెండ్ ఇంటికి వెళ్లడానికి మొహమాటంగా అనిపించింది సూర్యకి. "ఇళ్లకి వద్దులెండి. సాయంత్రం టాంక్‌బండ్ దగ్గర తెలుగు తల్లి విగ్రహం వద్ద ఉండండి. నేను వచ్చి పికప్ చేసుకుంటాను. రాత్రికి సర దాగా ఎక్కడైనా డిన్నర్ చేద్దాం!" అన్నాడు.

"ఓకే... మరి నే వెళ్తొస్తాను" అంటూ లేచాడు చిరంజీవి.

"సరే!" అంటూ మరోసారి చిరంజీవికి షేక్‌హేండ్ ఇచ్చాడు సూర్య.

అనుకున్నట్లుగానే ముగ్గురూ టాంక్‌బండ్ దగ్గర కలుసుకున్నారు ఆ సాయంత్రం. సూ ర్యని చూస్తూనే "బాగున్నారా మావయ్యా? " అంటూ ఆప్యాయంగా పలకరించింది మాలతి.

"ఆ బావున్నానమ్మా. నువ్వు బాగున్నావా? సారీ మాలతీ! మీ పెళ్లికి రాలేకపోయాను" అన్నాడు సూర్య అపాలజెటిక్‌గా.

"దాందేముందిలెండి మావయ్యా. రాలేకపో యినా మనసులో అభిమానం ఉంటే చాలు నాకు" అంది మాలతి.

"అభిమానం ఎప్పుడూ ఉంటుందమ్మా. ఆ రోజు నా మనసేం బాగుండక రాలేకపో యాను" అన్నాడు సూర్య కారణం చెప్తూ.

"ఆ మాత్రం నేనర్థం చేసుకోగలను మావయ్యా. ఇంకా విషయం వదిలెయ్యండి. ఏమిటి సంగతులు? అమ్మా నాన్నా ఎలా ఉన్నారు? మళ్లీ మీ పెళ్ళి విషయమై ఇంట్లో ఏమైనా ప్రస్తావన వచ్చిందా? " అనడిగింది. మాలతి సూర్య వంక ఆసక్తిగా చూస్తూ.

"నీకు విషయమంతా తెలుసు కదా. పాత పాటే! స్వాతిని మర్చిపోయి ఆ నీలవేణిని చేసుకొమ్మని ఒకటే పోరు. నేను ఖచ్చితంగా చెప్పేశాను. అది జరిగే పని కాదని" అన్నాడు సూర్య.

"ఐతే సూర్యా... ఇప్పుడేం చేద్దామనుకుంటు న్నారు? స్వాతిగారు చూస్తే ఆ రకమైన నిర్ణయం తీసుకున్నారు. మీరిలా ఇంట్లో వత్తి డికి లోనవుతున్నారు" అన్నాడు చిరంజీవి.

"ఏదేమైనా నేను మాత్రం స్వాతిని వదులు కోలేనండీ. వీలయితే నచ్చజెప్పే ప్రయత్నం చేస్తాను. లేకుంటే నేనూ ఇలాగే ఉండిపో



తాను. నా నిర్ణయంలో మార్పేమీ ఉండదు. ఆపైన కాలానికే వదిలేస్తాను!" అన్నాడు సూర్య.

"కానీ ఎన్నాళ్లిలా ఉండిపోతారు? అసలిది సాధ్యమయ్యే పనేనా?" అన్నాడు చిరంజీవి సందేహంగా చూస్తూ.

"సాధ్యమనే అనుకుంటున్నాను. ఎందు కంటే తన కోసం ఆరు సంవత్సరాలు వేచి ఉన్నవాడిని. మరి కొంతకాలం ఆగలేనా?" అన్నాడు సూర్య. ఆ రోజు ఫోన్‌లో స్వాతి ఏడుస్తూ అన్న చివరి మాటలు గుర్తుకొచ్చి.

సూర్య మాటలు విన్న చిరంజీవి ప్రశంస గా సూర్య వంక చూస్తూ "సూర్యా! నేననుకు న్నట్లే మీరు చాలా స్థిరమైన నిర్ణయంతో ఉన్నారు. ఈ ప్రపంచంలో ఏ శక్తీ మిమ్మల్ని వేరు చేయలేదు. నాకా నమ్మకం ఉంది. మొన్న స్వాతి దగ్గర నుండి మాలతికో ఉత్తరం వచ్చింది. అది చదివాక మిమ్మల్ని ఒకసారి కలిస్తే బాగుండుననిపించింది మా ఇద్దరికీ. అందుకే ఇలా వచ్చాం. ముందీ ఉత్తరం చదవండి. ఆ తరువాత ఏం చేద్దామో ఆలోచిద్దాం!" అన్నాడు చిరంజీవి.

మాలతి తన హేండ్‌బాగ్‌లో నుండి స్వాతి రాసిన ఉత్తరం తీసి సూర్యకిచ్చింది.

మాలతీ!

ఎలా ఉన్నావే అక్కడ? నాకు మాత్రం నువ్విక్కడ లేని లోటు కొట్టవచ్చినట్టు ప్రతి నిమిషం కనిపిస్తోందే!

మనిద్దరం కలిసి తిరిగిన బీచ్‌రోడ్, కైలాస గిరి, పబ్లిక్ లైబ్రరీ, జగదాంబా సెంటర్ అన్నీ

నిన్ను గుర్తుచేస్తున్నాయి. నువ్వెళ్లిపోయాక నేను షికారుగా ఒక్కసారి కూడా ఎక్కడికీ వెళ్లలేదు మాలతీ! బతుకంతా శూన్యమై పోయినట్లుగా చాలా వెలితిగా ఉంది.

నువ్వు ఫోన్‌చేసి మాట్లాడిన రెండు నిముషాలూ చాలా రిలీఫ్‌గా అనిపిస్తుంది. ఆ తరువాత మళ్లీ నా ఒంటరితనం, దిగులూ మామూలే! రవితో కూడా గతంలోలా సరదాగా గడపలేకపోతున్నాను. ఇంట్లో నాన్నగారు లేని వెలితి అనుక్షణం గుర్తుకొస్తూంటే అమ్మా, నేనూ, తమ్ముడూ మూగదయ్యాల్లా ఒకరితో ఒకరం మాటా పలుకూ లేకుండా యాంత్రికంగా నెట్టుకొస్తున్నాం రోజుల్ని.

చెప్పడం మర్చిపోయాను. ఇంత ఇబ్బందిలో ఉన్నా తమ్ముడికి టెన్త్‌లో నైంటీ పర్సెంట్ మార్కులు వచ్చాయే. నాకు జాబ్ రావడానికింకా ఏడెనిమిది నెలలు పడుతుందట. నాన్నగారు పోయిన కొత్తలో ఐదారు నెలలలో వస్తుందన్నారు. ఆ మాట చెప్పి రెండు నెలలైంది. ఇప్పుడింకా ఏడెనిమిది నెలలు అంటున్నారు. ఇది ఒకందుకు మంచిదే. అయినా ఈ ఏడెనిమిది నెలలూ అప్పులకి పోగా మిగిలిన డబ్బు సరిపోతుందా ఇంటి ఖర్చులకు అని భయంగా ఉందే మాలతి! మాకు పెన్షన్ సౌకర్యం ఉన్నా బాగుండును. అమ్మకి నాన్నగారి తరపున ఎంతో కొంత పెన్షన్ వచ్చేది ఇల్లు గడవడానికి. నగలు అమ్మితే ఏ కొరతా ఉండదు, కానీ ఇప్పుడున్న పరిస్థితుల్లో ఆ నగల మీద చెయ్యి వేస్తే అమ్మ భరించలేదని ఆలోచిస్తున్నాను.

పోనీ ఏదైనా టెంపరరీ జాబ్ చేద్దామంటే చదువాపడం ఇష్టం లేదే మాలతీ! ఈ చదువు కోసమేకదా మావయ్యనింత కష్టపెట్టి చేజేతులా దూరం చేసుకున్నది.

మొన్న మావయ్య ఫోన్ చేసినప్పుడు నాకు ఉద్యోగం వస్తుందని చెప్పానే. అది విని మావయ్య ఎంతో సంతోషపడిపోతూ మా పెళ్లికి ఇకపై ఎటువంటి ఆటంకం ఉండదన్నాడే. మావయ్యని వదులుకోవడం నాకు మాత్రం సంతోషమా చెప్పు. కానీ అమ్మమ్మా, తాతయ్యల నిజస్వరూపం తెలిశాక ధైర్యం చెయ్యలేకపోతున్నానే మాలతీ!

మరోపక్క ఈ విషయాలన్నీ అమ్మకి తెలిస్తే ఎంత బాధపడుతుందోనని బెంగగా ఉంది. మా దురదృష్టంకొద్దీ నాన్నగారిని కోల్పోయాం. ఇక ఉన్న అమ్మని కూడా పోగొట్టుకొని ఎలా బతకాలే మేమిద్దరమూ? నాన్నగారు అర్ధాంతరంగా చనిపోవడం వలన మా పెళ్లి ఆగిపోయింది. అమ్మమ్మా వాళ్లే వద్దంటున్నారు అని తెలియనివ్వకుండా చిన్నప్పటి నుండీ నాకున్న మొండితనాన్నే ఇప్పుడు ఆయుధంగా ప్రయోగిద్దామనుకుంటున్నాను.

అమ్మ దృష్టిలో నేనెలాగూ మొండిపిల్లనే కదా. అందుకే నేనే ఈ పెళ్లికి సుముఖంగా లేనట్లు అమ్మని నమ్మించే ప్రయత్నం చేస్తున్నాను. పాపం పిచ్చి అమ్మ ఈజీగా నమ్మేస్తుంది. దాంతో ఇక మావయ్యా, అమ్మమ్మలను పెళ్లి గూర్చి అడగదు. అలా ఈ సమస్యకు తాత్కాలికంగా తెరపడుతుంది. ఈలోగా మావయ్యకు పెళ్లయిపోతే రత్నం లాంటి తన తమ్ముడు చెయ్యి జారిపోయాడని అమ్మ నన్ను నాలుగు తిట్టి ఊరుకుంటుంది. ఇంతకు మించి మరో మార్గం నాకు కనబడడంలేదు.

కానీ మావయ్యకు వేరే అమ్మాయితో పెళ్లి అనే మాటే నా మనసుకు ముల్లులా గుచ్చుకొని బాధ పెడుతోందే. నిజంగా మావయ్య ఎవరినైనా చేసుకుంటే నేను తట్టుకోగలనంటావా? అసలు ఒక్కోసారి నాకేమనిపిస్తుందో తెలుసా... ఈ బాధ్యతలనూ, బరువులను పక్కనపెట్టి మావయ్యను పెళ్లి చేసుకొని హాయిగా సెటిల్ అయిపోదామని ఉంది. కానీ అది సాధ్యం కాదుగదా! అందుకే నా వ్యధ అంతా నీతో ఇలా వెళ్లబోసుకుంటున్నాను.

ఏదో నా బాధలో పడి నువ్వెలా ఉన్నావో, నీ సంగతేమిటో కనుక్కోలేదు చూశావా

ఎలా ఉంది కొత్త కాపురం? మూడు సిని మాలూ, ఆరు షికార్లుగా ఎంజాయ్ చేస్తున్నారా? అక్క దగ్గరకు వెళ్తానన్నావు, వెళ్లావా? వివరాలు రాయి.

ఇంత బాధలోనూ నీ ఉత్తరాలే నాకు ఊరటనిచ్చేది. ఫోన్ చేస్తున్నాను కదా అని ఉత్తరాలు రాయడం అశ్రద్ధ చేయవు కదా! ఉంటానే మాలతీ!

- స్వాతి.

ఉత్తరం చదివిన సూర్య కళ్లలో కన్నీళ్లు చిప్పిల్లాయి. "కష్టాలంటే ఏమిటో తెలియని స్వాతి ఎంత కష్టపడుతోందక్కడ? సమస్యంతా డబ్బుతోనే ముడిపడి ఉందని తెలిసిన నేను కూడా అసలు వాళ్లెలా గడుపుతున్నారు, ఆఫీసు నుండి ఎంత వచ్చింది అనే విషయాన్నే విస్మరించాను. అందుకే స్వాతి అంటుంది. సమస్య తీవ్రత అనుభవించే వాళ్లకు తెలిసినట్లుగా చూసేవాళ్లకు తెలియదని" అన్నాడు సూర్య భారంగా.

"రిలాక్స్ సూర్యా... జరిగిపోయిన దాని గూర్చి విచారించడం అనవసరం. ఇక ముందు జరగవలసినదాన్ని గూర్చి ఆలోచిద్దాం. మిమ్మల్ని వేరే పెళ్లి చేసుకోమని అంత ఖచ్చితంగా చెప్తూ ఉన్నా తనకి మిమ్మల్ని వదులుకోవడం ఎంతమాత్రం ఇష్టం లేదనే విషయం కన్‌ఫర్మ్ చేస్తోంది గదా ఈ ఉత్తరం. ఈ రోజు ఏదో భావావేశంలో తీసుకున్న నిర్ణయం రేపు కృంగిపోయేలా చేస్తుం ది. అందుకే మనమే దీనికి బ్రేక్ వెయ్యాలి.

కొంతకాలం, అంటే అది ఏడాదా, రెండేళ్లా అనేది కాదు ప్రశ్న. అంతవరకూ మీరు ఓపిక పట్టగలిగితే, ఇక మిగిలిన జీవితమంతా సుఖాంతమే. అయితే మీ తల్లిదండ్రులు మీ ఆలోచనను సాగనివ్వాలి కదా? " అన్నాడు చిరంజీవి.

"ఆ భయం మీకు అవసరం లేదు చిరంజీవి గారూ... స్వాతి నన్ను చేసుకోవడం జరగకపోతే నేనిక జీవితంలో పెళ్లి మాటే తల పెట్టకూడదనుకున్నాను. అందుకే అసలీ పరిసరాలకు దూరంగా వెళ్లిపోవాలని ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి రిసెర్చి కోసం ఢిల్లీ వెళ్దామనుకుంటున్నాను. అక్కడ నా మిత్రులు కొందరున్నారు. వాళ్లే నాకు మంచి గైడ్‌ని ఎంపిక చేసి పెట్టారు" అన్నాడు సూర్య.

"గుడ్ ఐడియా... ఇది మీక్కూడా కాస్త మార్పుగా ఉంటుంది. ఈలోగా స్వాతి మనసుని రిపేరు చేసే పనిని మాలతి, నేనూ తీసుకుంటాం!" అన్నాడు చిరంజీవి.

"ఆ పని చేయండి. జీవితాంతం మీకు రుణపడి ఉంటాను"అంటూ చప్పున చిరంజీవి రెండు చేతులూ పట్టుకున్నాడు సూర్య.

"ఛ. ఇదేమిటి సూర్యా. ఫ్రెండ్స్ మధ్య ఉండకూడనివి కృతజ్ఞతలూ, క్షమాపణలేనట. మాలతి చెప్పింది. వాళ్లిద్దరి ఫ్రెండ్‌షిప్ చూశాకయినా మనిద్దరం ఒకటి కావాలి కదా!" అంటూ నవ్వాడు చిరంజీవి . అతనన్న తీరు చూసి సూర్య కూడా నవ్వేశాడు హాయిగా.




"స్వాతీ! నాన్నగారు పోయిన దగ్గర నుండీ మా మనసేం బాగుండడంలేదమ్మా. ఏ క్షణంలో ఏం జరుగుతుందోనన్న భయం నన్ను కృంగదీస్తున్నది. నాన్నగారు నీ పెళ్ళి కళ్లారా చూడకుండానే వెళ్లిపోయారు. అమ్మమ్మా తాతయ్యల దగ్గర నుండీ ఇంకా ఏ సమాచారమూ రాలేదు. అసలు నెల తిరక్కుండానే నీ పెళ్లి చేసేస్తే నాన్నగారికి పుణ్యగతులు కలుగుతాయని చెప్పారంతా. ఇప్పుడు మూడోనెల గడుస్తోంది" అంది జానకమ్మ బాధగా.

"ఎందుకమ్మా నా పెళ్లి చేసెయ్యాలని

నీకంత తొందర? నేనిప్పుడప్పుడే పెళ్లి చేసుకో దలచుకోలేదు!" అంది స్వాతి.

ఆ మాటలు వినడంతోనే ఆందోళనగా కూతురి వంక చూస్తూ "ఏమిటే? మళ్లీ పాత పాటే మొదలుపెట్టావూ. ఎందుకే నన్నిలా వేధిస్తావు? రేపు వాళ్లొచ్చి ముహూర్తాలు పెట్టుకుందామంటే నేనేం చెప్పాలి? " అంది కోపంగా జానకమ్మ. ఇంకా వాళ్లు వస్తారనే గుడ్డి నమ్మకంతో ఉన్న తల్లిని చూస్తే జాలే సింది స్వాతికి.

"ఏం చెప్తావూ? ఉన్నమాటే చెప్పు. నేనిప్పుడప్పుడే పెళ్లి చేసుకోనని" అంది స్వాతి లేని నిర్లక్ష్యాన్ని నటిస్తూ.

"స్వాతీ... నేనో విషయం అడుగుతాను నిజం చెప్పు. అసలు సూర్యని చేసుకోవడం నీకు ఇష్టముందా లేదా తేల్చి చెప్పు ముందు" అంది జానకమ్మ నిలదీస్తున్నట్లుగా.

ఆ మాట కోసమే ఎదురు చూస్తున్న స్వాతి "ఇంతవరకూ వచ్చాక ఇంకెందుకమ్మా దాపరికం? నాకీ పెళ్లి మొదటి నుండీ ఇష్టంలేదు. మావయ్యకు వేరే సంబంధం చూసి చేసెయ్యమని చెప్పు!" అంది. బాధ్యతలు మీద పడతాయనే భయంతో నన్ను చేసుకోకూడదని వాళ్లు అనుకుంటున్న సంగతి తెలిస్తే తల్లి గుండె ఆగిపోతుందని. ఆ నిందని తనమీదే వేసుకొంది స్వాతి.

"ఛీ, నా కడుపున చెడబుట్టావు కదే. నేను మొదటి నుండీ నీ వైఖరిని అనుమానిస్తూనే ఉన్నాను. కానీ ఏదో చిన్నతనం వలన అలా చేశావనుకున్నానే కానీ ఇంత బరితెగిస్తావనుకోలేదు" అంది ఏడుస్తూ.

తల్లిని దగ్గరకు తీసుకొని ఓదార్చాలి అనిపించినా బలవంతాన నిగ్రహించుకొని తల్లి తిట్టే తిట్లను అన్నింటినీ వింటూ శిలలా కూర్చుండిపోయింది స్వాతి.

తిట్టి తిట్టి అలసిపోయిన జానకమ్మ ఆ పూట భోజనం మానేసి పడుకుంది. ఆ తరువాత వారం, పది రోజులపాటు స్వాతితో మాట్లాడడం మానేసింది. ఇద్దరి మధ్యా రవే మీడియేటర్‌లా వ్యవహరించాడు.

ఇంట్లో జరుగుతున్న ఈ కోల్డ్‌వార్ చుట్టుముడుతున్న ఆర్థిక సమస్యలూ స్వాతిని స్థిమితంగా ఉండనివ్వలేదు. యూనివర్సిటీ నుండి రెండు బస్సులు మారితేనేగాని ఇంటికి రావడానికి కుదరదు స్వాతికి. ఒక బస్ దిగి రెండో బస్ క్యాచ్ చేసేందుకు రోడ్ క్రాస్ చేస్తున్న స్వాతి పరధ్యానం వలన ఎదురుగా వస్తున్న వాహనాన్ని గమనించలేదు. ఫలితంగా ఏక్సిడెంటుకు గురై ఎడమ చెయ్యి విరగగొట్టుకుంది. తప్పు స్వాతిదే అయినా అందరూ బండి నడుపుతున్న వ్యక్తినే తప్పుపట్టారు. అతను కూడా గాబరా పడిపోతూ స్వాతిని డాక్టరు దగ్గరకు తీసుకెళ్లి కట్టు కట్టించి ఇంటి దగ్గర దింపి వెళ్లాడు.

కూతురు అలా దెబ్బలతో ఇంటికి రావడంతో జానకమ్మ తల్లడిల్లిపోయింది. అంతవరకూ కూతురి మీదున్న కోపాన్ని పక్కనపెట్టి సపర్యలు చేయడంలో మునిగిపోయింది.

దెబ్బలు తగిలితే తగిలాయి. అమ్మకి నా మీదున్న కోపం పోయింది అని సంతోషపడింది స్వాతి.

ఇంట్లో జరుగుతున్నదేమిటో అర్థం కాకపోయినా ఏక్సిడెంటయిన విషయం సూర్యకి చెప్పకుండా ఉండలేకపోయాడు రవి. యాక్సిడెంట్ సంగతి వినడంతోనే ఆదుర్దాగా బయలుదేరి వచ్చేశాడు సూర్య.

సూర్యని చూడడంతోనే స్వాతీ, జానకమ్మా ఆశ్చర్యపోయారు. కుశల ప్రశ్నలయ్యాక "నీకెలా తెలిసింది సూర్యా ఈ సంగతి? " అనడిగింది జానకమ్మ.

"ఎలా తెలిస్తే మీకెందుకు? అసలు నేననే వాడిని ఒకణ్ణి ఉన్నాననే విషయమే మీ తల్లీ కూతుళ్లు ఇద్దరికీ గుర్తు లేదు" అన్నాడు సూర్య నిష్ఠూరంగా.

"అంత మాటనకురా తమ్ముడూ. ఏమిటో దీన్నిలా చూడడంతో నాకు కాళ్లూ, చేతులూ ఆడలేదు. రాత్రంతా ఒకటే జ్వరం. ఆ జ్వరంలో ఏవేవో కలవరిస్తూ ఒకటే ఏడుపు.

రాత్రంతా ఇలా దాని మంచం దగ్గరే ఉండి పోయాను. నీకు ఫోన్ చేయాలని కూడా నాకు తోచలేదు" అంది జానకమ్మ.

అదంతా మౌనంగా వింటూ ఉండిపోయింది స్వాతి ఏమీ మాట్లాడకుండా. జానకమ్మ వంటింట్లోకెళ్లాక సూర్య ఆప్యాయంగా స్వాతి ముఖం మీద పడిన ముంగురులు సవరిస్తూ "ఎలా ఉంది స్వాతీ. బాగా నొప్పిగా ఉందా? " అన్నాడు లాలనగా.

సూర్య చెయ్యిని గట్టిగా పట్టుకొని చెంపకు ఆనించుకుంటూ. "ఇలా ఉంటే చాలా హాయిగా ఉంది మావయ్యా. కానీ అమ్మతో చెప్పేశాను నువ్వంటే నాకిష్టం లేదని" అంది స్వాతి కన్నీళ్లతో.

"ఏయ్ పిచ్చీ ఇప్పుడవన్నీ ఎందుకు నీకు? రిలాక్స్ ఓ రెండు రోజులు నేనిక్కడే ఉంటాను కదా. అన్ని దిగుళ్లూ మర్చిపోయి విశ్రాంతి తీసుకో!" అన్నాడు సూర్య. ఆ మాటలు వినడంతోనే స్వాతి కనుకొలకుల నుండి నీళ్లు జారాయి దిండు మీదకు.

సూర్య సున్నితంగా కళ్లు ఒత్తుతూ ప్రేమగా నుదుటి మీద ముద్దు పెట్టుకొని "డోంట్ ఫియర్ మై బేబీ. ఐయామ్ ఆల్వేస్ ఫర్ యూ!" అంటూ చెంప మీద చిన్నగా తట్టాడు చేత్తో.

మరుసటి రోజు జానకమ్మ వంట చేస్తున్నపుడు అక్కడికి వెళ్లి కూర్చున్నాడు సూర్య, "ఏమిటక్కా. విశేషాలు? " అంటూ.

"ఏముంటాయిరా, అంతా మామూలే. స్వాతి వరసే నాకేం నచ్చడంలేదు" అంది జానకమ్మ కూతురు తనతో అన్న మాటలు సూర్యతో చెప్పేందుకు మనసు రాక.

"స్వాతి గూర్చి నువ్వే వర్రీ అవకు. తన సంగతి నేను చూసుకుంటాను. బావగారు పోయాక ఎంత వచ్చింది. ఏం మిగిలింది? స్వాతికి ఉద్యోగం రావడానికి ఎన్నాళ్లు పడుతుంది. ఆ వివరాలు చెప్పు ముందు" అన్నాడు సూర్య.

"ఏం చెప్పమంటావు? రావడమైతే రెండున్నర లక్షలు వచ్చింది. లోన్స్ అన్నీ క్లియర్ అయి అందులోంచి రెండు లక్షలూ మీ బావగారు ష్యూరిటీ సంతకం పెట్టారు కదా, దానికి కట్టాం. మిగతా యాభైలో ఓ పదివేలు చిల్లర అప్పులు తీర్చాం. పదిహేను వేలు ఈ మూడు నెలలూ జాగ్రత్తగా ఖర్చుచేస్తూ వచ్చాం. ఇక పాతికవేలు మిగిలాయి. ఉద్యోగం చూస్తే ఇంకా ఏడెనిమిది నెలలదాకా రాదంటున్నారు. ఇప్పుడు చేతికీ, నోటికీ అయిపోయింది నా పరిస్థితి. నాకు చెప్తే బాధపడతానని స్వాతి ఏం చెప్పకుండా అన్నీ అదే చూస్తోంది. కాని నాకు తెలియకుండా ఎలా అవుతుంది. నాకైతే నా నగలన్నీ అమ్మేసి డబ్బు బ్యాంకులో వేద్దామని ఉంది. కానీ అవి మీ పెళ్లి ఖర్చులకు పనికివస్తాయని ఇన్నాళ్లూ ఆగాను" అంది జానకమ్మ.

"అంత అవసరం ఇప్పుడేమొచ్చిందక్కా. రవిగాడి పైచదువులకు చాలా అవసరాలుంటాయి. అప్పుడు వాటిని వినియోగిద్దాం! ఇదిగో. నేను ముప్పైవేలు తెచ్చాను. ప్రస్తుతానికి ఉంచు" అంటూ జేబులో నుండి డబ్బు తీసి జానకమ్మ చేతిలో పెట్టాడు సూర్య.

"అదేమిట్రా. నేను నీకివ్వవలసింది పోయి నీ దగ్గర తీసుకోనా? అమ్మా నాన్నలకు ఇది తెలిస్తే ఏమైనా బాగుంటుందా? " అంది జానకమ్మ సంశయంగా చూస్తూ.

"ఇందులో బాగుండకపోవడానికేం ఉందక్కా. మనిద్దరం చిన్నప్పటి నుండీ ఓ తల్లిపిల్లల్లా పెరిగాం. ఇప్పుడు నీదీ నాదీ అనే భేదాలెంచకు. ఆ, చెప్పడం మర్చిపోయాను. నేను జాబ్ రిజైన్ చేశాను. మరో పది రోజుల్లో రీసెర్చ్ కోసం ఢిల్లీ వెళ్తున్నాను. ఆ సంగతి చెప్దామనే బయలుదేరి వద్దామనుకున్నాను ఇక్కడికి. ఇదిగో ఇంతలో ఇలా జరిగింది" అన్నాడు సూర్య.

"ఇక నువ్వలా అంటే నేనేమనగలను? కానీ బంగారం లాంటి ఉద్యోగం వదులుకొని అంతదూరం వెళ్తే ఎలారా? " అంది జానకమ్మ దిగులుగా.

"వెళ్తేనే ఫ్యూచర్ బాగుంటుందక్కా. ఇంకో సంగతి. నా రీసెర్చ్ అయ్యేవరకూ మా పెళ్లి వాయిదా వేస్తే మంచిదని ఆలోచిస్తున్నాను. నీ అభిప్రాయం ఏమిటి? " అన్నాడు సూర్య, తన రీసెర్చ్ వల్లనే పెళ్లి ఆగిపోతుంది అంటే అక్క మనసు శాంతిస్తుందని అనుకొని. ఈ ప్రస్తావన విని తెల్లబోయింది జానకమ్మ. కూతురు అన్న మాటల గూర్చి తమ్ముడికి ఏమని చెప్పాలి? అని బెంగ పడుతున్న జానకమ్మకి ఈ మాటలు కొంత ఊరట కలిగించాయి. అలాగే ఇంత అభిమానంగా తమని చూసుకొనే తమ్ముడి మనసు నొప్పించాలంటే మనసు రాలేదామెకి. అందుకే ఏమీ తెలియనిదానిలా మౌనంగా ఉండిపోయింది.

* * *

ఆ రెండు రోజులూ అక్కడ ఉండి ఏమీ జరగనట్లే జానకమ్మతోనూ స్వాతితోనూ కబుర్లు చెప్తూ గడిపేశాడు సూర్య. రవితో చదువు గూర్చి చర్చించాడు. ఎలా చదివితే బాగుంటుందో, ఎంసెట్‌లో మంచి ర్యాంక్ సాధించాలి అంటే ఏంచేయాలో ఒకటికి పదిసార్లు చెప్పాడు.

సూర్య ఢిల్లీ వెళ్తున్నాడని విని అందరికంటే ఎక్కువ ఆశ్చర్యపోయింది స్వాతి. తన మూలంగానే మావయ్య ఇలా ఉద్యోగానికి రాజీనామా చేసి వెళ్లిపోతున్నాడని లోలోపల మధనపడిందే గాని ధైర్యంచేసి ఎందుకిలా చేస్తున్నావు మావయ్యా అని అడగలేకపోయింది.

వెళ్లే ముందు "స్వాతీ... దేని గురించీ ఎక్కువగా ఆలోచించి మనసు పాడుజేసుకోకు. నీ కష్టంలో, సుఖంలో నేనెప్పుడూ నీకు తోడుగా ఉంటానని మర్చిపోకు. నీ దృష్టిని పూర్తిగా చదువు మీదే కాన్‌సెన్‌ట్రేట్ చెయ్యి. ఎలాగూ జాబ్ వచ్చేందుకు ఏడెనిమిది నెలలు పడుతుందంటున్నారు కనుక ఏ చింతా లేకుండా పీజీ పూర్తి చెయ్యి. అదో అదనపు క్వాలిఫికేషన్‌గా ఉపయోగపడుతుంది నీకు. డబ్బు అవసరం వస్తే నేనున్నాననే సంగతి గుర్తు పెట్టుకో!" అన్నాడు సూర్య.

అన్నిటికీ అలాగేనన్నట్లుగా మౌనంగా తల ఊపింది స్వాతి.

ఆఖరి నిముషం వరకూ తాను ఢిల్లీ వెళ్తున్న సంగతి రాజయ్యా శాంతమ్మలకు తెలియనివ్వలేదు సూర్య.

కొడుకు ఉద్యోగం వదిలి వెళ్తున్నాడని వినడంతోనే పెద్ద గొడవ చేశాడు రాజయ్య.

"ఈ ఇంట్లో ఎవరికి వాళ్లే పెద్దవాళ్లయిపోతున్నారు. ఇక మా పెద్దరికాలేమి మిగిలినట్లు. మేమేం రాళ్లెత్తమన్నామా. బండలెత్తమన్నామా? హాయిగా పెళ్లి చేసుకొని పిల్లా పాపలతో సుఖంగా ఉండమంటే అదేదో అపరాధంలా ఇలా దేశాలు పట్టిపోతున్నావు. నీకిదేమైనా బాగుందా? " అనడిగాడు రాజయ్య.

మా పెద్దరికాలేమి
మిగిలినట్లు?
మేమేం
రాళ్లెత్తమన్నామా?
బండలెత్తమన్నామా?
హాయిగా పెళ్లి
చేసుకొని పిల్లా
పాపలతో సుఖంగా
ఉండమంటే అదేదో
అపరాధంలా
ఇలా దేశాలు
పట్టిపోతున్నావు.



"నేనేం మీ పెద్దరికాలను ప్రశ్నించడంలేదు. అయినా నేను జాబ్ రిజైన్ చేసింది బలాదూరుగా తిరగడానికి కాదు. రీసెర్చ్ కోసం. రీసెర్చ్ చేసి డాక్టరేట్ సంపాదిస్తే ఇంకా మెరుగైన పొజిషన్ వస్తుంది నాకు. ఇందులో తప్పేమిటో మీరెందుకింత రాద్ధాంతం చేస్తున్నారో నాకర్థం కావడం లేదు" అన్నాడు సూర్య.

సూర్య అలా అనడంతో కొడుకు వంక నిస్సహాయంగా చూస్తూ "ఒరేయ్ సూర్యా! నీ మాటలు నా దగ్గరటరా? సరే స్వాతిని చేసుకోవద్దన్నామనే కదా నీవిలా ఇల్లు వదిలేసి వెళ్లిపోతున్నది. సరే నీ ఇష్టం. దాన్నే చేసుకొని ఊరేగు. అంతేగాని ఈ వయసులో మమ్మల్ని ఇలా విడిచిపెట్టి వెళ్లకురా!" అన్నాడు ప్రాధేయపడుతున్నట్లుగా.

తండ్రి తనని తిడతాడు అనుకున్నాడుగాని ఇంత త్వరగా తన పట్టుదలను వదిలి రాజీకి వస్తాడనుకోలేదు సూర్య. అంత తగ్గిపోయి మాట్లాడిన తండ్రితో వాదన పెంచలేకపోయాడు సూర్య.

"అదేం లేదు నాన్నా. మీరేదో స్వాతిని వద్దన్నారని కాదు, నాకెప్పటి నుండో ఢిల్లీ యూనివర్సిటీలో రీసెర్చ్ చేయాలని కోరిక. అదిన్నాళ్లకు తీరిందంతే. అంతేకాని మిమ్మల్ని నొప్పించాలని కాదు" అన్నాడు సూర్య మృదువుగా.

శాంతమ్మ కూడా కొడుకు నిర్ణయం విని ఢీలా పడిపోయింది. తాను కూడా రాజీకి వచ్చినట్లుగా, "బాబూ ఈ వయసులో మాకు కావలసింది నీ సుఖమేరా. నిన్ను కష్టపెట్టాలని కాదురా స్వాతిని ఒద్దన్నది" అంటున్న తల్లి మాటలను మధ్యలోనే ఆపేస్తూ "ఇప్పుడవన్నీ ఎందుకమ్మా? నాకు మీ మీద ఏ కోపమూ లేదు. నన్ను నమ్మండి!" అన్నాడు సముదాయిస్తున్నట్లుగా.

అలా సూర్య ఎవరినీ నొప్పించకుండా ఢిల్లీ వెళ్లిపోయాడు.

ఢిల్లీ వెళ్లింతరువాత స్వాతికి ధైర్యం చెప్తూ ఉత్తరాలు రాస్తున్నాడు సూర్య. అలాగే స్వాతి ఉత్తరాల్లో కూడా చెప్పలేని విషయాలను మాలతి చిరంజీవి రాసే ఉత్తరాల ద్వారా తెలుసుకుంటూ దానికి తగినవిధంగా తమ ముగ్గురి ఆలోచనలనూ క్రోడీకరించి భవిష్యత్ ప్రణాళికకు రూపకల్పన చేయసాగాడు.

21



అనుకున్నట్లుగానే స్వాతి ఎం.ఏ. ఫైనల్ పరీక్షలు రాస్తూండగా ఉద్యోగానికి అపాయింట్‌మెంట్ ఆర్డరు అందుకుంది. ఈ వార్త కోసమే ఎదురుచూస్తున్నా ఉద్యోగం వస్తుందని ముందుగానే తెలిసినా ఆర్డరు చేతిలో పడేసరికి కలిగే ఆనందమే వేరు!

"అమ్మా! నాకు ఉద్యోగం వచ్చిందమ్మా. ఇక మన కష్టాలు గట్టెక్కినట్లేనమ్మా!" అంది స్వాతి తల్లిని పట్టుకొని ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతూ.

కూతురికి ఉద్యోగం రావడం సంతోషించదగినదే. అయినా తమ మూలంగా కూతురి బతుకు ఎక్కడ నిస్సారంగా అయిపోతుందోననే భయం జానకమ్మని నిలువనీయడం లేదు. అలా అని కూతురి ఉత్సాహాన్నీ నీరుకార్చలేకపోయింది. కొడుకునీ, కూతుర్నీ తీసుకొని గుడికి వెళ్లింది.

అపాయింట్‌మెంట్ ఆర్డరు తీసుకొని జాయిన్ అయ్యేందుకు వెళ్లింది స్వాతి. నేరుగా చక్రధరంగారి వద్దకు వెళ్లింది. తండ్రి ఉండగా ఏదో పనిమీద తరచు ఆఫీసుకు వస్తూపోతూ ఉండడం వలన అలవాటయిన పరిసరాలే కనుక ఏ వెతుకులాటా లేకుండా వెళ్ళింది అక్కడికి.

స్వాతిని చూడడంతోనే చక్రధరంగారు "రామ్మా స్వాతీ! నీ కోసమే చూస్తున్నాను. పద డి.యం.గారి దగ్గరకు వెళ్లి జాయినింగ్ రిపోర్టు ఇద్దువుగాని" అంటూ సీట్లోంచి లేచా రాయన.

"అంకుల్, దారిలో ట్రాఫిక్ జామయి అర గంట ఆలస్యంగా వచ్చాను. ఫర్వాలేదా? " అంది స్వాతి సందేహిస్తున్నట్లుగా చూస్తూ.

"మరేం ఫర్వాలేదమ్మా. అవన్నీ నేను చూసుకుంటాను కదా!" అన్నారు చక్రధరం గారు అనునయంగా.

"థాంక్సంకుల్!" అంటూ చక్రధరంగారి వెంట నడిచింది స్వాతి.

ఇద్దరూ డి.యం. కాబిన్‌లోకి అడుగుపె ట్టారు. స్వాతి "గుడ్ మార్నింగ్ సార్!" అంటూ విష్ చేసింది. చక్రధరంగారు మాట్లా డారు "సార్! మన రంగారావుగారి అమ్మాయి స్వాతి" అనే ఆయన మాటను పూర్తి చెయ్య నివ్వలేదు డి.యం. చంద్రశేఖరంగారు.

"ఐనో ఐనో. ప్లీజ్ బి సీటెడ్. ఏమ్మా అమ్మగారు కులాసాగా ఉన్నారా? " అంటూ పరామర్శించారాయన.

"ఆ కులాసాయే సార్!" అంటూ స్వాతి చేతిలోని జాయినింగ్ రిపోర్టు చంద్రశేఖరం గారి ముందుంచింది. ఆయన దానిని అందు కొని సంతకం చేస్తూ, "నేను మన ఏ.యం.గారితో మాట్లాడానమ్మా. నిన్ను పర్స నల్ డిపార్టుమెంటులో వేయమని చెప్పానా యనతో" అని కళ్లజోడు తీసి రుమాలుతో అద్దుకుంటూ. "మీ నాన్నగారింకా ఆఫీసుకు వచ్చిపోతున్నట్లే ఉందమ్మా నాకు. ఎప్పుడూ చిరునవ్వుతో ప్లెజెంట్‌గా ఉండేవారు. చీమ కైనా అపకారం తలపెట్టని మనిషి. ఆ దేము డెంత నిర్దయుడు కాకపోతే మీకింత కష్టం తెచ్చి పెడతాడు? " అన్నారాయన సానుభూ తిగా స్వాతి వంక చూస్తూ.

తండ్రి ప్రస్తావన రావడంతోనే స్వాతి కంటి వెంట జలజలా జారాయి కన్నీళ్లు. అది చూసి "అరెరే, ఏంటమ్మా ఇది? నేనేదో ఉండబట్ట లేక అన్నాను. ఆఫీసులో జాయిన్ అయిన రోజే ఇలా కంటతడి పెట్టవచ్చా? బీ బ్రేవ్ మై చైల్డ్. నీకే ఇబ్బంది కలిగినా డైరెక్టుగా నా దగ్గరకు రామ్మా. మీ నాన్నగారెంతో నేనూ అంతే అనుకో. ఆ పైన చక్రధరంగారున్నారు. వెళ్లి రామ్మా!" అన్నారు చంద్రశేఖరంగారు ఆదరంగా చూస్తూ.

చక్రధరంగారు ఏడుస్తున్న స్వాతిని పొదివి పట్టుకొని "ఊర్కోమ్మా!" అన్నారు అనున యంగా.

చక్రధరంగారి వెంట మెల్లగా అడుగులు వేస్తూ తనకు కేటాయించిన డిపార్టుమెంటుకు వచ్చింది స్వాతి. తన తండ్రి పనిచేసే సీటు లో వేరెవరో కూర్చొని పనిచేస్తూ ఉండడం చూసింది. ఆ సీటు ముందుకు రాగానే అప్ర యత్నంగా స్వాతి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

ఎన్ని సాయంత్రాలు స్కూలు నుండి, కాలేజీ నుండి ఇక్కడికి వచ్చి మారాం చేసి బజారుకు లాక్కువెళ్లి కావల్సినవన్నీ కొనిపిం చుకొనేది తను. ఏమైపోయాయి ఆ అంద మైన సాయంత్రాలు? అనుకుంది స్వాతి.

ఆ సెక్షనులో చాలామందికి స్వాతి తెలుసు కనుక అందరూ స్వాతివైపు సానుభూతిగా చూశారు. అడుగు కదపలేనట్లుగా అక్కడే ఆగిపోయిన స్వాతిని చూసి "రామ్మా. ఆ పక్క సెక్షనులోనే నీ సీటు కేటాయించారు. ఇక్కడైతే గతాన్ని గుర్తు చేసుకొని బాధపడతా వని నేనే అక్కడ వెయ్యమన్నాను" అన్నారు చక్రధరంగారు.

ఆ మాటలతో స్పృహలోకి వచ్చిన స్వాతి చక్రధరంగారి వెంట నడిచింది భారంగా.

అక్కడ చాలామందితో గతంలో పరి చయం ఉండడం వలన ఏ ఇబ్బందీ లేకుండా చాలా తొందరగానే వాళ్లలో కలిసి పోయింది స్వాతి. వాళ్లు కూడా రంగారావు గారి మీదున్న అభిమానంతో స్వాతిని ఆద రంగా చూడసాగారు.

రంగారావు బతికి ఉన్నప్పుడు వెనకా ముందూ చూసుకోకుండా ఖర్చుపెట్టిన జాన

కమ్మ ఇప్పుడు ప్రతి పైసా ఆచి తూచి ఖర్చు పెట్టసాగింది.

పెళ్లి కోసం స్వాతికి చేయించిన నగలన్నింటిని దాచి ఉంచి తన నగలను మాత్రం అమ్మివేసి, రవి పేరునా, స్వాతి పేరునా చెరి సగం డిపాజిట్ చేసింది. స్వాతికి వచ్చే జీతం నుండి కూడా నెలకి వెయ్యి రూపాయల చొప్పున రికరింగ్ డిపాజిట్ చేసింది.

తండ్రి ఉన్నప్పుడు జీతం తెచ్చి ఎలా ఇంట్లో ఇచ్చేవాడో స్వాతి కూడా తన ఖర్చులకు ఉంచుకొని మిగతాది తల్లి చేతిలో పెడుతోంది. ఎప్పుడైనా జానకమ్మ ఖర్చుల వివరాలు చెప్పబోతే "నీకంటే నాకు ఎక్కువ తెలుసా అమ్మా! నా కెందుకు అవన్నీ?" అంటూ వెళ్లిపోయేది స్వాతి.

రవి ఇంటర్ ఫస్టియర్ పరీక్షలు రాశాడు. సెలవుల్లో పదిరోజులు మాలతి ఇంటికి వెళ్లి వచ్చాడు. రవితో పాటు చిరంజీవి, మాలతి కూడా విశాఖపట్నం వచ్చారు.

వాళ్ల రాకతో స్వాతిలో ఏదో నూతనోత్సాహం వచ్చినట్లయింది. నలుగురూ కలిసి సినిమాలకూ, షికార్లకూ తిరిగారు. అందరూ కలిసి అరకు వెళ్దామని ప్లాను వేసుకున్నారు. వాళ్లతో పాటు వాసూ, శ్రీకాంత్‌లను కూడా తీసుకువెళ్లారు. అయితే ఖర్చు మాత్రం మొత్తం చిరంజీవే భరించాడు. అలా అయితేనే నేను అరకు వస్తాను, లేకపోతే లేదు అనడంతో స్వాతి ఏం మాట్లాడలేకపోయింది.

అరకు నుంచి వచ్చిన తర్వాత ఒక రోజంతా విశ్రాంతి తీసుకున్నారు ఎక్కడికీ కదలకుండా. మరునాడు వుడా పార్కుకు, బీచ్‌కు వెళ్లారు. వాసు, శ్రీకాంత్, రవీ ఒక బ్యాచ్‌గా విడిపోయి బీచ్ అంతా రౌండ్లు కొట్టడానికి వెళ్లారు. స్వాతి, మాలతి, చిరంజీవి కబుర్లాడుతూ కూర్చున్నారు. అయితే ఎంతో ఉత్సాహంగా మాట్లాడుతున్న స్వాతి సడెన్‌గా సైలెంట్ అయిపోయింది.

కన్నుల పండుగగా కనిపిస్తున్న మాలతి చిరంజీవుల జంటను చూస్తూ వుంటే సూర్య లేని వెలితి స్వాతిని బాధించసాగింది. అంతవరకూ ఉత్సాహంగా ఉన్న స్వాతి అలా మూగనోము పట్టినట్లు కూర్చోవడం గమనించిన చిరంజీవి విషయం అర్థమైనట్లుగా తల పంకించి మాలతికు సైగ చేశాడు మాట్లాడమన్నట్లుగా.

"ఏంటే స్వాతీ, ఎందుకలా అయిపోయావు?" అంది మాలతి.

మాలతి పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చిన స్వాతి "ఏం లేదే. ఊ, ఏమిటి సంగతులు... ఎనీ ప్రోగ్రెస్?" అంది లేని నవ్వు తెచ్చుకుంటూ.

స్వాతి అలా అడగడంతో సిగ్గు పడినట్టుగా తల వంచుకుని "ఇంకా కన్‌ఫర్మ్ కాలేదు గాని అనుమానంగానే ఉంది" అంది మాలతి నవ్వేస్తూ.

"మరి చెప్పావు కాదేం? పార్టీ అడుగుతావని భయమా... చూడండి చిరంజీవిగారూ, ఇంత మంచి వార్త నాతో చెప్పకుండా ఈ నాలుగు రోజులూ దాచినందుకు దీనికి పనిష్మెంటు ఇవ్వాలా వద్దా?" అంది స్వాతి దిగులంతా మరిచిపోయి నవ్వేస్తూ.

"ఓ, ష్యూర్! మీరన్నట్లు గట్టి పనిష్మెంటే ఇవ్వాలి. ఇంట్లో ఖాళీగా ఉండి ఏం చేస్తావు, ఏదైనా కాంపిటీటివ్ ఎగ్జామ్‌కి ప్రిపేర్ అవ్వకూడదా అంటే నాతో కాంపిటేషన్ కోసం మరో కొత్త మెంబర్ని తెస్తోంది కదా. ఇవ్వాల్సిందే పనిష్మెంట్" అన్నాడు చిరంజీవి.

"అలాగే ఇద్దరుగానిలెండి. మా స్వాతి అంటూండేది ఎప్పుడూ వివాహం విద్యనాశాయా...శోభనం సర్వనాశాయ అని. మీ పుణ్యమాని అది అక్షరాలా నిజమైంది నా విషయంలో. అసలు పనిష్మెంట్ ఇస్తే అది నేనే ఇవ్వాలి మీకు!" అంది మాలతి అల్లరిగా.

వాళ్లిద్దరూ సరదాగా పోట్లాడుకునే తీరు చూసి ముచ్చటగా నవ్వేసింది స్వాతి స్నేహితురాలి బుగ్గమీద చిన్నదెబ్బ వేస్తూ.

మాలతి చిరంజీవి సరదాగా కబుర్లు చెప్తూ ఉంటే వింటూ ఇప్పుడు సూర్య ఉంటే ఎంత

బాగుండును? అనే ఆలోచన రావడంతో తిరిగి స్థబ్దుగా మారిపోయింది స్వాతి.

ఓ రెండు నిముషాలు ఏమీ అనకుండా అలాగే స్వాతిని చూస్తూండి పోయారు ఇద్దరూ.

చివరికి ఆలోచనలను చెదరగొడుతూ "స్వాతిగారూ! ఇందాకటి నుండీ చూస్తు న్నాను. మాతో కబుర్లు చెప్తూనే అలా తదేక దీక్షగా సముద్రం వైపు చూస్తూంటారు. ఏముంది వింత అందులో? నా మటుకు నాకు పట్టుమని పది నిమిషాలు కూడా అటు చూడాలనిపించదు. చల్లని వాతావరణాన్ని ఎంజాయ్ చేస్తూ, పిడత కింద పప్పు తింటూ ఇలా సరదాగా కబుర్లు చెప్పుకోవాలనిపిస్తుంది నాకు" అన్నాడు చిరంజీవి.

చిరంజీవి మాటలతో ఈ లోకంలోకి వచ్చిన స్వాతి నవ్వేస్తూ "నాకు కూడా మీరు చెప్పినవన్నీ ఇష్టమేనండీ. దాంతో పాటు ఇలా చూడడం కూడా చాలా ఇష్టం. ఎంతసేపు చూసినా తనివి తీరదు నాకు. నిమిష నిమిషం ఒడ్డుకొచ్చి అగిపోయే కెరటాలు చెలియలికట్టను దాటలేమనీ, తమ ప్రయత్నం వ్యర్థమని తెలిసి కూడా మళ్లీ మళ్లీ క్రమబద్ధంగా వస్తూనే ఉంటాయి. మానవ జీవితం కూడా అంతే కదా. మనిషి ఎన్నో అనుకుంటాడు. కొన్ని కొన్ని అసాధ్యాలని తెలిసి కూడా ఆశ పడుతూంటాడు. ఇదిగో ఇలా సముద్రంలోని అలల్లా ఆగిపోతూంటాడు, నిస్సహాయంగా!" అంది స్వాతి వేదాంతిలా.

"మనిషి జీవితానికీ, సముద్రపు అలలకూ దగ్గర పోలికలున్నాయని ఎంత సింబాలిక్‌గా చెప్పారు స్వాతీ! అయితే మీ మాటలతో నేను పూర్తిగా ఏకీభవించలేను. ఎందుకంటే, ఎప్పటికప్పుడు ఎన్ని అవాంతరాలు ఎదురైనా, నిత్యం ఏదో సాధించాలని మనిషి ఆరాటపడుతూనే ఉంటాడు. ఈ అలల్లా ఆ ఆశే లేకపోతే మనిషి మనుగడకు అర్థమే లేదు. ఈనాటి మానవుడు ఆటవిక దశ నుండి ఇంత నాగరికంగా ఎదగడానికి కారణం ఆ ఆశే కదా. ఎదురు దెబ్బలు తిన్న



ప్పుడు నిరాశ చెందకుండా గెలవాలనే పట్టుదలను పెంచుకోవాలని ఆ కెరటాలు చెప్తున్నాయి మనకు” అన్నాడు చిరంజీవి.

చిరంజీవి ఏం మాట్లాడినా ఎదుటివారితో ఏకీభవిస్తున్నట్లు కనిపిస్తూనే, తాను చెప్పవలసింది చెప్పేస్తాడు. లెక్చరర్‌గా ఎందరో విద్యార్థుల సైకాలజీని గమనించే అలవాటున్న చిరంజీవి స్వాతి ఆలోచనలలోని నెగెటివ్‌నెస్‌ను మెల్లగా తొలగించే ప్రక్రియను మొదలు పెట్టాడు. భర్త ఉద్దేశం గమనించిన మాలతి అదంతా వింటూ మౌనంగా ఉండిపోయింది.

మావయ్య ఎన్నాళ్లయినా నీ కోసమే కాచుకుని ఉంటాడని “నీకింకా అర్థం కాలేదా స్వాతీ! అలాగే తన తల్లిదండ్రులకు నచ్చజెప్పి ఉండొచ్చు కదా! అసలు నీకెందు కింత ఊగిసలాట?”

ఏమీ తర్కించకుండా స్వాతి కూడా చిరంజీవి చెప్పేదంతా శ్రద్ధగా విన్నది.

“స్వాతీ... సూర్యగారు రీసెర్చ్ కోసం ఢిల్లీ వెళ్లారట కదా. ఉత్తరాలు రాస్తున్నారా? ” అనడిగాడు చిరంజీవి.

“ఆ, రాస్తున్నారు. తాను మనిషైతే దూరంగా వెళ్లాడు కానీ తన ఆలోచనలన్నీ మా గురించే! కాకపోతే నాకు ఒకటే ఆశ్చర్యంగా ఉంది. మా తాతయ్యా వాళ్లు మావయ్యకు త్వరగా పెళ్లి చేసెయ్యాలని చూశారు. మరి ఏం చెప్పాడో మావయ్యా? వాళ్లు పెళ్లి మాటే తలపెట్టలేదు మావయ్య వెళ్లి పది నెలలవుతున్నా” అంది స్వాతి.

“నీకింకా అర్థం కాలేదా స్వాతీ! మావయ్య ఎన్నాళ్లయినా నీ కోసమే కాచుకుని ఉంటాడని. అలాగే తన తల్లిదండ్రులకు నచ్చజెప్పి ఉండొచ్చుకదా! అసలు నీకెందు కింత ఊగిసలాట? ” అంది మాలతి.

“ప్లీజ్ మాలతీ! నాకే ఊగిసలాటలూ లేవు. ఈ టాపిక్ ఇంతటితో వదిలెయ్యి” అంది స్వాతి, మాలతి అడిగిందానికి సమాధానం చెప్పలేక.

స్వాతికి కూడా అనుమానంగానే ఉంది తను తీసుకున్న నిర్ణయం, ఆలోచించే విధానమూ తప్పేమోనని. అలా అని సాహసించి సూర్య చేయి అందుకోలేకపోతోంది. రేపు రవి భవిష్యత్తు ఏమవుతుందో అనే ఆలోచనే స్వాతిని అనుక్షణం వేధిస్తున్నది. మానసికంగా స్వాతి పడే ఘర్షణ మాలతి, చిరంజీవి గమనించి మౌనంగా ఉండిపోయారు.

ఆ రాత్రి నిద్రపోయే ముందు చిరంజీవి అన్నాడు మాలతితో “గమనించావా మాలతీ! మన పెళ్లయిన కొత్తలో అసలు పెళ్లిమాటే ఎత్తనిచ్చేది కాదు స్వాతి. అలాగే సూర్యపట్ల ఎంత అభిమానమున్నా తన గూర్చి ఏ ఆలోచనా లేనట్లు వ్యవహరించేది. ఇప్పుడు తనకి తెలియకుండానే సూర్య గూర్చి మాట్లాడుతోంది. సాయంత్రం తన మాటలు విన్నాక నాకే మనిపించిందో తెలుసా? వాళ్లిద్దరూ కలిసే రోజు అతిదగ్గరలోనే ఉందని!” అన్నాడు.

“అంతకంటే కావలసిందేముందండీ మనకు? దాన్నలా చూస్తుంటే నా గుండె తరుక్కుపోతోంది. తుళ్లిపడే జలపాతంలా ఉండే స్వాతి ఎంత నిర్లిప్తంగా మారిపోయింది. నాతో ఆంటీ చెప్పారు కదా. మనం ఇక్కడున్న నాలుగు రోజులే అది ఈ మాత్రమైనా నవ్వుతూ మాట్లాడుతుందట. లేకపోతే ఆఫీసు లేని సమయమంతా ఏ పుస్తకమో చదువుతూంటుందట గాని, ఎవరితో ఏమీ మాట్లాడదట. రవి చదువు విషయంలో మాత్రం ప్రతి నిమిషం శ్రద్ధ తీసుకుంటుందట” అంది మాలతి.

“రవి కోసమే కదా తనిలాంటి నిర్ణయం

తీసుకున్నది. అందుకే అంత శ్రద్ధ అతని చదువు గూర్చి అదే సమయంలో ఏదో పోగొట్టుకున్నాననే బాధ తనని లోలోపలే తినేస్తోంది. ఏదైనా కాలం మాన్పని గాయం, చేయని అద్భుతం లేదు మానవజీవితంలో. చూద్దాం, మన ప్రయత్నం మనం చేస్తూ తనకి మోరల్ సపోర్టు ఇద్దాం. అదే స్వాతిలో మార్పుని తెస్తుందని నా ఉద్దేశ్యం!" అన్నాడు చిరంజీవి.

ఆ రోజు సూర్య దగ్గర నుంచి వచ్చిన ఉత్తరాన్ని స్వాతి ఎన్నిసార్లు చదువుకుందో లెక్క లేదు. తాను సెలవులకు తాజ్ మహల్ చూడడానికి వెళ్లడం, తాజ్ అందాలు, షాజహాన్ ప్రేమ గురించిన భావాలు రాస్తూ, చివరలో 'స్వాతీ! మనిద్దరం ఒకర్నొకరం ఇంతలా కోరుకుంటూ ఎందుకీ ఎడబాటుని అనుభవించాలి అనిపిస్తుంది ఒకోసారి నాకు.

స్వాతీ! ఈ వియోగబాధను భరించలేక నిన్ను చూడకుండానే నా ఈ చిన్ని గుండె ఆగిపోతుందేమోనని భయంగా ఉంది. ఇదంతా చదివి నన్నో పిచ్చివాడనుకో, మరేమైనా అనుకో. నీవు లేని నా బతుకు శూన్యంలా ఉంది. దీన్ని కళకళలాడేలా చేసే శక్తి నీ ఒక్కదానికే ఉంది. ఏం చేస్తావో నీ ఇష్టం!

స్వాతీ! నీ కోసమని ఒక పెద్ద తాజ్‌మహల్‌ని కొన్నాను. అది నీలిరంగు వెల్వెట్ క్లాత్ అమర్చిన పెట్టెలో ఉంది. ఓపెన్ చేయగానే లోపల లైట్ వెలుగుతుంది. ఆ నీలిరంగు బేక్ గ్రౌండ్‌లో వెలిగిపోతున్న ఆ తాజ్‌మహల్ ఎంతో అద్భుతంగా అనిపించి నీ కోసం కొనేశాను వెంటనే!

ఉండనా స్వాతీ? ఇకపై మన జీవితాన్ని ఏం చేసినా అది నీ చేతుల్లో ఉందని గుర్తుపెట్టుకో!' అని రాశాడు.

ఆ ఉత్తరం పదేపదే చదువుకుంటుంటే స్వాతి కళ్లు కన్నీటి చెలమలే అయ్యాయి. ఇంతటి అనురాగానికి నేను అర్హురాలినేనా అనుకుంది స్వాతి.

సూర్య తన రెండు చేతులూ సాచి రా రమ్మని ఆహ్వానిస్తున్నా ఇంకా ఎందుకు ఇలా నేను వెనుక ముందులాడుతున్నాను అనుకుంది స్వాతి. అయితే గతంలో మాదిరి బాధ్యత బాధ్యత అంటూ తన మనసును జోకొట్టలేకపోయింది ఈసారి.

తన స్నేహితురాలు మాలతి ఆమె భర్త చిరంజీవి అన్నట్లు తనవి అర్థం లేని భయాలేనేమో! దేవుడులాంటి సూర్యని అకారణంగా శంకించి అందివచ్చిన స్వర్గాన్ని జారవిడుచుకుంటోందా తను? అనుకుంది స్వాతి. అయినా ఇంకెంత? గట్టిగా కళ్లు మూసుకుంటే తమ్ముడి చదువయిపోతుంది. అమ్మో అంత కాలమే? నా వల్ల కాదు రేపే అమ్మతో మాట్లాడాలి అనుకుంది స్వాతి దృఢంగా. అంతవరకూ డోలాయమానంగా ఊగిన స్వాతి మనసు ఆ నిర్ణయం తీసుకోవడంతో ప్రశాంతత పొందింది.

మరునాడు అన్యమనస్కంగానే ఆఫీసుకు వెళ్లింది స్వాతి. అందరూ ఏదో హడావుడిగా అటూ ఇటూ తిరుగుతూ గోలగోలగా మాట్లాడుకుంటూ ఉండడంతో ఏం జరిగిందంటూ వెళ్లిందక్కడికి.

"నీకు తెలుసా స్వాతీ! వాసంతిగారు సూసైడ్ చేసుకున్నారట!" అంది పక్క సీటు గిరిజ.

"అదేమిటి గిరిజా... వాళ్ల హజ్బెండ్, తనూ ఎంతో బాగుంటారు కదా. ఎందుకిలా చేసింది వాసంతి? పైగా వాళ్లిద్దరూ ప్రేమించి పెళ్లి చేసుకున్నారు. ఏమిటి ప్రాబ్లమ్? " అంది స్వాతి బాధగా చూస్తూ.

"ఏం హాపీ..." అని గిరిజ ఏదో చెప్పబోయింది. ఈ లోగా,

"ఎలాగైనా మీ ఆడాళ్లకు తొందరపాటు ఎక్కువండీ స్వాతిగారూ. అయిందానికీ కానిదానికీ బ్రహ్మాస్త్రంలా ఆత్మహత్యలు చేసేసుకుంటారు. పాపం ఆ రమణమూర్తిగారు ఎలాగున్నారో ఏమిటో? " అన్నాడు అదే డిపార్టుమెంటులో పనిచేస్తున్న శ్రీనివాసరావు.

దాంతో ఒళ్లు మండిన గిరిజ "మొత్తానికి మీ మగబుద్ధి పోనిచ్చుకున్నారు కాదండీ! వాసంతిగారు చనిపోయినందుకు బాధ లేదు గానీ ఆమె చనిపోయాక రమణమూర్తిగారికి ఇబ్బంది కలిగింది అని బాధ పడుతున్నారు మీరు. నిండు ప్రాణాన్ని తీసుకునే పరిస్థితి వాసంతిగారికి ఎందుకు వచ్చిందో ఒక్కసారైనా ఆలోచించారా మీరు?

వాసంతిగారు ఆఫీసులో జాయిన్ అయిన దగ్గర నుండీ ఆవిడ వెంట పడ్డారు. చాలా బుద్ధిమంతుడిలా ఫోజుకొట్టి ప్రేమ పేరుతో ఆవిడని స్వంతం చేసుకున్నారు. పెళ్లికి ముందే చెప్పారావిడ. తన తరువాత ఇద్దరి చెల్లెళ్ల బాధ్యత తీరేవరకూ తండ్రి లేని తమ కుటుంబానికి ఆర్థిక సాయం చేస్తానని. అందుకు ఇష్టపడితేనే మన పెళ్లి జరుగుతుందని చెప్పారు.

ఆకర్షణనే ప్రేమగా భ్రమించిన రమణమూర్తిగారు ఆ వేడిలో నాకు నువ్వుంటే చాలు. ఇంకేం వద్దంటూ వీర లెవెల్లో ఫోజు పెట్టి వాసంతిగార్ని పెళ్లికి ఒప్పించారు.

తీరా పెళ్ళయ్యాకే మొదలయింది అసలు కథ. తమ కొడుక్కి లక్షలకు లక్షలు కట్నం ఇస్తామని ఎందరో వస్తుంటే పైసా కట్నం లేకుండా వాసంతిని కోడలిగా తెచ్చారని రమణమూర్తి తల్లిదండ్రులు ధ్వజమెత్తారు. పేరుకు ఉద్యోగస్తురాలయినా, కోడలి సంపాదనలో నుండి ఒక్క రూపాయి కూడా తమకు దక్కదని తెలుసుకుని అంతా పుట్టింటికే దోచిపెట్టేస్తుందని అక్కసు పెంచుకుని వాసంతిగారిని రాచి రంపాన పెట్టారు.

పాపం వాసంతిగారు... వాళ్ళు అన్ని బాధలు పెడుతున్నా అన్నీ మౌనంగా భరించారేగానీ ఎవరినీ పన్నెత్తి ఒక్క మాట అనలేదు. చివరికి ఉద్యోగం మానేసి ఇంటిపట్టునే ఉండు. లేకపోతే జీతం మొత్తం తెచ్చి మాకివ్వు అంటూ వేధించడం మొదలుపెట్టారట వాళ్లు.

అన్ని ఆదర్శాలూ, ప్రేమ కబుర్లూ వల్లించిన రమణమూర్తిగారు తొలి మోజు తీరిపోవడంతో అమ్మా నాన్న చెప్పినట్లు విని ఉద్యోగం మానేసి నీడపట్టున ఉండి ఇల్లు దిద్దుకో. కావాలంటే పదో పాతికో మీ వాళ్లకు నేను సర్దుతానులే అన్నారట ఉదారంగా.

చివరికి ఇద్దరూ విడిపోయేదాకా వచ్చిందట పరిస్థితి.

"నీ వాళ్ల కోసం పండంటి మన సంసారాన్ని కూలదోస్తావా?" అంటూ ఎదురు దాడికి దిగడంతో ఏమీ చేయలేక తనమీదే ఆధారపడిన తల్లీ చెల్లెళ్లను నిరాధారంగా నిలబెట్టలేక నలిగిపోయారు వాసంతిగారు.

అప్పుడప్పుడు ఇవన్నీ నాతో చెప్పి బాధపడుతూ ఉంటే నాకు చేతనయినంతలో ఓదార్చానే గాని ఇలా చేస్తారని ఊహించలేకపోయాను. క్షణికావేశంలో, ఎవరికోసమైతే ఇంత కాలం కష్టపడ్డారో వాళ్లను పూర్తిగా నిరాధారం చేశారు ఈ రోజు. ముక్కుపచ్చలారని ఆ పసిపిల్లలిద్దర్నీ తల్లిలేని వాళ్లని చేశారు. చచ్చి ఏం సాధించారు? చచ్చాక కూడా మీ అందరితో మాటలు పడడం కాకపోతే.

మాట్లాడితే మీ ఆడాళ్లు, మీ ఆడాళ్లు అని తేలిగ్గా తీసిపడేస్తారు. ఇంటా బయటా గొడ్డులా చాకిరీ చేసే మా అవస్థలు మీకేం తెలుసు? ఆ రమణమూర్తిగారు అంత మూర్ఖంగా ప్రవర్తించి ఉండకపోతే... ఆవిడ ఈ రోజు ఇలాంటి దుస్సాహసం చేసేవారా? ఆయనకేం మగ మహారాజు. టింగురంగా అంటూ మళ్లీ పెళ్లాడుతారు. కాని ఆ బిడ్డలకు పోయిన తల్లిని తెచ్చివ్వగలరా?" అంది గిరిజ ఆవేశంగా శ్రీనివాసరావు వైపు చూస్తూ.

దాంతో శ్రీనివాసరావు తగ్గిపోతూ "సారీ అండీ, నాకివేం తెలియక తొందరపడి ఆ మాట అన్నాను" అంటూ చల్లగా అక్కడి నుండి జారుకున్నాడు.

అదంతా వింటున్న స్వాతి భయంతో బిగుసుకుపోయింది. రేపు నేను పెళ్లి చేసుకున్నా నా పరిస్థితి ఇదే కదా. ఈ రోజు ఇంత తియ్యగా మాట్లాడిన మావయ్య, రేపు పరిస్థి

తులకు తలవంచి తనూ అలా ప్రవర్తిస్తే నా తమ్ముడి గతేం కాను? అనుకుంది. అంతరాం తరాలలో సూర్యం అలాంటివాడు కాదని అని పిస్తూ ఉన్నా చెదురుమదురుగా జరిగే ఇలాంటి సంఘటనలు స్వాతి పెళ్లి చేసుకోవా లనే ఆలోచనను నీరు కార్చేస్తున్నాయి.

రాత్రి చేసుకున్న నిర్ణయాలు ఆ సంఘ టనతో పటాపంచలయ్యాయి.

అందరూ కలిసి ఆఖరుసారిగా వాసంతిని చూడటానికి వెళ్లారు. వాసంతి తల్లీ, చెల్లెళ్లు వాసంతి పిల్లల్ని పట్టుకొని గుండెలవిసేలా ఏడుస్తూంటే అందరికళ్లూ చెమరించాయి. తన మూర్ఖత్వం ఎంతటి అనర్థానికి దారితీ సిందో చూసిన రమణమూర్తి అపరాధిలా తలవంచుకున్నాడు.

ఇంత జరిగినా తన మీద ఎలాంటి మచ్చా రాకుండా, నా మరణానికి ఎవరూ బాధ్యులు కారంటూ వాసంతి రాసిపెట్టిన ఉత్తరం. అతన్ని మరింత అపరాధ భావంతో కుంగిపో యేలా చేసింది.

జరిగిందంతా వివరిస్తూ మాలతికి ఉత్తరం రాసింది స్వాతి. చివరిలో. 'ఇవన్నీ చూస్తున్నకొద్దీ నాకు పెళ్లంటేనే భయం పట్టుకుందే మాలతీ! మావయ్యా దగ్గర నుండి ఉత్తరం వస్తే మనసు మబ్బుల్లో తేలిపోతున్నట్లుగా ఉంటుంది. ఇలాంటి సంఘటనలు చూశాక మనసంతా చెప్పరాని భయంతో తల్లడిల్లిపోతుంది.

మావయ్య అందరిలాంటి వాడూ కాడని తెలిసినా ఏదో అవ్యక్తాందోళన నన్ను కట్టిపడే స్తోందే.

ఇలాంటి సమయంలో నీవు దగ్గరుంటే ఎంత బావుండును. కానీ అది సాధ్యం కాదు కదా. ఇంతకీ నన్నేంచెయ్యమంటావో చెప్పవే!

సరే పాప ఎలా ఉంది? బాగా అల్లరి చేస్తోందా? వెంటనే ఉత్తరం రాయి. నీ జాబుకోసం ఎదురుచూస్తూ ఉంటాను అని రాసింది.

చిరంజీవి కాలేజీ నుండి వచ్చేసరికి స్వాతి రాసిన ఉత్తరం పట్టుకుని దిగాలుపడి కూర్చుంది మాలతి. అది చూసిన చిరంజీవి "ఏమిటి, స్వాతి దగ్గర నుండి ఉత్తరం వచ్చిందా. ఏముంది అందులో, అలా పెట్టావు ముఖం? " అనడిగాడు.

మాలతి మాట్లాడకుండా ఉత్తరం చిరంజీవి చేతిలో పెట్టి కాఫీ తెచ్చేందుకు వంటింట్లోకి వెళ్లింది. భార్య కాఫీ తెచ్చే సరికి ఉత్తరం చదవడం ముగించి మాలతికి తిరిగి ఇచ్చేస్తూ "నీ ఫ్రెండ్‌కేమైనా వేపకా యంత వెర్రి ఉందే మిటి మాలతీ! ప్రతి చిన్న సమస్యనీ భూత ద్దంలోనుండి చూసి బాధపడుతుంది.

ఇవన్నీ చూస్తున్న
కొద్దీ నాకు
పెళ్లంటేనే
భయం
పట్టుకుందే
మాలతీ! కానీ
మావయ్య
దగ్గర నుండి
ఉత్తరం
వస్తే మనసు
మబ్బుల్లో
తేలిపోతున్నట్లుగా
ఉంటుంది

ఎవరికో ఏదో జరిగిందని లేనిపోని వన్నీ ఊహించుకొని తనకీ అలాగే జరుగుతుందేమోనని బాధపడడంలో ఏమైనా అర్థం ఉందా చెప్పు. ఓ పక్క తనే అంటుంది మావయ్య అలాంటి వాడు కాదని నాకు తెలుసు అంటూ. మరి ఈ అర్థంలేని భయాలెందుకు?

నిరాధారమైన అపోహలతో సంశయాలతో బంగారంలాంటి జీవితాన్ని పాడుచేసుకుం టోంది. తాను బాధపడుతూ అందర్నీ బాధ పెడుతోంది. తన సంగతి సరే, నీకేమైంది? పెళ్లి కాకముందు ఎంతో షార్పుగా ఉండేదా నివి. ఏ విషయాన్నైనా చక్కగా విశ్లేషిస్తూ మాట్లాడేదానవి. నీ బుర్రకూ బూజు పట్టే సిందా ఏమిటి?

నీ ఫ్రెండ్ సరే, అయోమయంలో పడిపో

యింది. నీ తెలివితేటలు కూడా అటకెక్కించే శావా? తన కొలీగ్ పెళ్లీ, చావూ కలిగించిన బాధని కాదనను నేను. వాళ్లు ఆ ఆఫీసులో చేరేవరకూ అపరిచితులు. ప్రేమో, ఆకర్షణో, తొందరపాటో వాళ్లిద్దరూ ఒకటై చివరికి కథ విషాదాంతంగా ముగిసిపోయింది. కానీ మన సూర్యగారు అలాక్కాదే. నక్కకీ నాకలోకానికీ ఉన్న వ్యత్యాసముంది ఇద్దరికీ. గుర్రాన్నీ, గాడిదనూ ఒకే గాటను కట్టేస్తానంటోంది మీ స్వాతి. న్యాయమేనా ఇది?

చిన్నప్పటినుండి ఒకరి గూర్చి ఒకరికి సంపూర్ణంగా తెలుసు. స్వాతిగారి కోసం, స్వాతి వాన కోసం ఎదురుచూసే ముత్యపు చిప్పలా ఏళ్లతరబడి కాచుకుని కూర్చున్నాడాయన. తన గూర్చి స్వాతి ఇంత తక్కువగా ఆలోచిస్తోందన్న సంగతి తెలిస్తే భరించగలడా సూర్య?" అన్నాడు చిరంజీవి కోపంగా.

"నిజమే. మావయ్యకీ సంగతి తెలిస్తే చాలా బాధపడతారు" అంది మాలతి.

"ఆ, పడతారని అంటూనే నువ్వూ నీ ఫ్రెండూ ఇలా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చోండి. ప్రాణం విసిగిన ఆయన ఇప్పుడు ఢిల్లీ దాకా పారిపోయాడు. ఆపైన చెప్పాపెట్టకుండా ఇంకెక్కడికైనా పోతాడు. అప్పుడు కుదురుతుంది తిక్క" అన్నాడు అదే కోపంతో చిరంజీవి.

"అయితే ఇప్పుడు నన్నేం చేయమంటారండీ?" అంది మాలతి నిస్సహాయంగా చూస్తూ.

ఇంతలో కింద నుండి "అమ్మాయ్ మాలతీ పాప గుక్కపెట్టి ఏడుస్తోంది. వినిపించడం లేదా... ఏం చేస్తున్నావక్కడ?" అంటూ కిందనుండి అత్తగారి పిలుపు వినిపించడంతోనే ఆ చర్చకు అంతటితో స్వస్తి చెప్పి కిందకు పరుగుతీసింది మాలతి.

ఆ రాత్రి ఇద్దరూ కూర్చుని చిరంజీవి సూర్యకి, మాలతి స్వాతికీ ఉత్తరాలు రాశారు. స్వాతికి మాలతి రాసిన ఉత్తరం నిండా చిరంజీవి అన్న మాటల సారాంశం రాస్తూ మెత్త మెత్తగా చీవాట్లు వేసింది స్నేహితురాలికి.

అంతకుముందు సూర్య రాసిన ఉత్తరం స్వాతిలో ఎంత సంచలనాన్ని రేపిందో వివరిస్తూ ఇకపై రాసే ఉత్తరాల్లో కూడా మరింత సన్నిహితత్వాన్ని కలిగిస్తూ హృదయానికి హత్తుకునేలా ఉత్తరాలు రాస్తూ ఉండమని, తరచూ ఫోన్లుచేస్తూ స్వాతి మనసులో అకారణంగా రేగిన అపోహలను తొలగించమని, అలా చేస్తే తప్ప స్వాతి పెళ్లికి సుముఖత చూపదని రాశాడు చిరంజీవి.

సూర్య చిరంజీవి సూచనలను తూచా తప్పక అమలుచేశాడు. మాలతి రాసిన ఉత్తరం స్వాతిలో ఏ కదలికా తీసుకురాకపోయినా నిత్యం సూర్య నుండి అందే ఉత్తరాలు ఎంతో ఉత్తేజాన్నీ, నూతనోత్సాహాన్నీ కలిగించసాగాయి.

**22**



రోజులు ఒకదాని వెంట ఒకటి దొర్లిపోతున్నాయి. రవి ఇంటరు నైంటీ టూ పర్సెంటు మార్కులతో పాసవడమే కాదు. షార్ట్ టర్మ్ లోనే మంచి ర్యాంక్ సంపాదించి ఆంధ్రా మెడికల్ కాలేజీలో జాయిన్ అయిపోయాడు.

రవికి సీటు రావడంతో తన శ్రమకి తగిన ఫలితం దక్కినట్లుగా సంతోషపడిపోయింది స్వాతి. సూర్య అభినందిస్తూ ఉత్తరం రాశాడు.

రవికి వయసుతో పాటు లోకజ్ఞానమూ పెరిగింది. తన కోసమే అక్క పెళ్లి మానుకొని అలా ఉండిపోయిందని అర్థం చేసుకొన్న రవి మనసు అపరాధ భావంతో కుంగిపోసాగింది. అక్కనే కోరుకుంటున్న మావయ్య అక్క మాట కాదనలేక అసలు పెళ్లి ఆలోచనే

విరమించుకున్నాడనీ అందుకే రీసెర్చి పేరుతో తమందరికీ దూరంగా వెళ్లిపోయాడని గ్రహిం చాడు. అయితే వాళ్లిద్దరినీ కలిపేందుకు రవికి వయసూ అనుభవమూ చాలలేదు. దాని ప్రభావంగా రవి చాలా డిప్రెషన్‌కి లోన య్యాడు. చదువులో ఏకాగ్రత లోపించింది. ఫలితంగా మొదటి సంవత్సరంలో ఎనాట మీలో ఫెయిలయి ఇంట్లో కూర్చుండిపో యాడు.

రవి ఇలా పరీక్ష తప్పి ఢీలాపడి ఇంట్లో కూర్చోవడంతో స్వాతికి కాళ్లూ చేతులూ ఆడ లేదు.

"ఏమిట్రా... ఇలా చేశావు?" అనడిగిన స్వాతికి మౌనమే సమాధానంగా మిన్నకుండి పోయాడు రవి. తన కష్టమూ, త్యాగమూ ఇలా వృధా అయిపోయినందుకు కుమిలి కుమిలి ఏడ్చింది స్వాతి.

విషయమంతా వివరిస్తూ మాలతికి ఉత్తరం రాసింది.

ఆ ఉత్తరం చదివిన మాలతి దాన్ని చిరం జీవి కందిస్తూ "చూశారా, రవి ఏం చేశాడో? ఇన్నాళ్ల స్వాతి కష్టాన్నీ బూడిదలో పోసిన పన్నీరు చేశాడు. ఎనాటమీ తప్పాడట!" అంది బాధగా.

"ఎందుకు ప్రతి చిన్నదాన్నీ నువ్వూ, నీ స్నేహితురాలూ భూతద్దంలో నుండి చూస్తూ ఏదో జరగరానిది జరిగినట్లు అంత హైరానా పడిపోతారు? అసలు ఎప్పుడూ బాగా చదివే రవి ఇప్పుడు ఎందుకు తప్పాడని ఒక్కసారి రవి వైపునుండి ఆలోచించరేం ఇద్దరూ ముందు అతని ప్రాబ్లం ఏమిటో తెలుసు కుంటే సరిపోతుంది. వాణ్ణి ఇక్కడికి పంపిం చమని చెప్పు స్వాతికి" అన్నాడు

మాలతి స్వాతికి ఫోన్ చేసింది. ఇద్దరూ మాట్లాడి రవిని తమ దగ్గరికి పంపించేలా స్వాతిని ఒప్పించారు.

రవి వచ్చిన తర్వాత రెండు రోజులు ఏ విషయం కదపకుండా సరదాగా గడిపారు.

ఆరోజు ఆదివారం కాస్త తీరిక కావడంతో చిరంజీవి రవిని చేరదీసి బుజ్జగిస్తున్నట్లు మాట్లాడి రవి తప్పడానికి కారణం రాబట్టడా నికి ప్రయత్నించాడు.

ఏదో సమయంలో ఆ ప్రశ్న వస్తుందని ఎదురు చూస్తున్న రవి సమాధానం చెప్దా మని ప్రయత్నించాడు గానీ తన్నుకొస్తున్న దుఃఖం అతని గొంతును దాటి మాటను పైకి రానివ్వలేదు.

"ఏయ్, రవీ ఏమిటిది చిన్న పిల్లాడిలా, పరీక్ష తప్పినందుకు నిన్నేం తప్పు పట్టడం లేదు. నేను కారణం ఏమిటో అర్థం కాక అడిగానంతే!" అంటూ వెన్ను నిమిరాడు చిరంజీవి.

"అది కాదు బావగారూ! నా మూలంగానే కదా అక్క తన జీవితాన్నిలా ఎడారిలా చేసు కుంది. లేకపోతే మాలతక్కలా, అక్క కూడా పెళ్లి చేసుకొని హాయిగా ఉండేది పాపం. మామయ్య ఇదంతా భరించలేక గదా ఉన్న ఉద్యోగం వదిలి దూరంగా వెళ్లిపోయాడు. నేను వాళ్లిద్దరికీ ఓ గుదిబండలా తయార య్యాను. నేను లేకపోతే అక్కకీ కష్టాలు ఉండేవి కావు!" అన్నాడు రవి వెక్కుతూనే.

"బీ బ్రేవ్ మై బోయ్, ఏదైనా సమస్య మనకి ఎదురైతే దానికి పరిష్కారం కోసం చూడాలి గానీ ఇలా విచారపడుతూ కూర్చుంటే సరిపోతుందా? చూశావా దీని మూలంగా నీ చదువు ఎలా దెబ్బతిందో నేన నుమానిస్తునే ఉన్నాను ఇలాంటిదేదో మన సులో పెట్టుకొని చదువు మీద దృష్టిని కేంద్రీ కరించలేకపోయావని" అన్నాడు చిరంజీవి.

"అవునురా! నువ్విలా బాధపడుతూ కూర్చుని నీ భవిష్యత్తుని పాడు చేసుకోకురా. ఇంకెంత? మహా అయితే మరో మూడు సంవత్సరాలు. కాస్త ఓపిక పడితే సరిపో తుంది" అంది మాలతి ఓదార్పుగా.

"అదే నా వల్ల కావడం లేదక్కా. అనుక్షణం నా కళ్ల ముందు మోడులా అక్క నిస్తేజమైన చూపులతో తిరుగుతుంటే ఎలా చదవమం టావు నన్ను? అక్కా! నీకీ సంగతి తెలుసా?

నాన్నగారు పోయిన ఈ నాలుగు సంవత్స రాల కాలంలో మేము ముగ్గురమూ మన సారా నవ్వుకుని మాట్లాడుకున్న సందర్భాలు చాలా తక్కువ! ఇదంతా నా వల్లనే జరిగిం దన్న అపరాధ భావం నన్ను తినేస్తోందక్కా కానీ చిన్నవాడిని, ఏం చేయగలను? " అన్నా డు రవి నిస్సహాయంగా చూస్తూ.

"లేదు రవీ! ఏమైనా చేస్తే నువ్వే చెయ్యగ లవు. స్వాతికి భవిష్యత్ పట్ల భయం ఆందో ళన ఉండడం సహజమే. ఎందుకంటే మీ నాన్నగారు పోయిన బాధలో ఉన్న స్వాతి తన వారు అని నమ్మినవారి నుండే ఎదుర్కొ న్న చేదు అనుభవం తనని అలా అభద్రతా భావానికి గురి చేసింది. అది మరీ ఎక్కువ కావడంతోనే వచ్చింది చిక్కంతా. "ఇదే ఈ ఎమోషనల్ ఫీలింగ్‌నే నువ్వు స్వాతి దగ్గర ప్రయోగించు. సూర్య థీసిస్ కూడా పూర్తయి పోవచ్చిందని నాలుగయిదు నెలల్లో తానిక్క డికి వచ్చేస్తానంటూ మొన్నే ఫోన్ చేశాడు. కనుక ఈలోగా స్వాతిని దారిలోకి తేగలిగితే వాళ్లిద్దరూ ఒకటవుతారు. మనందరి మన సులూ చల్లబడతాయి.

నెక్స్ట్ వీక్ సెకండ్ సాటర్‌డే, సండే కలిసి వస్తాయి. మేమక్కడికి వచ్చి మీ అమ్మగారితో మాట్లాడుతాం. అదే సమయంలో నీ చదువు సక్రమంగా సాగాలి అంటే మీ అక్క పెళ్లి జర గాల్సిందేనని కండీషన్ పెట్టు. మీ అక్కకి ఉన్న బలహీనతల్లో నీ చదువొకటి. దాని కోసమైనా తాను దిగిరాక తప్పదు" అన్నాడు చిరంజీవి తన ఆలోచనకు తిరుగులేనట్లుగా. ఇదంతా విన్న మాలతి మెచ్చుకుంటున్నట్లుగా చూసింది భర్త వైపు.

## 23

రవి వెళ్లిపోయాక సూర్యకి ఫోన్ చేశాడు చిరంజీవి. "హలో సూర్యా! ఎలా ఉన్నారు? "

"హలో!నేను బాగున్నాను. పాపా, మాలతి ఎలా ఉన్నారు. ఏమిటి విశేషాలు? " అన్నాడు సూర్య ఉత్సాహంగా.

"విశేషమే మరి. మీరు తొందరలోనే మాకు పప్పన్నాలు పెట్టబోతున్నారు కదా!" అన్నాడు చిరంజీవి.

"ఎలా? " అన్నాడు సూర్య నమ్మలేనట్లుగా. అప్పుడు చిరంజీవి రవి తన ఇంటికి వచ్చాక జరిగిందంతా చెప్పి సూర్య జరపవలసింది కూడా చెప్పాడు.

"ఓ. కె. చిరంజీవిగారూ. నేను మా అమ్మా నాన్నలతో మాట్లాడుతాను. వారు గతంలో మాదిరిగా లేరు. చాలా మారిపోయారు. వాళ్ల నుండి ఇక ఎటువంటి ఆటంకమూ ఎదురు కాదు" అన్నాడు సూర్య ఉత్సాహంగా.

"మరింక ఆలస్యమెందుకు, వెంటనే పని ప్రారంభించండి. బెస్టాఫ్ లక్!" అన్నాడు చిరంజీవి.

అనుకున్నట్లుగానే మాలతి చిరంజీవి, ఆ శనివారం విశాఖపట్నం వచ్చారు. సరిగ్గా స్వాతి ఆఫీసుకు బయలుదేరే సమయానికి మాలతి వెళ్లిందక్కడికి. తలవని తలంపుగా వచ్చిన స్నేహితురాలిని చూసి ఆశ్చర్యపో యింది స్వాతి.

"ఏమే, వస్తున్నట్లు రవితో చెప్పలేదు, నువ్వొక్కత్తివే వచ్చావా? " అంది స్వాతి ఆశ్చ ర్యంగా.

'అనుకోకుండా వచ్చాలేవే, చిరంజీవిగారు మధ్యాహ్నం వస్తానన్నారిక్కడికి. మధ్యాహ్నం వాసుకి పెళ్లి చూపులు. అందుకే వచ్చా" అం ది మాలతి.

"మరి ఎలాగే, నేను ఆఫీసుకి వెళ్లాలి గదా!" అంది స్వాతి ఇబ్బందిగా చూస్తూ.

"ఏం ఫర్వాలేదు వెళ్లిరా. మధ్యాహ్నం వచ్చే స్తావు కదా! ఈ పూట నేనిక్కడే ఉంటాను. సరేనా? " అంది మాలతి.

"అయితే నేను వెళ్తాను" అంటూ వెళ్లిపో యింది స్వాతి.

మాలతి ఆ పూట అక్కడే ఉంటుందన్న మాట విని జానకమ్మ ఏదైనా స్పెషల్ చేద్దా మని హడావిడిగా వంటింట్లోకెళ్లింది. ఆవిడ ప్రయత్నాన్ని వారిస్తూ "ఆంటీ ఇప్పుడు వంట



చెయ్యాలని పదేళ్ల నుండీ నా ప్రయత్నం. పోనీ అప్పుడు చిన్నపిల్ల అనుకుందాం. తరువాత మీ అంకుల్ పోవడంతో దాని పెళ్లి అర్ధాంతరంగా ఆగిపోయిందని నేనేడుస్తూ ఉంటే అదేమందో తెలుసా? అసలు నాకు సూర్య మావయ్య అంటే ఇష్టమే లేదు. అందుకే ఇన్నాళ్లూ పెళ్లి వాయిదా వేస్తూ వచ్చాను అంది. వాడు చూస్తే దీన్ని తప్ప ఎవర్నీ చేసుకోనని కూర్చున్నాడు. మా పిన్నీ బాబాయిలకు ముఖం చూపలేక ఇదిగో ఇలా ఏడుస్తున్నాను" అంది జానకమ్మ కళ్లు వత్తుకుంటూ.

"చాలా పొరపాటు పడ్డారాంటీ. మీరు భారం అయిపోతారని మీ పిన్నీబాబాయే ఈ పెళ్లి వద్దనుకున్నారు. ఆ మాట స్వయంగా స్వాతే విని ఈ నిర్ణయం తీసుకున్నది. ఇది విని మీరెక్కడ బాధపడతారోనని అదంతా దాచిపెట్టి నిందంతా తన మీద వేసుకొని అన్నీ మౌనంగా భరిస్తోంది" అసలు విషయం చెప్పింది మాలతి.

"ఏమిటమ్మా నువ్వనేది? పిన్నీబాబాయికి ఈ పెళ్లి ఇష్టం లేదా. మరి సూర్య? " అంది ఆశ్చర్యంగా.

"సూర్య మావయ్యను అనుకుంటే మనకే

కోసం హైరాన పడకండి. ఏదుంటే అది తిందాం. మీరిలా వచ్చి కూర్చోండి ముందు!" అంటూ చెయ్యి పట్టిలాగి తన పక్కన కూర్చోబెట్టుకుంది మాలతి.

ఏమిటమ్మా బొత్తిగా ఏమీ చెయ్యకుండా ఉత్త చారూ అన్నం పెట్టనా? నీకు సరే, అల్లుడు గారిక్కూడా అదే పెట్టనా? " అంది జానకమ్మ ఆప్యాయంగా మాలతి వంక చూస్తూ.

"అవన్నీ పరాయి వాళ్లకోసం ఆంటీ. మనలో మనకి అవన్నీ ఎందుకు? ముందు మీరు కూర్చోండి. మీతో చాలా మాట్లాడాలి!" అంది మాలతి.

"ఏమిటమ్మా? " అంటూ ఆశ్చర్యంగా చూసింది జానకమ్మ.

"ఏం లేదు ఆంటీ. స్వాతి పెళ్లి విషయమే!" అంది మాలతి.

"ఏం పెళ్లమ్మా. ఇది నా ప్రాణానికి కొరకరాని కొయ్యలా తయారయింది. దీని పెళ్లి

పాపం చుట్టుకుంటుంది ఆంటీ. తల్లిదండ్రులను ఒప్పించలేక, స్వాతి బాధపడటం చూడలేక ఇక్కడి నుండి వెళ్ళిపోయాడు మావయ్య. అక్కడికీ మేమంతా చాలా చెప్పి చూశాం. కానీ ఆత్మాభిమానం గల స్వాతి ఎవ్వరి మాటా వినిపించుకోలేదు".

"అయ్యో ఎంత పని జరిగింది? అనవసరంగా బిడ్డని ఆడిపోసుకున్నానే!" అంది జానకమ్మ కన్నీళ్లతో.

**ఇంకెందుకాంటీ ఆలస్యం? మీ అల్లుడు గారు చెప్పినట్లుగానే సాయంత్రం రవి స్వాతిని నిలేస్తాడు. మీకిదంతా ఏం తెలియనట్లే అప్పుడే వింటున్నట్లుగా కథ రక్తి కట్టించి స్వాతిని దారిలోకి తెండి.**

"అయితే అప్పట్లో రవికి ఇవన్నీ అర్థం చేసుకునేంత పరిజ్ఞానం లేదు. ఇప్పుడు తన కోసం స్వాతి చేస్తున్న త్యాగాన్ని చూసి తట్టుకోలేకపోతున్నాడు. అందుకే సరిగ్గా చదవలేక ఈ సంవత్సరం పరీక్ష తప్పాడు".

"ఏమిటమ్మా ఇదంతా. ఈ కొంపకి ఏదో శని పట్టినట్లుందే. ఇవన్నీ మీకు తెలిసి కూడా ఒక్కమాటైనా నాతో అన్నారు కాదు!" అంది జానకమ్మ నిష్ఠూరంగా.

"చెప్పి ప్రయోజనం ఏముందాంటీ. మిమ్మల్ని ఇంకా బాధలకు గురిచేయడం తప్ప. కానీ ఇప్పుడు రవి పరిస్థితి చూశాక చెప్పక తప్పడం లేదు. స్వాతి పెళ్లి చేసుకోకపోతే రవి చదువు ఆపేస్తానంటున్నాడు. తను పెళ్లి చేసుకుంటే రవి చదువు కోసం వేలకి వేలు పుస్తకాలకూ, ఫీజులకూ అయ్యే ఖర్చు ఎవరు భరిస్తారు అంటోంది స్వాతి..." అంది మాలతి.

"డబ్బు గూర్చి అయితే ఇక మీదట ఆలోచించవలసిన పని లేదమ్మా. అంకుల్ అంత సంపాదిస్తున్నా ఒక్క రూపాయి కూడా వెనకెయ్యలేక ఎన్ని అవస్థలు పడ్డాం? అంకుల్ పోయాక అదో పెద్ద గుణపాఠమైంది మాకు. అందుకే నా నగలన్నీ అమ్మేసి ఇద్దరికీ చెరి సగం ఫిక్సెడ్ డిపాజిట్ చేశాను. అది వచ్చే సంవత్సరానికి చెరో యాభైవేలు అవుతుంది. ఇది గాక స్వాతికి ఉద్యోగం వచ్చిన దగ్గర నుండీ నెలకు వెయ్యి రూపాయల చొప్పున రికరింగ్ డిపాజిట్‌లో వేశాను. ఇవి చాలవామ్మా రవి చదువుకు?

ఇప్పటికే చాలా ఆలస్యం జరిగిపోయింది. దానికిష్టం లేదనుకున్నానే కానీ డబ్బు కొరత వలన ఇలా జరిగిందని నాకింత వరకూ తెలియదు. అంతకీ చాలకపోతే సూర్య ఉన్నాడు. స్వాతి సాయం చేస్తానంటే వాడు ఎన్నటికీ వద్దనడు. సూర్యది ఎంత పెద్ద మనసో తెలుసా మాలతీ? స్వాతికి కూడా తెలియకుండా దానికి ఉద్యోగం రాకముందు నా చేతికి ముప్పైవేల రూపాయలు ఇచ్చాడు ఇంటి ఖర్చులకుంచమని. మా కోసమని ఇంత కాలం చేతికందిన స్వర్గాన్ని వదిలిపెట్టింది నా కూతురు. ఇక మీదట అలా జరగనివ్వను" అంది జానకమ్మ.

ఆవిడ మాటలు వినడంతోనే మాలతి "ఇంకెందుకాంటీ ఆలస్యం? మీ అల్లుడు గారు చెప్పినట్లుగానే సాయంత్రం రవి స్వాతిని నిలేస్తాడు. మీకిదంతా ఏం తెలియనట్లే అప్పుడే వింటున్నట్లుగా కథ రక్తి కట్టించి స్వాతిని దారిలోకి తెండి. తాతయ్యా వాళ్లనుండి కూడా ఇక మీదట ఏ సమస్యా ఉండదని సూర్య మావయ్య చెప్పారు" అంది మాలతి ఉత్సాహంగా.

మధ్యాహ్నం ఆఫీసు నుండి వచ్చిన కూతుర్ని కొత్త వ్యక్తిని చూసినట్లుగా చూసింది జానకమ్మ. తమ కోసం కష్టపడుతున్న కూతుర్ని చూస్తే ఆవిడ మనసు ద్రవించిపోతోంది. అవేమీ తెలియని స్వాతికి తల్లి

ప్రవర్తన విచిత్రమనిపించింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక "అక్కా, నీతో మాట్లాడాలి!" అన్నాడు రవి సీరియస్‌గా చూస్తూ.

"ఏమిట్రా ఇవ్వాళ కొత్తగా పర్మిషన్ అడుగుతున్నావు. ఏమిటీ సంగతి?" అంది స్వాతి.

"ఏం లేదక్కా... నేను చదువు మానేద్దామనుకుంటున్నాను" అన్నాడు తలవంచుకొని.

"ఏమిట్రా నువ్వనేది? మతుండే మాట్లాడుతున్నావా?" అంది స్వాతి కోపంగా.

"అవునక్కా, ఇలాగే కొన్నాళ్లుంటే నువ్వన్నట్లు నా మతి పూర్తిగా పోయేటట్లే ఉంది. నా మూలంగానే కదా నువ్వు పెళ్లి చేసుకోకుండా ఇలా ఉండిపోయింది? ఎందుకక్కా ఇంత త్యాగం చేశావు. నేనిది భరించలేకపోతున్నాను. అసలిప్పుడు పరీక్ష ఎందుకు తప్పానో తెలుసా? అనుక్షణం ఓ ప్రశ్నార్థకంలా నీ భవిష్యత్తు నా కళ్లముందు కనిపిస్తూంటే నా భవిష్యత్తుకు పునాదులెలా వేసుకోగలను చెప్పక్కా?" అన్నాడు రవి బాధగా.

"ఏమిట్రా ఏమైంది నీకివ్వాళ? త్యాగం, భవిష్యత్తు అంటూ చాలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నావు. ఎక్కడ నేర్చావురా ఇవన్నీ?" అంది స్వాతి కళ్లు పెద్దవి చేసి తమ్ముడి వంక ఆశ్చర్యంగా చూస్తూ.

"ఇలాంటివి ఒకరు నేర్పితే వచ్చేవి కాదక్కా. జీవితంలో ఎదురయ్యే అనుభవాలే మనకు పాఠాలు నేర్పుతాయి. ఇన్ని మాటలెందుకు? నువ్విలా మోడులా మిగిలిపోతే నిన్ను చూస్తూ నేను చదువు కొనసాగించలేను" అన్నాడు రవి మొండిగా.

"ఒరేయ్, ఏం మాట్లాడుతున్నావో తెలుస్తోందా నీకసలు? అమ్మా చూడమ్మా. వీడేమంటున్నాడో. ఏరా రవీ, నీకోసం నేనప్పుడైనా నా జీవితాన్ని త్యాగం చేశానని చెప్పానురా? అయినా అసలిందులో త్యాగం ఏముందిరా? నాన్నగారి ఆశ నిన్ను డాక్టర్ని చేయాలని. మనిద్దరం కలిసి ఆయన కోరికని తీరుస్తున్నామంతే!" అంది స్వాతి అనునయంగా.

"వద్దక్కా... ఇంకేం చెప్పకు, నాకన్నీ తెలుసు. నాన్నగారి కోర్కె తీర్చడం కోసమని నువ్విలా ఉండిపోనక్కరలేదు. నాన్నగారు నన్ను డాక్టరును చెయ్యాలనే కాదు, సూర్య మావయ్యని పెళ్లి చేసుకొని నువ్వు కళకళలాడుతూ తిరగాలని కోరుకోలేదా? నాకు బతుకునివ్వడం కోసం నీ బతుకును ఎడారి చేసుకుంటానంటే నేను చూస్తూ ఊరుకోలేను" అన్నాడు రవి.

"ఎందుకురా ఇలా మాట్లాడుతున్నావీ రోజు. నువ్వు ఫెయిల్ అయ్యావని నేను తిట్టానని కోపమొచ్చి ఇలా అంటున్నావు కదూ. పోన్లేరా! ఏదో ఉండబట్టలేక నా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయిందని ఒక్క మాట అన్నందుకు నువ్విలా అనడం ఏమైనా బాగుందా? అదే నిజమైతే ఇంకెప్పుడూ ఏమీ అననులేరా!" అంది స్వాతి కన్నీళ్లతో తమ్ముడివైపూ, తల్లివైపూ మార్చి మార్చి చూస్తూ.

"కాదక్కా... నువ్వు తిట్టినందుకు నాకే బాధా లేదు. పరీక్షపోతే నాన్నగారు ఉండి ఉంటే ఆయన మాత్రం తిట్టరా ఏమిటి? నువ్విలా పెళ్లిచేసుకోకుండా ఉండిపోతే ఇక మీదట ఏదిఏమైనా నేను చదువు కొనసాగించలేనక్కా!" అన్నాడు రవి స్థిరంగా.

"ఒరేయ్, ఒకమాట అడుగుతాను నిజం చెప్పు. మొన్న గుంటూరు వెళ్లినపుడు మాల తక్క ఇవన్నీ నూరిపోసి నీ మనసును చెడగొట్టింది కదూ. దానికెంత సేపూ నా పెళ్లి గోలే!" అంది స్వాతి విసుగ్గా.

"ఎందుకక్కా అవనసరంగా మాలతక్కని తిడతావు. నేనేం చిన్న పిల్లాడినా? ఒకరు చెప్తేగానీ తెలియక పోవడానికి. ముందీ సంగతి తేల్చు, నువ్వు పెళ్లి చేసుకుంటావా? లేదా? నువ్వుకానీ పెళ్లి చేసుకోకపోతే నేను ఇంట్లోనుండి వెళ్లిపోతాను. ఇకపై ఈ జన్మలో

నా ముఖం నీకు కనిపించదు!" అన్నాడు రవి కంపిస్తున్న స్వరంతో.

"అమ్మా చూశావా, తమ్ముడేమంటున్నాడో. నేను పెళ్లి చేసుకోకపోతే వాడు ఇల్లు వదిలి వెళ్లిపోతాడటమ్మా. నేనేం చేసినా వాడికోసమే చేశాను కదమ్మా. నువ్వయినా వాడికి చెప్పమ్మా. గట్టిగా కళ్లు మూసుకుంటే మూడు సంవత్సరాలలో వీడి చదువయిపోతుంది. ఇంతా చేసి మధ్యలో వదిలేస్తే ఈనగాచి నక్కల పాలయినట్లు ఇదంతా వృధాయే కదమ్మా. ఇది చూసి పైనున్న నాన్నగారి ఆత్మ శాంతిస్తుందా అమ్మా? " అంది స్వాతి తల్లిని పట్టి రెండు చేతులతో కుదిపేస్తూ ఆరాటం నిండిన స్వరంతో.

"బాధ పడకమ్మా స్వాతీ. నువ్విలా వాడి కోసం బెంగ పడుతున్నావో అలాగే వాడూ నీకోసం ఆరాటపడుతున్నాడు తప్ప మరేమీ కాదు. కొంచెం ఆలోచించి చూడు. వాడన్నది కూడా న్యాయమే కదా. నీ బెంగంతా వాడి చదువుకు అవసరమయే డబ్బు ఎలా అనే కదా! ఉండు ఇప్పుడే వస్తాను" అంటూ లోప లికి వెళ్లి బ్యాంక్ పాస్‌బుక్, ఫిక్స్‌డ్ డిపాజిట్ రసీదులు తీసుకువచ్చి స్వాతి చేతిలో పెట్టింది జానకమ్మ.

"ఇవి చాలవా వాడి చదువుకీ, మా ఖర్చు లకీను. వద్దమ్మా, ఇంతకాలం మా కోసం చాలా కష్టపడ్డావు. ఇక ఆ అవసరం లేదు. ఇవీ చాలకపోతే నువ్వు సాయం చెయ్యి, కాద నను. అంతేగాని మాకోసం నువ్విలా ఉండి పోతే మేము భరించలేం. సూర్య నీకోసమే కాచుకొని ఉన్నాడు. వాడిని బాధ పెట్టకమ్మా నీ అర్థం లేని భయాలతో!" అంది జానకమ్మ కూతురి వంక లాలనగా చూస్తూ.

"అమ్మా... నేనిది త్యాగం అనుకొని చేయ లేదమ్మా. నేను ఎలా చెప్తే అర్థమవుతుంది నీకు? అసలిదంతా..." ఆపైన చెప్పలేనట్లుగా చేతుల్లో ముఖం దాచుకుంది స్వాతి.

కూతురు ఇంత కాలం మానసికంగా ఎంత నలిగిపోతున్నదో, రెండు చేతులూ చాచి ఈ కుటుంబానికి ఆలంబనగా ఎలా నుంచుందో తన మనుసులోని ఆశలకీ, కోరికలకీ ఎలా సమాధి కట్టేసిందో ఉదయం మాలతి ద్వారా విని ఉండడంతో జానకమ్మ మనసు కరిగి నీరయిపోయింది.

"ఊరుకోమ్మా. నువ్వేం చెప్పకు. నాకన్నీ తెలుసు. ఎందుకే పిచ్చిదానా నీ మనసు నా దగ్గర దాచి ఇంత చిత్ర వధ అనుభవిం చావు? " అంది జానకమ్మ ఓదార్పుగా స్వాతిని పొదివి పట్టుకొని గుండెలకు హత్తు కుంటూ.

వెంటనే రవి స్వాతి ముందు మోకాళ్ల మీద కూర్చుంటూ "ఏడవకక్కా నువ్వేడిస్తే నేను చూడలేను. నేనెప్పుడూ నిన్ను తప్పుగా అను కోలేదు. నా బాధంతా నువ్విలా నాకోసం మిగిలిపోకూడదనే. నా మాట వినక్కా!" అన్నాడు స్వాతి ఒడిలో తలదూర్చి

ఆ మాటలతో కరిగిపోయిన స్వాతి ఏడ్చేస్తూ రవిని పొదివి పట్టుకొని "నీ ఇష్టం అమ్మా, మావయ్యతో మాట్లాడి ముహూ ర్తాలు పెట్టించు!" అంది తల్లి మీదా, తమ్ముడి మీదా చెరో చెయ్యి ఉంచి.

తల్లి ముందుచూపు స్వాతికి ఎంతో నిశ్చింత కలిగించింది. అందుకే మనస్ఫూర్తిగా పెళ్లికి ఒప్పుకుంది. సమస్య ఇంత సులభంగా పరిష్కారం అయినందుకు రవీ, జానకమ్మల ముఖాలు ఆనందంతో వెలిగిపోయాయి.

వెంటనే జాకనమ్మ లేచి సూర్యకి ఫోన్ చేసింది "ఒరేయ్ తమ్ముడూ స్వాతి పెళ్లికి ఒప్పుకుందిరా! తొందరగా వచ్చి అమ్మా నాన్న లతో మాట్లాడరా!" అంది ఆనందోద్వేగాలతో.

"నిజమా అక్కా.... ఏదీ స్వాతి ఉందా అక్కడ? ఒకసారి ఫోనివ్వు!" అన్నాడు సూర్య, తాను కూడా ఆనందంతో ఉక్కిరిబి క్కిరి అవుతూ.

"ఆ ఉందిరా..." అంటూ స్వాతికి ఫోన్ ఇచ్చి రవికి సైగ చేసింది. ఇద్దరూ అక్కడ నుండి వెళ్లిపోయారు.

"హలో మావయ్యా!" అంది స్వాతి గొంతు

పెగుల్చుకొని.

"ఏయ్, పెంకిపిల్లా ఏం చేస్తున్నావ్? ఇంత మంచి కబురు నువ్వు చెప్పకుండా అక్కతో చెప్పిస్తావా? నీ పని చెప్తానుండు" అన్నాడు సూర్య.

"ఏం చేస్తావేం? " అంది స్వాతి కళ్లు తుడుచుకుంటూ- పొంగి పొరలే సంతోషంతో.

"ఏం చేస్తానా ఈ రాత్రంతా ఫోన్‌లో నీతో కబుర్లు చెప్తూ ఉండిపోతాను" అన్నాడు సూర్య.

"అంత పని చెయ్యకు ఫోన్ బిల్లు నేనే కట్టాలి" అంది స్వాతి అల్లరిగా.

"ఈ శుభ సమయంలో నీకేం కావాలో చెప్పు తెస్తాను!" అన్నాడు సూర్య.

"నాకేం వద్దు మావయ్యా నాకు నువ్వే కావాలి. ఈ జన్మకిది చాలు. తొందరగా వచ్చెయ్!" అంది స్వాతి ఆర్తిగా.

స్వాతి ఫోన్‌లో మాట్లాడుతూండగా జానకమ్మతో చెప్పి మాలతి దగ్గరకు పరుగున వెళ్లాడు రవి.

"అక్కా! సక్సెస్, గ్రాండ్ సక్సెస్! స్వాతక్క పెళ్లికి ఒప్పుకుంది" అంటూ మాలతిని పట్టుకొని గిరగిరా తిప్పేశాడు రవి.

"ఎంత మంచి వార్త చెప్పావురా రవీ. ఈ వార్త కోసమే ఎన్నాళ్ల నుండో ఎదురుచూస్తున్నానురా నేను. స్నేహితురాలిగా నేను సాధించలేనిది చిన్నవాడివైనా నీవు సాధించావురా!" అంటూ మాలతి సంబరపడిపోతూ రవి నుదుటిమీద ముద్దు పెట్టుకుంది ప్రేమగా.

రవి గొంతు విని బెడ్‌రూమ్‌లో నుండి హాల్లోకి వచ్చిన చిరంజీవి "ఏమిటే? ఆనందం మీ ఇద్దరి స్వంతమేనా? నాకేం లేదా? " అన్నాడు ఇద్దరి వంకా చూస్తూ.

"ఇదంతా మీ కృషి ఫలితమే కదా బావగారూ! సూత్రధారులు మీరైతే పాత్రధారులం మేము! ఇందులో పంచేదేముంది. మొత్తం మీదే. చాలా థాంక్స్ బావగారూ!" అన్నాడు రవి ఉద్వేగంగా.

"ఉత్త థాంక్స్‌లేనా లేక తీపి తినిపించడం ఏమైనా ఉందా? " అన్నాడు చిరంజీవి అల్లరిగా.

"ఓ... అదెంతపని బావగారూ, చిటికెలో వెళ్లి తీసుకువస్తానుండండి!" అన్నాడు రవి ఉత్సాహంగా.

"ఊరికే సరదాగా అన్నాను లేవోయ్. నీ మాటే పదిరకాల స్వీట్స్ తిన్నంత కమ్మగా ఉంది" అంటూ చిరంజీవి టైము చూస్తూ "మాలతీ టైమెంతో కాలేదు కదా! మనం కూడా వెళ్లి స్వాతిని అభినందించి వద్దామా? " అన్నాడు.

"ఉత్త చేతులతో కాదు. ఏదైనా స్వీటు తీసుకెళ్లి సెలిబ్రేట్ చేసుకుందాం!" అంది మాలతి.

"అయితే నేను వెళ్లి స్వీటు తీసుకువస్తాను" అన్నాడు చిరంజీవి.

"దీనికోసం మీరు వెళ్లాలా బావగారూ వాసూ అన్నయ్యా, నేనూ వెళ్లి తీసుకువస్తాం" అన్నాడు రవి. స్వాతి పెళ్లికి ఒప్పుకుందన్న వార్త విని ఇందిరమ్మా విశ్వనాథంలు తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు.

స్వీట్ తెచ్చాక ముగ్గురూ కలిసి స్వాతి దగ్గరకు వచ్చారు. మాలతి, స్వాతిని చూడడంతోనే రెండు చేతులూ చాచింది ప్రేమగా. స్వాతి రివ్వున వచ్చి మాలతి చేతుల్లో వాలిపోయి వెక్కివెక్కి ఏడ్చింది అది ఆనందమో, దుఃఖమో తెలియనట్లు.

"ఏయ్ మొద్దూ, నీ జీవితంలో ఏడిచే అధ్యాయం ముగిసిపోయింది. ఇకమీదట అంతా ఆనందపర్వమే. అన్నీ మరిచిపోయి హాయిగా నవ్వవే బాబూ!" అంటూ స్వాతి చెంపలపై జారిన కన్నీటిని తన పమిటకొంగుతో అద్ది, తాను తెచ్చిన స్వీటు స్వాతి నోటికి అందించింది మాలతి. తాను సగం తిని మిగతా సగం మాలతి నోట్లో పెడుతూ "కష్టమైనా సుఖమైనా మనిద్దరికీ ఎప్పుడూ ఫిఫ్టీ ఫిఫ్టీ కదే!" అంటూ నవ్వింది స్వాతి.

వాళ్ల అనుబంధాన్ని ముచ్చటగా చూస్తూండిపోయారు చిరంజీవి, రవి, జానకమ్మ. ✦

## చతుర కథ

# అత్యాశ

### కె. రామారావు

వెంకట్రావు ఇంట్లో దొంగతనం జరిగింది. ఆదివారం సెలవుకదా అని భార్యతో కలిసి యాదగిరి గుట్టకి వెళ్లాడు. పొద్దున తొమ్మిది గంటలకు ఇంటికి తాళం వేసి ఇద్దరూ బస్సులో వెళ్లారు. దైవదర్శనం చేసుకొని రాత్రి తొమ్మిది గంటలకి తిరిగివచ్చారు. అక్కడి దృశ్యం చూసి హతాశులయ్యారు. తాళం విరగగొట్టబడి ఉంది. తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి. గాభరాగా తలుపులు తీసుకొని లోపలికి వెళ్లి లైటు వేశారు. ముందరిగదిలో ఎలాంటి మార్పులేదు. పడకగదిలో ఉన్న బీరువా తలుపులు తీసి ఉన్నాయి. గుడ్డలు చిందరవందరగా పడి ఉన్నాయి. లాకర్ తీసి ఉంది. అందులో ఉండాల్సిన నగలు - డబ్బు మాయమయ్యాయి. లబోదిబోమంటూ పోలీస్‌స్టేషన్‌కి వెళ్లాడు. పోలీసులు రావటం, ప్రశ్నలడగటం , అన్నీ యధావిధిగా జరిగిపోయాయి. పోలీస్ ఇన్‌స్పెక్టర్ "పోయిన సొమ్ము వివరాలు రాసి అప్లికేషనివ్వండి" అంటూ జీపులో వెళ్లిపోయాడు. వెంకట్రావు మర్నాడు పోయిన వస్తువుల లిస్టు తయారుచేస్తుండగా అతడి బుర్రలో ఒక ఆలోచన మెరిసింది. అన్నీ రెండింతలు రాస్తే పోలా అని. దొంగ దొరికితే మంచిదే. లేకపోతే గాలికిపోయిన పేలపిండి కృష్ణార్పణం అనుకుంటాను అని లిస్టు తయారుచేశాడు. 40 వేలు పోతే 80 వేలు రాశాడు. 4 బంగారు గాజులు పోతే 8 రాశాడు. ఒక బంగారపు గొలుసుపోతే రెండు రాశాడు. ఒక చంద్రహారం రాశాడు. లిస్టు తీసుకెళ్లి పోలీస్‌స్టేషన్లో ఇచ్చాడు. పేపర్లో పెద్దపెద్ద అక్షరాలతో వెంకట్రావు ఇంట్లో దొంగతనం జరిగినట్టు - పోయిన సొమ్ము వివరాలు వచ్చాయి. తన పేరు ఈ విధంగానైనా పత్రికలో వచ్చినందుకు సంతోషించాడు. ఇది జరిగిన వారం రోజులకి వెంకట్రావుకి ఇన్‌కం టాక్స్ ఆఫీసు నించి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం సారాంశం "మీ ఇంట్లో దొంగతనం జరిగినట్లు పేపర్లో వచ్చింది.



పోయిన సొమ్ము వివరాలు చూస్తే అవి మీ ఆదాయానికి మించినవిగా కనపడుతున్నాయి. మీరు ఒక గుమాస్తాగా పనిచేస్తున్నారు. కాబట్టి మీ సోర్స్ ఆఫ్ ఇన్‌కమ్ - మీరు ఆదాయపు పన్ను కడుతున్నది లేనిది వివరాలు పంపగలరు. వారం రోజులలో సమాధానం రానియెడల తగిన చర్య తీసుకోబడును." వెంకట్రావు నెత్తిన గుడ్డ వేసుకొని ఇన్‌కంటాక్స్ కన్సల్టెంట్ దగ్గరకి పరుగెత్తాడు. ✦




# ప్రేమ చిరంజీవి!



జీవితం అంటేనే ఎదగడం. అది ప్రేమలోనూ ఉండాలి. యుక్తవయసులోని వ్యామోహం దగ్గరే ఆగిపోతే అది ప్రేమ అవదు. పరిపూర్ణత రాదు. వ్యామోహాన్ని దాటి గుణగణాలతో సంబంధం లేకుండా వ్యక్తిని ప్రేమిస్తేనే అది ప్రేమ అవుతుంది. శారీరకంగా యుక్తవయసుకొచ్చేసరికి మనిషి సంపూర్ణంగా ఎదుగుతాడు. అంతర్గతంగా మాత్రం నిజమైన ప్రేమను పొందినప్పుడే పరిపూర్ణుడవుతాడు. రెండు నేపథ్యాలు, రెండు అభిప్రాయాలు, రెండు హృదయాలు... వెరసి ప్రేమ. కళ్లూ కళ్లూ కలుసుకోవడం కాదు... దూరాన్ని, సమయాన్ని అధిగమించి ఒక మనసు మరో మనసుతో మమేకమవడం ప్రేమ. ఆకాశంలోకి ఎగబాకాలన్న నీ కలను అర్థం చేసుకుని నిచ్చెనలా నిలిచేవాడే ప్రేమైక సహచరుడు కాగలుగుతాడు. ఒకరికొకరు అలాంటి నిచ్చెనలు కాగలిగినప్పుడే ప్రేమ చిరంజీవిగా నిలుస్తుంది.

మొన్నీ మధ్య ఏదో సమావేశానికి వెళ్లినపుడు ప్రేమ వివాహం... అందునా మతాంతరం చేసుకుని ఇద్దరు పిల్లలకు తల్లిదండ్రులై సంతోషంగా కాపురం చేసుకుంటున్న ఒక జంట పరిచయమైంది. వారిద్దరినీ చూస్తే ముచ్చటేసింది. అతనిది నిప్పులు కడిగే బ్రాహ్మణకుటుంబమట. ఆమెది మాంసాహారం తినే క్రైస్తవ కుటుంబం. ఎంతో అన్యోన్యంగా, బాధ్యతాయుతమైన తల్లిదండ్రులుగా, మంచి ఉద్యోగులుగా, సంఘం పట్ల తమ కర్తవ్యం తెలిసినవారుగా కన్పించారు. చెప్తే తప్ప తెలియదు వారిది మతాంతర వివాహమని.

మూడు రోజులు వారితో కలిసి ఉన్నాను. అప్పుడప్పుడు వారిని వ్యక్తిగత విషయాల్లోకి లాక్కెళ్తూ చాలా సంగతులే సేకరించాను. చెప్పొద్దూ... వాళ్లనుంచి నేను నేర్చుకున్న కొత్త కోణాలన్నీ కలిపి ఒక పుస్తకం రాసి... ప్రేమంటే ఇదీ.. అని లోకానికి చాటిచెప్పాలనిపించింది.

యాసిడ్‌ప్రేమలు, గొడ్డళ్లతో నరికే ప్రేమలు, హత్యలకు, ఆత్మహత్యలకు ప్రేరేపించే పర్వర్షన్ ప్రేమల వార్తల్ని చూసి ప్రేమంటే భయపడిపోతున్న యువతరానికి... అది కాదు తల్లీ ... ప్రేమంటే ఇదీ... అని ఎలుగెత్తి చాటాలనిపించింది. నిజమైన ప్రేమ ఏదో తెలియని సమాజం పట్ల నాకెప్పుడూ కోపంగానే ఉండేది. అందుకే ఆ అమ్మాయి మాటల్లో విన్పించిన ప్రేమగానం నన్ను మైమరపింపచేసింది.

'మీ ప్రేమవిజయాన్ని నువ్వెలా విశ్లేషిస్తావు?' అనడిగాను.

'ఎవరి వ్యక్తిత్వం వారిది కదా. మా అమ్మానాన్నలకి, అత్తామామలకి వచ్చినట్లే మాకూ అభిప్రాయభేదాలొస్తాయి. అయితే వాటికి మా నేపథ్యాల రంగు పులమం. మూడోవ్యక్తి దగ్గరికెళ్లి ఒకరి ప్రవర్తన పట్ల అసంతృప్తి ప్రకటించం. అభిప్రాయాలను స్పష్టంగా చెప్పుకొని వివాదాన్ని క్లియర్ చేసుకుంటాం. అవసరమైతే ఏకాభిప్రాయం కుదిరేదాకా చర్చించుకుంటాం కానీ నాదే పైచేయి కావాలని పోట్లాడుకోం. దాంతో హాయిగా జీవించగలుగుతున్నాం.' అందా

మ్మాయి.

నిజమే కదా. ఏ బంధమైనా పరస్పరన మ్మకం మీదే నిలబడుతుంది. పెళ్లిళ్లు విఫల మవడానికి ప్రధానకారణం మరో వ్యక్తి జోక్యమే. నిజమైన ప్రేమ తెలిసినవారు మాత్రమే బాహ్యప్రభావాలకు లోనవరు. భాగ స్వామి గురించి తమ అభిప్రాయానికి విలు విస్తారు కానీ ఇతరుల అభిప్రాయానికి కాదు. ప్రేమ పెళ్లి అనేసరికి పెద్దల సహకారం ఉండకపోవడమే కాదు... ప్రతి చిన్నదానికీ నేను చెప్తూనే ఉన్నాను కదా... ఇలాగే అవు తుందని.. మోజు తీరేంతవరకేనని... అంటూ పెద్దలు దెప్పుతుండడం సహజం. అభిప్రాయభేదాలు అరేంజ్‌డ్ మ్యారేజీల్లో రావా? ఎందరు భార్యాభర్తలు పుట్టిళ్లగురించి, అక్కడి అలవాట్ల గురించి దెప్పిపొడుపులతో ఒకరినొకరు ఉతికి ఆరేసుకోరు?

ఫిజిక్స్, కెమిస్ట్రీ ప్రయోగాలెలా చేయాలో చెప్పే మ్యాన్యుయల్ లాగా ఎలా ప్రేమించాలో తెలిపే మాన్యుయల్ ఉండదు. ఆరోజే కన్ను తెరిచిన పసిగుడ్డు నవ్వినట్లుగా అతి సహ జంగా ప్రేమించడం వచ్చేస్తుంది. అలాగని ప్రేమమార్గం చక్కని పూలబాట కాదు. రాళ్లు రప్పలు, ఎగుడుదిగుళ్లు ఎన్నో ఉంటాయి. జీవితంలో ఎదురయ్యే పలుసమస్యలు ఈ బంధాన్నే పరీక్షిస్తాయి. వాటన్నిటికన్నా శక్తి మంతమైంది కాబట్టే ప్రేమబంధం చివరివ రకూ నిలిచివుంటుంది.

మనమెదుర్కొనే పలురుగ్మతలకు ప్రేమే ఔషధం. అది కనిపెట్టబట్టే మదర్ తన ప్రేమను పంచి ఎందరికో ఉపశమనం కలి గించగలిగింది.

ప్రేమలో అధికారం ఉండదు... అందుకు నా క్రైస్తవ మిత్రురాలే నిదర్శన. 'చాలామంది అడిగారు నన్ను. ఎలా ఎడ్జస్టవుతావు? మన జీవితంలోంచి మతాన్ని విడదీయలేం కదా.. గొడవలొస్తాయేమో... అన్నారు. కానీ మతం నాకు సంబంధించిన వ్యవహారం. జీవితం మా ఇద్దరిదీ. పెళ్లి చేసుకున్నాక నా ఆనందం కన్నా మా ఇద్దరి ఆనందం నాకు ముఖ్యం అనుకున్నాను. అతనూ అలాగే భావించాడు. ఈ విషయంలోనే కాదు... ఏవిషయంలో నైనా సరే... యువర్ ఫ్రీడమ్ ఎండ్స్ వేర్ మై నోస్ బిగిన్స్... అన్న సూత్రాన్ని మేం నమ్ముతాం. అందరూ దాన్ని అర్థం చేసు కుంటే గొడవలొస్తాయని నేననుకోను...'

ప్రేమలో సమభావం ఉంటుంది. అది లేకుండా నేనెక్కువ... నువ్వు తక్కువ అన్న భావం చోటుచేసుకుంటే అనుబంధం బలపడా ల్సిన చోట అధికారం స్థిరపడుతుంది. అప్పుడది తప్పనిసరి సంబంధం అవుతుంది కానీ ప్రేమబంధమవదు.

నా మిత్రబృందంలో ప్రేమ వివాహాలు చేసుకున్నవాళ్లు చాలామందే ఉన్నారు. ఒక్కొ క్కరిదీ ఒక్కోరకం ప్రేమ. వాళ్ళతో మాట్లాడు తుంటే నిజంగానే ప్రేమగురించి పీహెచ్‌డి చేసెయ్యొచ్చనిపిస్తుంది. ఒకబ్బాయి డిగ్రీ చదు వుతున్న అమ్మాయిని చూసి ప్రేమలో పడ్డాడు. పొడవాటి ఆమె వాలుజడ, బాపూ బొమ్మలాంటి అందం అతన్ని కట్టిపడేశా యట. మూడేళ్లు కాపలా కాసి పెద్దవాళ్లు వ్యతిరేకిస్తే ఆస్తి సైతం వదులుకుని ఆ అమ్మాయినే పెళ్లి చేసుకుని హాయిగా ఉన్నాడు. మరో అమ్మాయి ఏరికోరి కులం, గోత్రం, ఉద్యోగం... అన్నీ చూసి బాగున్నా యనుకున్నాకే ప్రేమించడం మొదలెట్టింది. వాళ్లూ పెళ్లి చేసుకున్నారు చాలా సంతోషంగా ఉన్నారు. బహుశా మనకేం కావాలో అది ఎదుటి వ్యక్తిలో చూసి ప్రేమించినపుడు ఆ ప్రేమగానంలో అపస్వరాలు పలకవను కుంటా. కాకపోతే ఆ నచ్చడం రెండువైపుల నుంచీ ఉండాలి. అంటే నిజమైన ప్రేమికుడు నెచ్చెలి కలలను తన కళ్లతో చూసి తెలుసు కుంటాడు. కలతలను ఆమె దాకా చేరక ముందే ఆపే ప్రయత్నం చేస్తాడు. ఆమె అను భూతులను అతను అర్థం చేసుకుంటాడు. అతనిలోని లోపాలను ఆమె క్షమిస్తుంది.

ప్రేమికులను చూసి బాధపడిన సంద

ర్భాలూ లేకపోలేదు... ఒకరోజు ఓ స్నేహితు రాలింటికెళ్లాను. వాళ్లదీ లవ్ మ్యారేజే. అతనితో నాకంతగా పరిచయం లేకపోయినా కొత్తవ్యక్తినున్నానన్న సంకోచం లేకుండా నా ముందే ఆమె భర్త ఇల్లూడవడం దగ్గర్నుంచీ అన్నిపనులూ చేశాడు. భార్యను అంత అపురూపంగా చూసుకుంటున్నందుకు ముచ్చటేసింది. మరోసారి మాటల్లో ఆ అమ్మాయి ఆవేదన విన్నాక ఆ ప్రేమ వెనకాల మరో కోణం అర్థమైంది. ఒకవిధంగా ఆ అమ్మాయి అతని ప్రేమ పంజరంలో బందీ. ఇంట్లో ఫర్నిచరు కవర్ల దగ్గర్నుంచీ ఆమె కట్టుకునే చీర వరకూ అన్నీ అతనే సెలెక్ట్ చేయాలి. ఆమె ఇష్టాయిష్టాలతో ఏమాత్రం ప్రమేయం ఉండదు. ఎప్పుడైనా స్నేహితులతో కలిసి బయటకు వెళ్లినప్పుడు టెంప్ట్ అయ్యి ఒక చీర కొంటే... ఛీ ఆ రంగు నీకేం బాగోదు... పనమ్మాయికి ఇచ్చెయ్... అంటాడట. బయటినుంచి చూసేవారికి అతనికి భార్యమీద ఎంత ప్రేమ అన్పిస్తుంది. కానీ భార్యకు కదా తెలిసేది ఆ ప్రేమ ఎంత సఫొకేటింగ్‌గా ఉందో. ప్రేమించి పెళ్లికి ఒప్పుకొంటే జీవితాన్నే రాసిచ్చేసినట్లు కాదు. ఆమె మనసు ఆమెకుంటుంది. దానికి ఇష్టాయిష్టాలుంటాయి. ప్రేమించి పెళ్లి చేసుకున్నా ఎవరి స్పేస్ వారికి ఉండాలి. అది లేకపోతే ఊపిరాడక మనసు చచ్చిన మనిషిగా మిగిలిపోతారు. ప్రేమ సురక్షితమైన పంజరం కాకూడదు. స్వేచ్ఛగా ఎగిరే విహంగం కావాలి ప్రేమ.



కొత్తలో ఉన్న ప్రేమ తర్వాతుండదు... అంటారు. అలా ఆవిరైపోయేది ప్రేమ కాదు.. మోజు. కొత్తలో మరో బాధ్యతేమీ ఉండదు కాబట్టి చిలకాగోరింకల్లా చెట్టాపట్టాలేసుకుని షికార్లకు తిరుగుతారు. ఆ తర్వాత పిల్లలు వస్తారు. వాళ్లను చూసుకోవడానికి పెద్దవాళ్లు వచ్చిపోతుంటారు. పిల్లలు కాస్త పెద్దవాళ్లయ్యేసరికి వాళ్లకి స్కూళ్లు, వీళ్లకు ఆఫీసులు... ఒకటే హడావుడి. ఒకరికళ్లలోకి ఒకరు చూసుకుంటూ కూర్చోవడానికి సమయమెక్కడ? అంత మాత్రాన ప్రేమ తగ్గుతుందా? వయసుతోపాటు ప్రేమను వ్యక్తీకరించే పద్ధతులు మారుతుంటాయి. ఆమె ఆఫీసులో వేధించే సమస్యని ఇంటిదాకా తెచ్చిందంటే అతను గుమ్మంలోనే కనిపెట్టేస్తాడు. నవ్వించే వరకు ఊరుకోడు. ఇంటివిషయంలో, పిల్లల విషయంలో ఏదైనా ఒక సమస్య గురిం చి అతని మనసులో ఆలోచన మొదలైందంటే చాలు తేడా కనిపెట్టేసి చెప్పేవరకు ఊరుకోదామె. సాహచర్యం వారి మనసుల మధ్య సమన్వయం కుదిర్చింది. ఆమె ఆలోచన అతని గొంతులో పలుకుతుంది. అతని అనుభూతి ఆమె కళ్లలో ప్రతిఫలిస్తుంది. అదీ ప్రేమంటే.

ఒక్కోసారి మనసు మాట పలుకు మర్చిపోతుంది. నీరవనిశ్శబ్దాన్ని కోరుకుంటుంది. అప్పుడు సవాలక్ష ప్రశ్నలతో వేధించక, కళ్లలోకి చూసి నీ నిశ్శబ్దాన్ని అర్థంచేసుకుని, వెచ్చని స్పర్శతో సాంత్వన నివ్వగల వ్యక్తి దొరికితే ప్రేమను గెలిచినట్లే... దాని ముందు ఈ ప్రపంచం ఏపాటిది?

– విస్మయ ✦

**కథ వెనుక కథ** అమ్మాయిల్లో స్వార్థాన్ని ఎండగట్టిన



# హేమ

సాధారణంగా అభూతకల్పనలు రాయను. ఇతివృత్తాన్ని చాలా నెలలపాటు నా మనసులోనే నానబెట్టి ఉంచుతాను. ఎన్ని పేజీలు రాయాలి... ఎన్ని భాగాలుగా విభజించుకోవాలి... తదితర విషయాలన్నీ రాసి పెట్టుకుంటాను. పాత్రల వివరాలు కూడా రాసుకుంటాను. ఇది నేను కాలేజీలో చదువుతున్నప్పుడే అలవాటైన పద్ధతి అంటున్న రామలక్ష్మి వాస్తవిక సంఘటనలను ఎత్తుగడకోసం వాడుకుంటారు. నాలుగేళ్ల క్రితం ప్రచురించిన **'హేమ'** తనకెంతో ఇష్టమైన నవలంటారు. మన అనే దృక్పథం లోపించటం వల్ల వచ్చే నష్టాలను చిత్రించిన ఆ నవల నేపథ్యమిది.



**రామలక్ష్మి**

స్వతంత్ర పత్రికలో జర్నలిస్టుగా రాత కార్యక్రమానికి శ్రీకారం చుట్టిన రామలక్ష్మి ఆరుద్ర క్రమంగా సృజనాత్మక సాహిత్యంలో ప్రవేశించారు. రచయిత్రిగా నేల విడిచి సాము చేయననే రామలక్ష్మిని తొలి ఫెమినిస్టు రచయిత్రి అన్నారు చేరా. నలభైదాకా నవలలు, మూడు కథల సంపుటులు వెలువరించిన రామలక్ష్మిని వివరాలు చెప్పమంటే తడుముకుంటారు. "రాయడమే తప్ప అన్నీ గుర్తు పెట్టుకోనమ్మా..." అన్నారామె. ఆమె రాసిన జీవనజ్యోతి, అభిమానవతి, రాముడు లాంటి రచనలు సినిమాలుగా వచ్చాయి. జీవనజ్యోతి ఉత్తమకథగా అవార్డు కూడా పొందింది. 'అదేపనిగా రాయను.. ఎక్కువగా చదువుతాను. సంఘసేవ, పరిశోధన నాకిష్టం...' అన్నారు రామలక్ష్మి.

తాళ్లపాక కవుల పలుకుబడులపై రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ దగ్గర కె.రామలక్ష్మి చేసిన పరిశోధన పత్రాన్ని సాహిత్య అకాడమీ ప్రచురించింది. తర్వాత స్టూవర్టుపురం దొంగల జీవితం, దక్షిణాది రాష్ట్రాల్లో మాతృస్వామ్య విధానం తదితర అంశాలపై కూడా ఆమె పరిశోధన చేశారు. తాను ఇటీవల రాసిన 'హేమ' అనే నవల కథవెనుక కథపై ఆమె ఎన్నో విషయాలు చెప్పారు.

**అభూత కల్పనలకు దూరం**

'నేను సాధారణంగా అభూతకల్పనలు రాయను. ఇతివృత్తాన్ని చాలా నెలలపాటు నా మనసులోనే నానబెట్టి ఉంచుతాను. ఎన్ని పేజీలు రాయాలి... ఎన్ని భాగాలుగా విభజించుకోవాలి... తదితర విషయాలన్నీ రాసి పెట్టుకుంటాను. పాత్రల వివరాలు కూడా రాసుకుంటాను. ఇది నేను కాలేజీలో చదువుతున్నప్పుడే అలవాటైన పద్ధతి. నేను పుట్టుకతో రచయిత్రిని కానని సాధనతోనే అయ్యానని చెప్పడానికి ఇంతకన్నా రుజువేం కావాలి? కష్టపడి పాత్రికేయురాలిగా మొదలెట్టి రచనల్లోకి దిగాను' అంటూ తన నేపథ్యాన్ని వివరించిన రామలక్ష్మి ఎంచుకునే ఇతివృత్తాలు నిజంగానే వాస్తవికంగా ఉంటాయి. వాస్తవిక సంఘటనలను ఎత్తుగడకోసం వాడుకుంటారామె. రామలక్ష్మి ఇటీవల రాసిన నాలుగైదు నవలల్లో విషయపరంగా చర్చలు రేకెత్తించిన నవల హేమ.

2001లో విశాలాంధ్ర ప్రచురించింది ఈ నవలను. తొంభై పేజీల ఈ చిన్ని నవల తనకెంతో ఇష్టమైన నవలంటారు రామలక్ష్మి.

ఆధునిక యువతులు కొందరిలో బాధ్యతారాహిత్యం, స్వార్థం, స్వసుఖం కోసం పరిసరాలనీ, తనవాళ్లనీ, ఎదుటివాళ్లనీ కూడా నిస్సిగ్గుగా వాడుకోగల నేర్పరితనం చాలా ఎక్కువగానే ఉన్నాయని, ఎంతసేపూ 'నేను', 'నా' తప్ప 'మన' అన్న దృక్పథం లోపిస్తోందని దానివల్ల నష్టపోతున్నది కుటుంబమొక్కటే కాదు... వారి వ్యక్తిగత జీవితాలు కూడాననీ.. చెప్పడానికే తానీ నవల రాశానని రామలక్ష్మి చెప్పారు.

**ఇదీ కథ**

భార్య పోయిన మాధవరావు ఇద్దరు కొడుకులతో అటు ఉద్యోగం చేస్తూనే ఇటు ఇంట్లో చేయికాల్చుకుంటూ జీవితం నెట్టు కొస్తుంటాడు. ఆయన పెద్దకొడుకే కథానాయిక హేమ భర్త శేషగిరి. తాను రిటైరయ్యే లోపలే పిల్లలిద్దరి పెళ్లిళ్లుచేసి జీవితంలో స్థిరపడేలా చూడాలనుకుంటాడు మాధవరావు. ఉన్నంతలో సర్దుకుని పొందిగ్గా జీవనం సాగించాలనుకునే ఈ తండ్రీకొడుకులు ఆడదిక్కుకు మొహం వాచిపోయి ఉన్నందున కోడలు వచ్చి ఇల్లు చక్కదిద్దుతుందని ఆశపడతారు. అందాలబొమ్మ తనకు అర్థాంగిగా వస్తున్నందుకు సంతోషించే శేషగిరి తనభార్య వస్తే తండ్రి చెయ్యి కాల్చుకునే పని ఉండదని, భార్య పోయినప్పటి నుంచి కష్టపడుతున్న ఆ పెద్దమనిషి కాస్త సుఖపడతాడని,చదువుకున్న అమ్మాయి కనుక మరిదిని చెవిమెలేసి చదివిస్తుందని... ఊహించుకుని సంబరపడిపోతాడు.




తండ్రిలేని హేమ. తల్లి, మేనమామ దగ్గర పెరిగినా వారే ఆశ్చర్యపడేలా స్వార్థంతో ప్రవర్తిస్తుంది. శేషగిరిని ఇష్టపడే పెళ్లి చేసుకున్న ఆమె అతని బాధ్యతల్ని పంచుకోడానికి ఇష్టపడదు. మెట్టిన ఊళ్లో ఉద్యోగం తాను వెతుక్కునేకన్నా తానుండే నగరంలో శేషగిరికే మంచి ఉద్యోగం దొరికే అవకాశాలెక్కువ కనుక అతన్నే ప్రయత్నించమంటుంది. కాపురానికి తరలిరాకుండా వారాంతం సెలవుల్లో వచ్చిపోతుంటుంది. భర్త తన మాట వినాలంటే ముందు మామగారిని దారిలోకి తెచ్చుకోవాలని అటునుంచి నరుక్కొస్తుంది హేమ. పైకి వచ్చే అవకాశాలు అక్కడే ఎక్కువ కదా మామయ్యా..ఎన్నాళ్లిలా బెత్తెడు సంపాదన. రేపు పిల్లాజెల్లా పుడితే ఎలా... అంటూ కాదనలేని పరిస్థితి తెస్తుంది ఆ వృద్ధుడికి. చొరవగా ప్రయత్నించి శేషగిరికి ఉద్యోగం వేయిస్తుంది. మామగారిని వదిలేసి, మరిదిని మాత్రం తీసుకుని నగరంలో కొత్తకాపురం పెడుతుంది. మరిదిని చూసి పొరుగువాళ్లు పనిపిల్లవాడుగా భావిస్తే అవునంటుంది కానీ సరిదిద్దదు. శేషగిరికి హేమపై కోపం పెరిగిపోతూ ంటుంది. దాంపత్యసుఖాల్ని కొసరి కొసరి అందిస్తూ మొగుడ్ని తన దారిలోకి తెచ్చుకుంటుంటుంది హేమ. భార్య స్వభావం అర్థమవుతూనే ఉన్నా ఏమీ చేయలేని అసహాయస్థితిలో ఉండిపోతాడు శేషగిరి. వదినమీద ఆశలు అడియాసలు కాగా తండ్రి దగ్గరకు వెళ్లిపోతాడు శేషగిరి తమ్ముడు. భార్యాభర్తలిద్దరికీ ఒకరికి పగలు, ఒకరికి రాత్రి డ్యూటీలు. శేషగిరికి ఇంట్లో భార్య లేకుండా

ఉండటమే హాయన్న భావం కలుగుతుంది. అలాంటి సమయంలో అమాయకంగా కన్పిస్తూ నవ్వుతూ తుళ్లుతూ ఉండే కూరలమ్మి సీతాలు శేషగిరికి అందంగా కన్పిస్తుంది. తన భార్యదీ అందమే కానీ అందులో జీవం లేదని భావిస్తూ సీతాలుకు చేరికవుతాడు. ఇదంతా పొరుగిళ్లవాళ్ల ద్వారా తెలిసినా తనలో తాను మథనపడడం మినహా ఏమీ చేయలేకపోతుంది హేమ. ఆ తర్వాత కొన్నాళ్లపాటు కన్పించకుండా పోయిన సీతాలు అచ్చుగుద్దినట్లు శేషగిరిని పోలిన కొడుకును తీసుకుని మళ్లీ కూరలమ్మడానికి వస్తుంది. 'అలగావాళ్లం కదా మురికైతే కడుక్కుని మామూలుగా బతుకుతాం. దండగమారి పరువుకోసం పాకులాడేది మీలాంటి పెద్దమనుషులే. మీకు మురికి అంటినా కనబడకుండా ఉంటే చాలనుకుంటారు..' అంటుంది సీతాలు... ఇన్నాళ్లూ ఏమైపోయావే అంటూ పిల్లవాడిని ఆసక్తిగా గమనిస్తున్న పొరుగువాళ్లతో. ఆ తల్లీ బిడ్డలను చూసిన హేమ అవమానంతో కుతకుత ఉడికిపోయి వెంటనే ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోవడంతో కథ ముగుస్తుంది.

**యాంటీ విమెన్ అన్నారు...**

'హేమ' నవలపై మహిళలకు వ్యతిరేకంగా రాసిన నవల అన్న విమర్శ వచ్చిందని రామలక్ష్మి చెప్పారు. 'కస్తూరి' మహిళలకోసం రాసిన నవలగా పరిగణించిన వారు దీన్ని మాత్రం యాంటీ విమెన్ అన్నారని, తనదృష్టిలో మాత్రం రెండూ ముఖ్యమైనవేనని రచయిత్రి తన మనసులో మాట చెప్పారు. రచయిత ఏ విషయంలోనైనా ఇది పద్ధతికాదని చెప్పడం ఎంత అవసరమో... ఇది పద్ధతి... అని చెప్పడమూ అంతే అవసరమని ఆమె అభిప్రాయపడతారు. పొగడ్తలని, విమర్శలను ఒకేలా స్వీకరించే తాను తన పద్ధతి మార్చుకోవాల్సిన అవసరం కనబడుతోందంటూ నవ్వారామె. 'ఈ హేమ నవలలో కుటుంబజీవితం సుఖంగా, తృప్తిగా ఉండేలా చేసుకోవడానికి స్వార్థంగా ఆలోచించడం సరైన మార్గం కాదని, సమష్టి బాధ్యత భుజానికెత్తుకోవడంలోనూ సంతృప్తి ఉందని చెప్పే ప్రయత్నం చేశా'నన్నారు రామలక్ష్మి.

– పద్మశ్రీ యలమంచిలి ✦

## తడి తడి పెదవులు

మన పెదాల్లో సెబేషియస్ గ్రంథులుండకపోవడం వల్ల వాటంతట అవి తడిని సృష్టించుకోలేవు. కొద్ది మోతాదుల్లో లాలాజలం పెదవులకి అందినా, పెదాలు తడారిపోవడాన్ని (డీహైడ్రేషన్) నివారించలేదు. పెదవులపై కోకో బటర్ రాస్తే... తడి ఎండిపోకుండా కాపాడుతుంది. కొద్దిగా తేనె పెదవులపై రుద్దితే, అది గాలిలోని తేమని సంగ్రహించి, మన శరీరానికి అందిస్తుంది. దీనివల్ల పెదవులు తడిగా, మెత్తగా ముద్దొచ్చేలా కన్పిస్తాయి. ఎక్కువగా నీళ్లు తాగటం వల్ల కూడా పెదవులు ఎండిపోకుండా తడితడిగా కన్పిస్తాయి. గ్లిజరిన్‌తో ఇ-విటమిన్ గానీ గోధుమ గింజల నూనె గానీ కలిపి పెదవులకు పట్టిస్తే అవి మిలమిల మెరుస్తుంటాయి. పళ్లు తోముకున్న తర్వాత మీ పెదాల్ని కూడా మృదువుగా బ్రష్ చేస్తే... పగిలి ఎండిపోయిన చర్మం ఊడిపోయి పెదవులు ఆకర్షణీయంగా, అందంగా కన్పిస్తాయి.



నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# ఉద్ధవం

బి.వి.వైకుంఠరాజు

మార్చి 1979: సంపుటి: 2 సంచిక: 2

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. 1979వ సంవత్సరం మార్చి నెల **చతుర** లో ప్రచురించిన కన్నడ అనువాద నవల **'ఉద్ధవం'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

లౌక్యం, వాక్చాతుర్యం కలవారు ఎదుటి వారిని నమ్మించి డబ్బూ, కీర్తి ప్రతిష్ఠలూ సులభంగా సంపాదిస్తుంటారు. కష్టపడి పని చేయకున్నా ఎంతో చేస్తున్నట్లు, అందరి హితైషుల మన్నట్లు నటించి తమ పబ్బం గడుపుకుంటారు. ఆ కోవకు చెందిన మనిషే ఈ నవలలోని నాయకుడు. అమాయకులను బురిడీ కొట్టించే తెలివి తేటలుంటే చాలు, దళారీ పనులు చేసి ఓ వెలుగు వెలగవచ్చని ఈ నవల ఋజువు చేస్తుంది.

**ఇతివృత్తం**

రాగన్న ఒకప్పుడు మంచి ఉద్యోగంలోనే ఉన్నా అది పోయినప్పటి నుండి సమస్యలను ఎదుర్కొంటూనే ఉంటాడు. సంసారం గడవటం కష్టంగానే ఉన్నా మరో ఉద్యోగం కోసం ప్రయత్నించడు. తన వాక్చాతుర్యంతో, లౌక్యంతో దళారీతనం వృత్తిగా చేసుకుని రోజులు వెళ్ళదీస్తుంటాడు. జూదం, తాగటం, సిగరెట్లు వంటి అల వాట్లు వదులుకోడు. రుద్ర, నంజుండ అనే ఇద్దరు స్నేహితుల్లాంటి అనుచరులను వెంటేసుకుని తిరుగుతుంటాడు. సిగరెట్ల కోసం పళని కిళ్ళీ కొట్లో బాకీ పడ్డాడు. అది తీర్చమని పళని అడిగేలోపే మరికొన్ని సిగరెట్లు, డబ్బు అతడే ఎదురిచ్చేలా చాకచక్యంగా ప్రవర్తిస్తాడు. హోటల్‌లో కూర్చుని కాఫీ తాగుతుండగా రోడ్డుపై జనం మూగటం కనిపిస్తుంది. ఏం జరిగిందో చూడడానికి అందరితో పాటు పరుగెత్తుతాడు రాగన్న. ఈ సందడిలో హోటల్ వాడికి కాఫీ డబ్బులు ఎగ్గొట్టానన్న ఆనందంతో యాక్సిడెంటయిన స్థలానికి చేరుకుంటాడు. "రోడ్డు వెడల్పుగా వేసి ఉంటే ఈ యాక్సిడెంట్లు జరగకపోయేవి" అని అక్కడున్న ఓ వ్యక్తి మాటలు రాగన్నను ఆలో

చింపచేస్తాయి. పుట్టింటి కెళ్ళిపోయిన తన భార్యను తిరిగి తన ఇంటికి తెచ్చుకోలేక సతమతమవుతున్న పురుషోత్తమరావును కలిసి తను వాళ్ళిద్దరి మధ్య రాజీ కుదురుస్తానని చెప్పి యాభై రూపాయలు డబ్బు తీసుకుంటాడు. వాళ్ళకూ, వీళ్లకూ టోపీలు వేసి సంపాదించే డబ్బు, వచ్చింది వచ్చినట్టే ఎగిరి పోతుండటంతో అవన్నీ మానేసి కుదురుగా ఒకచోట పనిచేస్తే మంచిదేమో అనిపించినా కష్టపడి పనిచేయటం అలవాటు లేని తను ఉద్యోగం చేయలేనని నిర్ణయించుకుంటాడు.

రోడ్డు యాక్సిడెంట్ చూశాక రోడ్డు వెడల్పు చేయటం గురించి తన బుర్రలో




కొత్తగా మొదలైన ఆలోచన రుద్ర, నంజుండలకు చెప్పి అలా చేస్తే దుకాణాల వారి నుండి, బిల్డింగుల యాజమానుల నుండి, ఎంతెంత డబ్బు దండుకోవచ్చో వివరిస్తాడు. "రేపట్నించీ మీరెవరితో మాట్లాడినా రోడ్డు వెడల్పు చేస్తారట అవునా అనాలి. ఆ తరువాత మిగిలినవన్నీ నేను చూసుకుంటాను" అని స్నేహితులను పంపిస్తాడు. ఆ నోటా ఈ నోటా ఈ పుకారు ఊరంతా వ్యాపిస్తుంది.

పురుషోత్తమరావు భార్య పుట్టింటికి వెళ్ళిపోవడానికి రాగాన్నే కారకుడు. మొదట్లో ఆ భార్యాభర్తలను విడదీయడానికి ఫీజు వసూలు చేసుకుని తిరిగి వాళ్ళిద్దరినీ కలపడానికి మళ్ళీ ఫీజు వసూలు చేయడం మొదలుపెట్టాడు. పురుషోత్తమరావు మామగారితో మాట్లాడ్డం కోసం ఆయన స్నేహితుడైన భుజంగరావుని కలుస్తాడు. తీయని కబుర్లు చెప్పి పురుషోత్తమరావు విషయం కదుపుతాడు. "నేనంతా చక్కబరుస్తాలే. నువ్వేం బెంగ పెట్టుకోకు" అని భుజంగరావు నోట అన్పించిగానీ వెనుదిరగలేదు.

ఎవరితోనైనా, ఎంత పెద్దవారితోనైనా ధైర్యంగా మాట్లాడి సాధించుకునే నేర్పు రాగన్నలో ఉంది గనుక అతని దగ్గరికి ఎవరో ఒకరు వచ్చి పైరవీలు చేయించుకునేవారు. డబ్బులిచ్చేవారు. అందుకు అతడు రెండు మూడుసార్లు తిరిగేవాడు. పని నెరవేరితే మరికొందరికి వార్త అంది తమ పనుల కోసం రాగన్నను ఆశ్రయించేవారు.

రోడ్డు వెడల్పు పుకార్లు పుట్టించిన రాగన్న రోడ్లకు ఇరువైపులా ఉన్న దుకాణాల యజమానులను ఆందోళనలో పడేశాడు. మరి కొన్ని దుకాణాల యజమానుల దగ్గరికి వెళ్ళి రోడ్డు విస్తరింపచేస్తే వాళ్ళకు కలిగే ప్రయోజనాలు విడమర్చి చెప్తాడు. ప్రభుత్వం నుండి నష్టపరిహారంగా వచ్చే డబ్బుతో ఎలా మళ్ళీ కట్టుకోవచ్చో వివరిస్తాడు. కొత్త

దుకాణాలకు ఎక్కువ అద్దెలు వస్తాయని చెప్పటంతో "మీరీ విషయంలో శ్రద్ధ తీసుకోవాలి. మున్సిపల్ ఆఫీసుకు వెళ్ళి సంగతి కనుక్కురండి" అని రంగయ్యా అనే పెద్ద మనిషి రాగన్నకు డబ్బు సమర్పించుకుంటాడు. తనింట్లోనే ఈ చర్చల ఏర్పాటు చేసి టిఫిన్లూ, టీలూ, రాత్రికి మందు పార్టీలూ ఏర్పాటు చేస్తాడు.

ఏ పనీ చేయకుండానే చేసినట్టు చెప్పుకొనే వాళ్ళకే ఈ కాలంలో గౌరవం- అన్న సిద్ధాంతాన్ని ఎరిగినవాడు రాగన్న. "ఈ పేటలో ఉన్న జనమంతా కలిసి ప్రభుత్వాన్ని రోడ్డు వెడల్పు చేయమని కోరుతూ విజ్ఞాపన పత్రం రాయాలి. అయితే ఏ పనిచేసినా చాటున ఉండి చేయాలి. పబ్లిగ్గా చేయకూడదు" అని రంగయ్యకు చెబుతాడు. తను వెంటనే బయల్దేరి స్వాతంత్ర్య సమరయోధుడు, వృద్ధుడు, అనుభవజ్ఞుడు అయిన నారాయణరావుగారిని కలుస్తాడు. ఆయనను ఆప్యాయంగా పొగిడి, పలకరించి, ఆ రోజుల్లోని విశేషాలడిగి మరీ విన్నాడు. ఆ తరువాత రోడ్డు సమస్య వివరించి "మీరు ముందు నిలబడితే చాలు పనంతా మేం చూసుకుంటాం. మీరు మున్సిపాలిటీ ప్రెసిడెంటుగారినీ, మినిస్టర్ గారినీ కలిస్తే చాలు" అనేసరికి తను నాయకుడు కాబోతున్నందుకు నారాయణరావు సంతోషపడి సరేనన్నాడు.

విఘ్నేశ్వర యువక సంఘం అధ్యక్షుడు రాధాకృష్ణను కలుసుకుని రోడ్డు వెడల్పు చేయడానికి ప్రముఖ పాత్ర వహించమని కోరతాడు రాగన్న. నలుగురికే ఉపయోగ పడే పనిచేసి మంచి పేరు సంపాదించాలనుకునే రాధాకృష్ణ వెంటనే అంగీకరిస్తాడు. నారాయణ రావు గారి నాయకత్వంలో ఒక బృందం పురపాలక సంఘం అధ్యక్షుణ్ణి కలుసుకుని విజ్ఞాపన పత్రం ఇస్తుంది. "రోడ్డు వెడల్పు చేయాలంటే సమస్యలున్నాయి. ఇరువైపుల దుకాణాలున్నాయి. నేను ప్రపోజల్‌ను ప్రభుత్వానికి పంపిస్తాను. కానీ చాలా ఖర్చవుతుంది. వాళ్ళేమంటారో... మీరు మంత్రిగారిని కలుసుకోండి" అని పురపాలక సంఘాధ్యక్షుడు సలహా ఇస్తాడు. మంత్రి కూడా అదే హామీ ఇస్తాడు. ఇదంతా రాగన్న వల్లే జరుగుతోందని రంగయ్య, వీరయ్య, గిరియప్ప తదితరులు అతను అడక్కముందే నోట్లు అతని జేబులో కుక్కుతుంటారు. ఒకప్పుడు దారిద్ర్యం అనుభవించిన రాగన్న, తను మడత నలగని బట్టలు వేసుకోవటమే గాక భార్య పిల్లలకు నగలు, ఖరీదైన బట్టలు అమరుస్తాడు.

అతని సలహాలతో దుకాణాల యజమానులు అనధికారికంగా సంఘాన్ని స్థాపించుకున్నారు. ఈ సంఘంలో సభ్యులుగా ఉన్న వారంతా రోడ్డుకు ఒకవైపున్నవారే! మరొక వైపు వారెందుకు రాలేదు అని ఆరాదీస్తాడు రాగన్న. పడగొడితే నష్టపోయే రామయ్యలాంటివారు అటువైపున్నారని తెలుసుకుంటాడు. రాధాకృష్ణకు వినాయకచవితి ఉత్సవాలప్పుడు రామయ్య అధిక మొత్తంలో చందాలిస్తుంటాడు. అందుకు రామయ్యకు కోపం వస్తుందేమోనని భయపడిన రాధాకృష్ణకు ధైర్యం చెబుతాడు రాగన్న.

"ప్రజల క్షేమం కోసం తలపెట్టిన కార్యాలను నెరవేర్చడం మీ కర్తవ్యం కనుక వారం రోజుల్లో అక్కడికి వచ్చి పరిశీలిస్తాం" అన్న మంత్రి ఉత్తరం అందరిలో ఆశలు రేపింది. మంత్రి వచ్చి ట్రాఫిక్‌ను పరిశీలిస్తాడు. కమిషనర్‌తో, ఇతర సిబ్బందితో కలిసి రోడ్లు పరిశీలించి చర్చించి నెలరోజుల్లో పని ప్రారంభిస్తామని చెబుతాడు.

అంతలో రైల్వే బ్రిడ్జిపై మరో యాక్సిడెంటై డ్యూటీలో ఉన్న పోలీస్ చనిపోతాడు. ఆ సంఘటనతో రోడ్డు వెడల్పు కార్యక్రమం మరింత వేగం పుంజుకుంటుంది.

దుకాణాలు ఖాళీ చేయమని అందరిలాగే తనకూ నోటీసు రావటంతో రామయ్య

బెంబేలెత్తిపోయి రాగన్నకు కబురు పంపుతాడు. రాగన్న వెళ్ళగానే విషయం వివరిస్తాడు రామయ్య. రాగన్న అతడి బిల్డింగున్నవైపు రోడ్డు వెడల్పు ఇప్పుడున్నంత వరకే ఉండేలా చేస్తాననీ, రామయ్య భవనానికి ఏ హానీ జరగదని మాటిచ్చి వస్తాడు.

ఏదో అద్భుతం జరిగితే తప్ప అది సాధ్యపడదని ఉపాయం ఆలోచించి రాధాకృష్ణ దగ్గరికి వెళ్ళి చర్చిస్తాడు. అతడిని బయల్దేరదీసి పార్కుకి తీసుకొస్తాడు. "మనిద్దరం తల్చుకుంటే రామయ్యగారి బిల్డింగు నేలమట్టం కాకుండా చూసుకోవచ్చు.

"రాతి వినాయకుడిని చెక్కించి పార్కు చివర్న పాతిపెడదాం. నలుగురికంటా పడేలా చేసి, విగ్రహానికి పూజలు చేసి, ప్రతిష్ఠించి, గుడి కడదాం. అప్పుడిక ఇటు రోడ్డువైపు వచ్చి బిల్డింగు కూల్చడానికి ఎవరూ సాహసించరు. ఫలితంగా మనకు రామయ్యగారి నుండి బోలెడు డబ్బొస్తుంది. చెరి సగం" అంటాడు. అన్నట్లు చేస్తాడు కూడా! పార్కులో విఘ్నేశ్వరుడు ఉద్భవించి అదొక యాత్రా స్థలంగా మారటం అధికారులు వచ్చి చూసి రోడ్డు వెడల్పు కోసం ఒకవైపు ఎక్కువ స్థలాన్ని తీసుకోవాలని నిర్ణయిస్తారు. పురపాలక సంఘం ఎన్నికలలో రాగన్న రాధాకృష్ణను పోటీకి నిలబెట్టి గెలిపిస్తాడు. కొన్నాళ్ళకు రాధాకృష్ణకు గర్వం పెరిగి తనను పట్టించుకోకపోవటంతో ఒక కుట్ర పన్ని అతడిని నలుగురిలో తలెత్తుకోలేని రీతిలో అవమానిస్తాడు రాగన్న. రాగన్న పేరు మాత్రం బయటికి పొక్కదు.

"రోడ్డుకు అటువైపు వినాయకుడు ఉండటం వల్ల ఆ వరుస జోలికి ఎవరూ వెళ్ళరు. ఇక ఇటువైపు మనం ఉంటున్నవైపు రక్షణ లేదు కనుక ఇటు కూడా ఒక దేవుడొస్తే ఎవరూ అడుగుపెట్టరు. అటు వినాయకుడు ఉద్భవించాడు కనుక ఇటు వైపు వాళ్ళ బాబు ఉద్భవించాలి" అని రంగయ్యకు, అన్నట్లుగానే ఇతర అనుచరులకు చెబుతాడు. ఉపాయంతో శివలింగం తెప్పించి ఇటువైపు శివలింగం ఉద్భవించిందని నలుగురినీ నమ్మించి గుడి కడతారు. ఆ తరువాత రోడ్డుపని పూర్తవుతుంది. రోడ్డు వంకరటింకరగా లెవెల్ లేకుండా పూర్తవుతుంది. పని మొదలు పెట్టినందుకు పూర్తయిందనిపించారు. ఎన్నో సమస్యలకూ, ఇద్దరు దేవుళ్ళ ఉద్భవానికి కారణమైన ఆ రోడ్డు ఎన్నో రహస్యాలను తన కడుపులో దాచుకుని ఎప్పట్లాగే పడుకునుంది. అంతా ముగిసేసరికి రాగన్న రాఘవేంద్రరావు గారిగా చలామణవుతుంటాడు. తనకు స్వంత ఇల్లేగాక మూడు దుకాణాలు కట్టుకుని అద్దెలకిస్తాడు. సంఘంలో గౌరవం గల పెద్ద మనిషిగా, అందరికీ కావలసిన మనిషిగా గౌరవం పొందుతుంటాడు.

మూలం కన్నడ నవలే అయినా శ్రీకంఠమూర్తి అనువాదం బాగుంది. తెలుగు నవలే అన్పిస్తుంది తప్ప అనువాద నవలలా అనిపించదు. ✦



# జనవరి 2006 'చతుర' నవల
# మాయ మబ్బులు
## పై సమీక్షలు



## వాస్తవానికి ప్రతిబింబం

(మొదటి బహుమతి: రూ. 100/- పొందిన సమీక్ష)

ఒక వ్యక్తి ఉన్నత శిఖరాలను అధిరోహించేందుకు న్యాయమైన దారి ఒక్కటే. అకుంఠిత దీక్ష, శ్రద్ధ. కాని పతనానికి మాత్రం అడుగడుగునా జారుడు మెట్లే. ఆనందానికి, పదిమందిలో గుర్తింపుకి, టెన్షన్ నుండి విముక్తికి ఆధారమయిన పాట, రచన, నటన వంటి కళలు వ్యక్తిగతంగా తమ భవిష్యత్ నిర్మాణానికి ఎంతవరకు సహాయపడతాయో ప్రతి విద్యార్థీ తెలుసుకోవాలి. అద్భుతమైన గాత్రమున్న ప్రతివాడూ 'ఘంటసాల' కాలేడు. జీవితంలో విజయం ద్వారా చరిత్ర సృష్టించాలి గాని, ప్రేమించి ఆత్మహత్య చేసుకునో, పిచ్చివాళ్లుగా మారో, హత్యలు చేసో చరిత్ర సృష్టించలేరు. ఈ చేదు నిజాలను ప్రతి విద్యార్థీ గ్రహించాలి.

పుష్కలంగా తెలివితేటలు, తన జీవితాన్ని కొడుకు భవిష్యత్తుకి ముడుపుకట్టే తల్లి, చక్కని మార్గం చూపే మాస్టారు... ప్రశంసలకు లొంగి ఇన్ని అవకాశాలను బూడిద పాలు చేసుకున్న బుద్ధిహీనుడు రాము, హాస్టల్‌లో అతని స్నేహితులంతా అతనికి ఉపకారం చెయ్యటమే కాక చదువుకొమ్మని హెచ్చరించినవారే. 3 సం॥లు అతను స్వగ్రామం వెళ్ళకపోతే మాస్టారు వచ్చి అతని స్థితిని తెలుసుకోలేకపోవటం వల్ల కొంతవరకూ మాస్టారి పాత్ర బోసిపోయింది. తల్లి నారాయణమ్మ, మాస్టారి మరణాలకి (పరోక్షంగా) కారణమవడం ఆ పాత్రపట్ల ఆగ్రహం తెప్పిస్తుంది. రాధాకృష్ణ ఎదురుగా బోయ్‌గా ఉండలేక ఉద్యోగం వదులుకోవటం, ఆదెయ్య హోటల్‌లో సూపర్‌వైజర్ నుంచి అంట్లు తోముకునే స్థాయికి దిగిపోవటం అన్నీ అవలక్షణాలే అతనిలో... చివరికి స్నేహితుడు సురేష్ అతనిని కళాకారుడుగా నిలబెట్టడానికి ముందు చదువుకొమ్మని ప్రోత్సహించి ఒప్పించడంతో 'మాయమబ్బులు' తొలగిపోతాయి. అదే ఈ నవలకి కొసమెరుపు. చక్కటి ముగింపు. ఈ నవల చదివిన ఏ పాఠకుడైనా పబ్లిక్ పరీక్షల సమయంలో క్రికెట్ మ్యాచ్‌లు, సినిమాలు చూస్తూ టి.వి.ల ముందు భవిష్యత్తుని బలిచేసుకొంటున్న ఏ విద్యార్థిని రక్షించినా ఈ నవలకు సార్థకత్వం, ప్రయోజకత్వం చేకూరినట్లే.

**–బాడ సుజాత,** మొయిద, నెల్లిమర్ల

## విజయం ఊరికే రాదు

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

విద్యార్థి అనేవాడు ఓ లక్ష్యమేర్పరచుకొని సలక్షణంగా ఆ లక్ష్యం నెరవేరే కొరకు తగు సాధన చేయాలనీ, అల్లాటప్పాగా కాలేజి జీవితం ఓ భూతల స్వర్గమని స్వప్నలోకంలో విహరించగూడదనీ ఆదిరెడ్డి మావుళ్ళు నవల "మాయమబ్బులు" యువతను హెచ్చరి

స్తుంది. నవల చదువుతుంటే నాకు నా చిన్న నాటి ఇంగ్లీష్ టెక్స్ట్‌లోని సూక్తి జ్ఞప్తికి వచ్చింది. "సక్సెస్ ఇన్ లైఫ్ ఈజ్ నాట్ ఈజీ సెక్యూర్డ్, ఇట్ ఓన్లీ కమ్స్ టు దోజ్ హూ వర్క్ హార్డ్ అండ్ కంటిన్యూ లెర్నింగ్". విజయమనేది ఊరకనే రాదు. ఎవరైతే ఇతోధికంగా శ్రమిస్తారో, నిరంతరంగా చదువుతారో, వారినే విజయలక్ష్మి వరిస్తుంది. నవలలోని ప్రధాన పాత్రధారి 'రాము'కు పై కళలపై ప్రేమ. అయితే అతడు నేలవిడిచి సాము చేశాడు! తన తల్లి నారాయణమ్మ ఎలా చెమటోడ్చి తన చదువుకు డబ్బు పంపిందో, మాస్టారు సుందరయ్య తన భావి జీవితం గురించి తల్లికి ఎంత గొప్పగా వర్ణించి చెప్పాడో వాటన్నింటిని మబ్బుల్లా చెదరగొట్టిన మూర్ఖత్వంలో కూరుకుపోయాడు. చదువును అశ్రద్ధ చేసినందుకు, అంతిమ పరీక్షలో నెగ్గక, చివరకు తల్లిని, మాస్టారును కోల్పోయి ఘంటశాలగా కాక వంటశాలకు కూడా పనికి రాకుండా, సాపాటుకే పాటుపడే దుస్థితికి చేరుకొన్నాడు. అయితే మంచి మిత్రుడు సురేష్ వల్ల రాము, తన భవితకు చదువే మూలమని తెలుసుకొని విద్యార్థతను పెంచుకోవటానికి ఉద్యుక్తుడవటం, రచయిత నవలకు కల్గించిన చక్కని ముగింపు! జీవితం బాధ్యతారహితంగా, మార్గవిహీనంగా, గమ్యశూన్యంగా గడపవలసింది కాదనీ, చేతన సహితంగా చలనశీలంగా సాగించవల్సినదేననే సందేశాన్ని నేటి యువతకు ఈ నవల చాటి చెబుతుంది.

*– రంగు చక్రపాణి, హనుమకొండ.*

---

# కనువిప్పు కలిగితే...

## (మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

సందేశ ప్రాధాన్యతగల సాహిత్యాన్ని పాఠక లోకానికి పరిచయం చేయటంలో ప్రప్రథమ స్థానాన్ని కైవసం చేసుకున్నది "చతుర" అనటంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు. నేటి కాలంలో యువతరం ప్రధానంగా ఎదుర్కొంటున్న సమస్య స్నేహితుల ప్రభావం. ఆ ప్రభావంలో పడి వారు తమ ఉజ్జ్వల భవిష్యత్తును చేజేతులా ఎలా పాడుచేసుకుంటున్నారన్న వాస్తవాన్ని కళ్ళకు కట్టినట్లుగా రచయిత 'మాయమబ్బులు' నవలలో చిత్రీకరించారు.

ఈ నవలలోని 'రాము' చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్న సామెతకు నిలువెత్తు నిదర్శనం. ఊహల పల్లకిలో ఊరేగి ఊరేగి చివరకు ఆ భ్రమలలో నుండి బయటపడి వాస్తవ లోకానికి వచ్చేటప్పటికి అంతా శూన్యం. మైనం ముద్ద లాంటి రామును 'భ్రమల లోకంలో' బతికేటట్లుచేసిన స్నేహితులు రాధాకృష్ణ, నాయుడు, సూర్యం, ప్రదీప్. వారు చెప్పిన మాటలకు పరవశుడై తనమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న తల్లికి అన్యాయం చేసిన దురదృష్టజాతకుడు. పథనిర్దేశకుడైన గురువుగారి మాట చెవిని పెట్టిన ఆశోపహతుడు.

ఈ నవలలో ఆదర్శ విద్యార్థి సురేష్. విద్య నేర్చుకోవాల్సిన సమయంలో విద్యాభ్యాసమే ప్రథమ కర్తవ్యమని రచయిత సురేష్ పాత్ర ద్వారా సూచన చేశాడు. సూర్యం, రాధాకృష్ణ లాంటి వాళ్ళు రామును మాయతెరలలో కప్పివేసినా తాము మాత్రం మంచి భవిష్యత్తును పొందారు. ఇలాంటివాళ్ళు ఎందరో బతకనేర్చినవాళ్ళు. పల్లెసీమల నుండి వచ్చిన అద్దం లాంటి మనస్సున్న విద్యార్థులు ఎందరో ఇలాంటివాళ్ళ బారిన పడకుండా చదువే ప్రధానంగా భావిస్తే మంచిది. రాముకు అన్ని కళలలో ప్రవేశమున్నా అవకాశం కలిసి రాలేదు. 'రాము' జీవితాన్ని చూసి కొందరికయినా కనువిప్పు కలిగితే రచయిత లక్ష్యం నెరవేరినట్లే.

*– ఎన్.విజయలక్ష్మి, ఒంగోలు*

## చక్కని హితబోధ

(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

సంగీత సాహిత్య కళారంగాల్లో అభినివేశం ఉంటే దానితో జీవితంలో ఉన్నత శిఖరాల్ని అధిరోహించవచ్చనే అతివిశ్వాసంతో బతుకుతెరువునే ఫణంగా పెట్టి నేల విడిచి సాము చేసే ఎందరో కళాకారులకు కనువిప్పుగా నిలుస్తుందీ నెల నవల 'మాయమబ్బులు'. కళాకారునిలో ఉన్న ప్రతిభను కొండంతలుగా చెబుతూ, ఇంద్రుడివి చంద్రుడివి అని పొగుడ్తూ కళాకారుల్ని కాలక్షేప బఠానీల్లా వాడుకునేవారు నేటి సమాజంలో కోకొల్లలు. అభిరుచులే అన్నపానీయాలు ఆకాశహర్మ్యాలు సృష్టిస్తాయన్న భ్రమలో ఊహాలోకంలో విహరిస్తూ, తల్లి కన్న కలల్ని కల్లలుగా మిగిల్చి జీవన మాధ్యమాన్ని నిర్లక్ష్యం చేసి తప్పు తెలుసుకుని బాధపడుతూ కళ్లు తెరిచిన సమయాన ఆసరాగా నిలవడానికి ఒక్క భజన పరుడూ లేడు. వర్తమానంలో కళల్ని ప్రవృత్తిగా ఎంచుకుని పట్టెడు మెతుకులకై జీవన సరళిలో వృత్తి ఒకటి తప్పనిసరి అని రచయిత రామూ పాత్ర ద్వారా చక్కగా వివరించారు. కాలం కలిసి వస్తే అవకాశం తలుపు తట్టినప్పుడు వ్యక్తి కనీస అవసరాల్ని స్థిరంగా ఏర్పరచుకున్న నేపథ్యంలో కళాకారుడిగా ఒక ప్రయత్నం సర్వదా అభిలషణీయం.

చేయాల్సిన పనిని చిత్తశుద్ధితో చేయాలని, విద్యాభ్యాస సమయంలో నిర్లక్ష్యం పనికిరాదనీ, అభిరుచుల్ని విరామ సమయంలో మనోరంజనానికి మిగిల్చి లక్ష్యసాధన కోసం కళాకారునిగా సంపూర్ణ విశ్వాసంతో కలల సాకారానికి కృషి చేయాలని నవల ద్వారా చక్కని హితబోధ చేశారు రచయిత.

ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురు చూసే కన్నా వర్తమానంలో మనుగడకు ఒక ఆలంబన ప్రతి వ్యక్తికీ అత్యవసరం. ద్వితీయాన్ని ప్రాథమికం చేసి బాధలు కోరి తెచ్చుకోవడం సమంజసం కాదు. సగటు తల్లి ఆశ... సగటు కళాకారుని ఆవేదన మిళితమైన ఈ రచన ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. ప్రతి కళాకారుడూ చదవాల్సిన నవల.

*- గుండాన జోగారావు,* రాయగడ.

---

## ప్రతి యువకుడూ చదవాలి

(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

జీవితంలోకి అడుగుపెడ్తూ ఉన్న ప్రతి యువకుడు చదవవలసిన నవల ఇది. మన దేశంలో లలిత కళలు సత్కాలక్షేపానికి ఆత్మానందానికి మాత్రమే ఉపయోగపడ్తున్నాయి. అదృష్టం కలసి వచ్చి ఉన్నతస్థాయికి ఎదిగిన వారి సంఖ్య వేళ్ళపై లెక్కబెట్టవచ్చు అలాంటివారిని చూసి మనం కూడా అంతటివారమవుతామని అనుకోవటం భ్రమ. ఆ భ్రమలో పడి యువకులు తమ జీవితం నాశనం చేసుకుంటున్నారు.

లలిత కళలు భగవంతుడు ఇచ్చిన వరం కాబట్టి వాటిని అభివృద్ధి చేసుకుంటూ జీవితంలో ఎంతవరకు ఉపయోగపడ్తాయో అంతవరకే ఉపయోగించుకుంటూ జీవనోపాధికి ఇతర మార్గాలు అవలంబించటం తప్పనిసరి.

కాలేజిలలో చదువుల కోసం చేరి ప్రేమ అంటూ చేతులు కాల్చుకున్న జగ్గు భ్రమలకు లోనై జీవితం పాడు చేసుకున్న రాము ఒక వైపు, సూర్యం, సతీష్, మనోజ్ ల విజయవంతమైన జీవితం ఇంకోవైపు యువకులకి మార్గదర్శకం. చక్కని శైలితో, విడవకుండా చదివించిన నవల మాయమబ్బులు.

*- కె.ఆర్.* హైదరాబాద్.

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2006

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804; & WWW.eenadu.net.



## విచిత్ర అలవాటు

ఈ పిట్టమ్మ పక్కనున్న కీటకంతో దోస్తీ కట్టిందనుకున్నారా? కాదు సుమా! ఆ కీటకాన్ని ఓ ముల్లుకు ఉరి తీసి తాపీగా భోంచేద్దాంలే అనుకుని విశ్రాంతి తీసుకుంటోంది. ఐరోపా, ఆసియా, ఉత్తర అమెరికాలలో కనిపించే ఈ పక్షి కీటకాలు, బల్లులు వంటి వాటని వేటాడి ఇలా చెట్టుకొమ్మలకు వున్నా ముల్లుకో, ఫోర్క్‌లా ఉండే చిన్న కొమ్మలకో గుచ్చి కావలసినప్పుడు ఆరగిస్తుంది.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78

# the fine art of
## selecting the right school for your child

There are only two lasting gifts
we can hope to give our children.
One of these is 'roots' the other 'wings'

Silver Oaks believes that... The kids in our classrooms are infinitely more important than the subject matter we are teaching them. We keep in mind that a child is a person. Just because they happen to be a little shorter than us it doesn't mean they have no thinking power. The school should be an exciting place for students and teachers where each day is a revelation of new horizons.

**To be 'Fit'**
- Basket Ball
- Volley Ball
- Track & Field
- Skating
- Karate
- Swimming
- Trekking
- Tennis
- Aerobics
- Games

**To be 'Fine'**
- Music-Band/Chorus
- Dance, Drama
- Debate/Extempore
- Chess Club
- Student Council
- Literary magazine
- Adventure Clubs
- Painting Club
- Craft Club, Computer Club

Infrastructural support is given from:
- A 25 meter swimming pool
- 3000 sq.ft Skating Rink
- Play Ground, Tennis court
- Multi purpose hall
- Outdoor Play Equipment (swings, sandbox, slides, see-saw, merry-go-round)
- Music Room, Art room
- Dance Bay
- Networked Computer Station




Formerly the VISAKHA CENTRAL SCHOOL

hemacreativehouse@gmail.com

**Bachupally, Miyapur - Medchal Highway, Hyd- 072, Telefax : 2304 7777, 2304 8888, Website : www.silveroaksschool.com**